ఫిబ్రవరి 2014
రూ. 12/-

# విపుల

## విశ్వకథా వేదిక

✦ మపాసా ఫ్రెంచ్ కథ
వీలుకాని విరహం ... 06




**నే**టితరం పాఠకలోకం కోసం 'ముప్ఫైఅయిదేళ్ల నాటి విపుల కథల్ని' తిరిగి అందిస్తున్నాం. అనువాద కథల్ని మాత్రమే ఈ శీర్షిక కింద ఇస్తున్నాం. సుప్రసిద్ధ కథకులు విపుల ఆవిర్భావం నుంచి ఒక్కో సంచికను కూలంకషంగా చదివి వీటిని ఎంపిక చేశారు. 1979 ఫిబ్రవరి విపుల నుంచి దేవరాజు మహారాజు ఎంపిక చేసిన ఫ్రాంక్ ఓ కానర్ ఐరిష్ కథ సంధి మీకోసం! ఈనెల 21న పుట్టినరోజు జరుపుకుంటున్న దేవరాజు మహారాజు గారికి శుభాకాంక్షలు!

# సంధి

"రోజూ ఇలా దేవుడికి దణ్ణం పెట్టుకుంటుంటే నాన్న తిరిగి వచ్చేస్తారా?"

"అవును బాబూ! తిరిగొచ్చేస్తారు. అందుకే..." అమ్మ ఇంకేం మాట్లాడలేదు. అమ్మ కళ్ళలో నీళ్లు తిరిగాయి. నేను గబుక్కున తల దేవుడి వైపు తిప్పుకుని కళ్లు గట్టిగా మూసుకున్నాను.

"దేవుడా! యుద్ధాన్ని త్వరగా ఆపు చెయ్. నాన్న త్వరగా ఇంటికి వచ్చేలా చెయ్" అంటూ ప్రార్థించాను. తరవాత అమ్మ చెయ్యి పట్టుకుని నెమ్మదిగా ఆ చర్చి మెట్లు ఒక్కటొక్కటిగా దిగాను. ఇద్దరం ఇంటి మొహం పట్టాము.

యుద్ధం అంటే ఏమిటో నాకు తెలీదు. అది ఆగకపోతే నాన్న ఎందుకు ఇంటికి రారో తెలీదు. నాకు తెలిసిందల్లా ఒక్కటే-నాన్న రాకపోతే అమ్మ మనసు బాగుండదు. నాకూ బాగుండదు.

నాకిప్పుడు అయిదో ఏడు నడుస్తోందట! ఈ అయిదేళ్లకే నాన్నని నేను చూసిన సమయాలు చాలా తక్కువ. 'నాన్న' అనుకోగానే నాకు ముందుగా చీకటి రాత్రి గుర్తొస్తుంది.

గదిలోని కొవ్వొత్తుల వెలుతురు గుర్తొస్తుంది. ఆ చీకట్లో- కొవ్వొత్తుల వెలుతుర్లో నిద్ర మధ్యలో కళ్లు తెరిచిన నాకు మంచం మీదుగా వంగి, నా మొహంలో మొహం పెట్టి చూసే ఆకారం. ఖాకీ డ్రస్సూ, పెద్ద బూట్లూ వేసుకుని, తెలతెలవారే వేళ నేను లేచీ లేవక ముందే లేవదీసి బుగ్గల మీద ముద్దులు పెట్టుకొని దించేసి టక టకలాడే బూట్ల చప్పుడుతో వెళ్ళిపోయే వ్యక్తి ఆకారం గుర్తొస్తుంది. ఆయనే నాన్న. ఆయన్ని తలుచుకుంటే చాలు, నా మనసు ప్రేమతో, సంతోషంతో నిండిపోతుంది.

నాన్న అలా వెళ్ళిపోయినా ఆయన వచ్చి వెళ్ళిన గుర్తులు మాత్రం ఇంట్లో కొన్నాళ్ళ దాకా కనిపిస్తూనే వుండేవి. ఆయన తెచ్చే చాక్లెట్లు తిని, యుద్ధపు టాంక్ మోడల్ బొమ్మలతో ఆడుకునేవాణ్ని.

ఒకోసారి నాన్న రోజుల తరబడి వుండి వెళ్తుంటారు. అప్పుడు మరీ బావుంటుంది. తెల్లవారు ఝూమున నిద్ర మెలుకువ రాగానే వెళ్ళి అమ్మకీ, నాన్నకీ మధ్యలో పడుకుంటే వెచ్చగా ఎంతో బావుంటుంది. నాన్నగారు సిగరెట్ కాలుస్తుంటే, ఆ పొగ

ఎంత కమ్మటి వాసనేస్తుందో! ఆయన గడ్డం చేసుకుంటూ గడ్డం నిండా సబ్బు పెట్టుకుంటే... ఆ సబ్బుని బ్లేడుతో గీకేస్తుంటే ఎంత సరదాగా వుంటుందో చూడటం!

అందుకే నాకు నాన్నంటే ఇష్టం. నేనూ అమ్మతో పాటు రోజూ చర్చికి వెళ్ళి "త్వరగా యుద్ధం ఆపేసి వెంటనే నాన్నని పంపించు" అని ప్రార్థిస్తూంటాను.



దేవుడు మా ప్రార్థన విన్నాడు. ఓ ఉదయం నేను లేచీ లేవకముందే నాన్న వచ్చేశారు. అచ్చంగా వచ్చేశారని విని నాకు సంతోషం ఆగలేదు! ఇంక నించీ రోజూ నాన్న దగ్గర పడుకోవచ్చు. నాన్నతో కబుర్లు చెప్పు

కోవచ్చు. షికారు కూడా వెళ్లచ్చు. అదే నా సంతోషం!

నాన్న వచ్చిన తర్వాత నాలుగయిదు రోజుల దాకా అన్నీ నేననుకున్నట్టే జరిగాయి. నేనూ, నాన్నా, అమ్మా కలిసి షికారుకి వెళ్ళాం. సినిమా కూడా చూశాం.

అయితే తరవాతే పరిస్థితి మారింది. రోజూ అమ్మా- నాన్నా కలిసి మాట్లాడుకుంటూ కూర్చోసాగారు. నేను మధ్యలో ఏదో చెప్పబోతే అమ్మ కసిరేసింది!

"లారీ! నువ్వు అల్లరి చెయ్యకు- నాన్నగారితో మాట్లాడేటప్పుడు అలా అల్లరి చెయ్యకూడదు. వెళ్ళి ఆడుకో!" అంది.

నాకు కోపం వచ్చింది.

"నాన్నతో నువ్వే ఎందుకు మాటాడాలి? నేను మాట్లాడకూడదా? " అని అరిచాను.

"మేం పెద్దవాళ్ళ విషయాలు మాట్లాడుకుంటున్నాం. మధ్యలో గొడవచెయ్యకూడదు" అంది అమ్మ!

అలాగే, షికారెళ్ళినప్పుడూనూ! ఏదన్నా తమాషా కనిపిస్తే నిలబడి చూడటానికి వీల్లేదు. నాన్న లాక్కుపోతారు! మళ్ళా ఆయనకి ఎవరన్నా కనిపిస్తే బోలెడంత సేపు కబుర్లు చెబుతూ రోడ్డు మీద ఆగిపోతారు. నాకు విసుగెత్తి 'పోదాం నాన్నా' అంటూ చొక్కా గుంజితే తిడతారు!

రానురాను నాన్నా- అమ్మా కలిసి నన్ను నిర్లక్ష్యం చేసెయ్యటం మొదలు పెట్టేశారు.

మళ్ళా దేవుడికి దణ్ణం పెట్టుకుంటే యుద్ధం వచ్చేసి, నాన్న మళ్ళీ వెళ్ళిపోతారా? అలాగైతేనే బావుంటుంది- అమ్మ అయినా నాతో జట్టుగా వుంటుందనిపించింది. కానీ, అలా జరగదుట! "యుద్ధం దేవుడు తెప్పించడు, చెడ్డవాళ్ళే యుద్ధం తెప్పిస్తారు. దేవుడు యుద్ధాలు ఆపేస్తాడు" అని చెప్పింది అమ్మ. ఇంకేంచెయ్యాలి?

★ ★ ★

పొద్దున్నే నిద్దర మెలుకువొచ్చేసింది. ఒక్కడికీ భయం వేసింది. అలవాటుకొద్దీ వెళ్ళి అమ్మకీ, నాన్నకీ మధ్య పడుకున్నాను. అమ్మ కళ్ళు తెరిచింది.

"అమ్మా! ఇంకా లేవలేదా నువ్వు? " అన్నాను.

"ష్!... మాట్లాడకు. నాన్న లేస్తారు" అంది అమ్మ.

"ఏం? నాన్నారికేమయింది? లేస్తే ఏం? " అడిగాను.

"పాపం, రాత్రి బోలెడుసేపు చదువుకుని పడుకుంటారా! పొద్దున్నే లేపకూడదు" రహస్యంలా చెప్పింది అమ్మ. రాత్రి ఎందుకు చదువుకోవాలి? పొద్దున ఎందుకు నిద్రపోవాలి? అనుకున్నాను. కాసేపాగి మళ్ళీ అడిగాను.

"అమ్మా! ఇవాళ మనం ఎక్కడి కెళు



తున్నాం? ”

“మాట్లాడొద్దన్నానా? లేచి నీ గదిలోకి పో…” కసిరింది అమ్మ.

ఇంతలో నాన్న లేవనే లేచారు “అబ్బబ్బ! పొద్దున్నే డిస్టర్బెన్స్” అన్నారు కోపంగా.

అసలు అమ్మదగ్గరే పడుకోవాలని ఉంటుంది నాకు. అలాంటిది, “పెద్దవాడివవుతున్నావ్. ఒంటరిగా పడుకోవటం నేర్చుకోవాలి. పసిపాపాయిలాగా అమ్మదగ్గర పడుకోకూడదు” అంటూ అమ్మకి దూరం చేసేశారు నన్ను. ఇప్పుడేమో పొద్దున్నే కూడా రావొద్దంటున్నారు.

“అసలు మీరెందుకు పడుకోవాలి అమ్మ దగ్గర? మీరేమన్నా చిన్న పిల్లాడా? ” అరిచాను కోపంగా.

“షటప్ రాస్కెల్” అన్నారు నాన్న. అమ్మ నన్ను మంచం దింపేసి బయటికి లాక్కుపోయింది. వంటింట్లోకి వెళ్ళి, ఓ కప్పులో టీ నాన్నకివ్వటానికి బయల్దేరింది.

“నాకూ టీ కావాలి” అన్నాను.

“నా కప్పులో తాగుదుగానిలే” అంది.

“నాకొద్దు. నాకు సొంత కప్పు కావాలి”

“చిన్నపిల్లలు ఎక్కువ టీ తాగకూడదు”

“మరి నేను చిన్న పిల్లాణ్ణి కాదుగా! నీ దగ్గర పడుకోవటంలేదుగా!” అన్నాను.

“నోర్ముయ్! అల్లరి వెధవా” గట్టిగా అరిచారు నా మాటలు విన్న నాన్న. ఏడుస్తూ వచ్చేశాను. ఆ రోజు రాత్రి పడుకోబెడుతూ చెప్పింది అమ్మ-

“పొద్దున్నే లేచి, నాన్నార్ని లేపెయ్యకు!”

“అలాగే” అన్నాను నేను. నన్ను పడుకోబెట్టి అమ్మ వెళ్ళిపోయింది.

మరునాడు పొద్దున్నే లేవగానే అలవాటుగా మంచం దిగబోయాను. అమ్మ చెప్పినమాట గుర్తుకొచ్చింది. అలాగే పడుకున్నాను మళ్ళీ. కిటికీలోంచి బయటకు చూస్తూంటే ఎంత బావుందో! తెల్లతెల్లని పిట్టలు చెట్టుమీంచి లేచి ఎగురుతున్నాయి. చెట్టుకి వున్న పువ్వులు అందంగా కదులుతున్నాయి. ఉడతపిల్ల ఒకటి వాళ్లమ్మని తప్పించుకుని పారిపోతోంది. దానివెనకే వాళ్లమ్మ కూడా పరిగెడుతోంది. వాటిని చూస్తూ పడుకున్నాను.

ఎంతసేపని అలా? చాలాసేపయ్యాక లేచి నా బొమ్మలన్నీ సరిచూసుకున్నాను. తిరిగే రైలుబండితో ఆడుకున్నాను.

ఇంకా అమ్మ లేవలేదు! నేనే లేచి వాళ్ళ గదిలోకి వెళ్ళాను.

అమ్మ, నాన్నా ఇంకా నిద్దరపోతున్నారు. వెళ్ళి ఇద్దరిమధ్యనా పడుకున్నాను. అమ్మ కళ్ళు తెరిచింది.

“అరె, నువ్వు లేచేశావా? ” అంది.

“ఆఁ… చాలాసేపు అక్కడే ఆడుకున్నాను. ఇంకా మీరు లేవలేదు…”

“పోన్లే- మాట్లాడకుండా పడుకో” అంది అమ్మ. కాసేపయ్యాక అడగబోయాను- “అమ్మా…”

“మాట్లాడొద్దు- నాన్న లేస్తారు అన్నానా? ”

“అబ్బబ్బ! ఎప్పుడూ నాన్న లేస్తారంటావే? అసలు నాన్ననే నా రూమ్‌లో పడుకోమను రోజూ!” అరిచాను.

నాన్న లేవనే లేచారు. “టైమెంతయింది? ” అన్నారు.

“ఇంకా పొద్దెక్కలేదులెండి… లారీ వచ్చి పడుకున్నాడిక్కడ. మీరు పడుకోండి” నెమ్మదిగా అంది అమ్మ. మళ్ళా నన్ను బెదిరించింది “ఈసారి మాట్లాడావో జాగ్రత్త”

“వీడికి నిద్దర పట్టదా ఏం? ” నాన్న చిరాగ్గా అన్నారు.

“నేనేం నీలాగా సోమరిపోతునికాదు” కసిగా అరిచాను, బళ్ళో మేష్టారు చెప్పిన మాటలు గుర్తొచ్చి.

“నోర్ముయ్! వెధవ ముదిమాటలూ నువ్వూనూ..” నాన్న కోపంగా అరిచారు.

“నువ్వే నోర్ముయ్! నువ్వే యుద్ధంనించి వచ్చేసి, నన్ను తిడుతున్నావ్. అమ్మదగ్గర

పడుకోకుండా చేస్తున్నావ్! నువ్వే మళ్ళీ యుద్ధంలోకి ఫో" అనేశాను నేనూ కోపంగా.

నాన్నకి బాగా కోపం వచ్చినట్టుంది. లేచి నా వీపుమీద గట్టిగా కొట్టారు.

"ఊరుకోండి. వాడికింకా మీరు కొత్త.." అమ్మ సర్దబోయింది.

"కొత్తయితే.. వాడికా ముదిమాటలు ఏవిటసలు. బుద్ధి వుండఖ్ఖర్లా...?"

"నీకే బుద్ధి వుండఖ్ఖర్లా...?" గట్టిగా అరిచి, మంచం దిగి నాన్నకి అందకుండా పరుగెత్తాను.

ఆ రోజునించి నాన్నకీ, నాకూ బాగా చెడింది. వీలయినంతవరకూ నన్ను తిట్టాలనే చూస్తారాయన. వీలయినంత వరకూ

**అనువాదం : పి.వి.ఆర్. కుమార్**

ఆయన వుండగా అల్లరి చెయ్యాలనిపించ సాగింది నాకు. దాంతో తరచూ కొట్టటం ప్రారంభించారు నాన్న. అమ్మకూడా ఇప్పుడు నన్ను వెనకేసుకురావటం లేదు.

పులిమీద పుట్రలాగా ఇంకో సంఘటన జరిగింది. నాకు తమ్ముడు పుట్టాడు. వాడు నాకు మరో శత్రువులాగా తయారయ్యాడు. పగలంతా నిద్దరే వాడికి. ఇప్పుడు నేను పగలుకూడా ఆడుకోవటానికి వీల్లేకుండా పోయింది. ఇదివరకు పొద్దున మాత్రమే, 'నాన్న లేస్తారు' అనే అమ్మ ఇప్పుడు పగలంతా ఎప్పుడు ఆడుకుంటున్నా, "బాబు లేస్తాడు. అరవకు" అనటం మొదలెట్టింది.

వీడు పగలంతా ఎందుకు నిద్దరపోతాడో తెలీదు! వీడి నిద్దరతో నాకు ఆటలకి వీలవటంలేదు. ఓసారి అందుకే వాడిని లేపబోయాను. అమ్మ చూసింది. మళ్ళా నాకు దెబ్బలు పడ్డాయి! కొట్టింది కొట్టినట్టు వూరుకోక నాన్నతో కూడా చెప్పింది.

"ఈ పరాయి మనిషితో నామీద రిపోర్టు చేశావంటే నేనింక ఇంట్లో వుండను" అన్నాను అమ్మతో.

"ఏమిట్రా ఆ వాగుడు? మళ్ళీ అను.." అంటూ మీదిమీదికొచ్చారు నాన్న.

"అవును. నువ్వే పరాయివాడు. యుద్ధంలోంచి వచ్చేసి, రోజూ నాతో దెబ్బలాడుతున్నావ్. అమ్మ చేతకూడా దెబ్బలాడిస్తున్నావ్. నువ్వసలు వెళ్ళిఫో" గట్టిగా ఏడ్చేస్తూ అన్నాను నేను. మళ్లా దెబ్బలు... ఈసారి నాన్న చేతిలో!

నాన్నకీ, నాకూ మధ్య మాటలు కూడా ఆగిపోయాయి. ఇద్దరం బద్ధ శత్రువులయిపోయాం.

కొద్దిరోజుల్లోనే నేను ఊహించని సంఘటన మరోటి జరిగింది. అటువంటిది ఏదయినా జరగుతుందనిగానీ, నేనూ నాన్న మళ్ళీ పరమ ఆప్తులుగా తయారవుతామనిగానీ, అది జరిగేవరకూ నేను కలలో కూడా అనుకోలేదు.

అంతవరకూ నాన్నతో సఖ్యంగా వుంటూ వచ్చిన అమ్మ, ఇప్పుడు బాబిగాడికే దగ్గరయిపోయింది! తరచు నాన్న ఈ విషయంలో గొణుగుతుండటం గమనిస్తూనే ఉన్నాను.

ఓ రోజు రాత్రి- అర్థరాత్రివేళ మెలుకువొచ్చేసరికి నా పక్కన, నా మంచం మీద ఎవరో పడుకుని వున్నట్టు తెలిసింది.

"అమ్మ మళ్ళీ నాదగ్గరకు వచ్చేసిందా?"

అయితే ఆ ఊహ నిజం కాదని, దూరంగా పక్క గదిలోంచి వినపడ్తున్న బాబు ఏడుపూ, వాడిని సముదాయిస్తున్న అమ్మ గొంతూ వినిపించేయి! అయితే నా పక్కన వున్నదెవరు?

నెమ్మదిగా ముసుగుతీసి చూశాను.

అది... నాన్న!

అంటే... ఒకనాడు అమ్మపక్కలోంచి నన్ను వెళ్లగొట్టేసిన నాన్న... ఇవాళ బాబి

## కథా కథా! ఎందుకు నచ్చావ్?!



తెలుగు పాఠకులకు 'విపుల' ఒక కిటికీలాంటిది. దానిలోంచి వివిధ ప్రాంతాల, భాషల జీవితగాథలు దర్శించగలం!

1979 ఫిబ్రవరి సంచికలోని కథలన్నీ క్షుణ్ణంగా చదివాను. మూడు, నాలుగు కథలు నచ్చాయి. ఒకటే ఎంచుకోవాలి గనక, నచ్చిన కథలు మళ్ళీ చదివాను. అప్పుడు మిగతావాటిని వెనక్కి నెట్టేస్తూ 'సంధి' ముందుకొచ్చింది.

"కథా! కథా! నాకెందుకు నచ్చావ్" అని అడిగా.

"ప్రఖ్యాత ఐరిష్ రచయిత ఫ్రాంక్ ఒ'కానర్ రాసిందైతే నీకెందుకు నచ్చనూ? " అంది కథ.

"ఫ్రాంక్ ఒ'కానర్! నువ్వెలా ఇంత మంచికథ రాయగలిగావ్? "

"నాకు తెలిసిన నా జీవితమే అందులో రాశానయ్యా. నా బాల్యస్మృతుల్ని వెలికితీసి ఆ కథకు రూపకల్పన చేశా"

"రచయిత బాల్యస్మృతులూ! ఆయనను ఎందుకంత బాధించారూ? "

"దుర్భరమైన జీవితంలో కలం ముంచితే కన్నీరు కార్చించక ఉంటామా యేం"

"కథలో కన్నీళ్ళు లేవు. సున్నిత హాస్యం, వినోదమూ ఉన్నాయి కదా? "

"అదేమరి! గొప్ప రచయితలు విషయాన్ని ఒక స్థాయికి తీసుకువెళ్ళి రాస్తారు. బాలుడైన లారి ఆలోచనలోంచి, వాడి మనస్తత్వంలోంచి కథకుడు ఈ కథను నడిపిస్తాడు. అమాయకత్వంలోంచి, గడుగ్గాయితనంలోంచి, చిలిపి ప్రశ్నల్లోంచి 'ఔరా' అనిపించే జీవిత వాస్తవాల్ని చెప్పిస్తాడు. కథనంలో నూతన శైలీ విన్యాసం ప్రదర్శించే ఫ్రాంక్ ఒ'కానర్ ఏమైనా మా మూలు రచయితా యేం? "

కథలో ముఖ్యపాత్రధారి ఐదేళ్ళ లారి. సైన్యంలో పనిచేసే తండ్రికోసం ప్రార్థించడం, తండ్రితో స్నేహంగా ఉండడం, శత్రుత్వం పెంచుకోవడం... ఇట్లా బాల్యమనస్తత్వం ప్రతిభావంతంగా చిత్రించాడు రచయిత. వాడి ముదిమాటల్లో వాస్తవముంటుంది. లాజిక్కు ఉంటుంది. అదే పాఠకులకు వినోదాన్నందిస్తుంది. లారీకీ వాడి తండ్రికి 'సంధి' కుదురుతుందా? లేదా? అన్నది కథ చదివి తెలుసుకోవాల్సిందే!

ఈ రచయిత అసలు పేరు మైఖెల్ ఫ్రాన్సిస్ ఒ'కానర్ ఒ'డోనొవన్. ఆయనకు నిజజీవితంలో తండ్రిప్రేమ దొరకలేదు. తల్లి సంరక్షణలో పెరిగి మిలట్రీలో చేరిపొయ్యాడు. ఆ నేపథ్యంలోవే ఈ కథలోని పాత్రలు. ఆయన పేర కథకు సంబంధించి ఒక అంతర్జాతీయ అవార్డు ఉంది.

**–డాక్టర్ దేవరాజు మహారాజు**

## స్వర్ణోత్సవ సాహితీవేత్త

డాక్టర్ దేవరాజు మహారాజు సాహితీ స్వర్ణోత్సవం జరుపుకున్న సుప్రసిద్ధ సాహితీవేత్త. కవిత్వం, కథ, నాటకం, అనువాదం, కాలమ్ వంటి వివిధ ప్రక్రియల్లో కృషి చేస్తున్నారు. నోబెల్ గ్రహీత స్టెయిన్‌బెక్ నవల 'ద పెరల్'ను, హిందీ మహాకవి హరివంశ్‌రాయ్ బచ్చన్ 'మధుశాల'ను అదే ధాటితో తెలుగు చేశారు. భారతీయ-విశ్వ సాహిత్యాన్నుంచి వందల సంఖ్యలో కవితలు, కథలు తెలుగు చేశారు. నేషనల్ బుక్‌ట్రస్ట్‌కి దశాబ్దకాలం పాటు సలహా సంఘ సభ్యులు. అనేక సాహిత్య అవార్డు కమిటీలలో జ్యూరీ మెంబరు. బహుగ్రంథకర్త.

గాడిని అమ్మ పక్కన పడుకోనిచ్చి, తను నా దగ్గరకు వచ్చేయాల్సి వచ్చింది అన్న మాట!

నాకు చాలా జాలీ, సంతోషం కలిగాయి!

'పోనీ- ఇలాగైనా నేనూ, నాన్నా మళ్ళా ఓ జట్టు అయ్యాం!'

నాన్నగారి చెయ్యి నా నడుంచుట్టూ పడి, నన్ను దగ్గరకు తీసుకుంది.

*గమనిక:* ఈ శీర్షికలో ప్రచురిస్తున్న ఆయా భాషల కథలు విపులలో తెలుగు అనువాదంగా వెలువడి 35 ఏళ్లయిందని గ్రహించగలరు. మొదటిసారి మూల రచయిత / అనువాదకులకు విపుల పారితోషికం చెల్లించింది కనుక వారికి మరోసారి పారితోషికం ఉండదని మనవి.

# కారుకూతలు




పనిమనిషి వెంకమ్మ మాధవి ఇంట్లో పని ముగించి అదే ఊళ్లో ఉంటున్న మాధవి అమ్మ గారింటికి పనికి వచ్చింది. ఆ ఇంట్లో కూడా పని పూర్తిచేసి వెళ్లిపోతూ "అమ్మగారూ! మాధవమ్మ గారింటికి పొద్దున్నే బుచ్చిబాబు గారొచ్చారు. అమ్మగారి దగ్గర కారు కూతలు కూసిండు! నాకు భలే ఆశ్చర్యమేసింది!" అంది.



మాధవి తల్లి భృకుటి ముడి పడింది. భర్త పరమేశంతో వెంకమ్మ చెప్పిన విషయం వర్ణించి చెప్పింది. భార్యాభర్తలిద్దరూ బుచ్చిబాబు మీద ఆగ్రహం చెందారు. "చిన్నాన్న కొడుకైనా సొంత తమ్ముడిలా మాధవి వాణ్ణి ప్రేమించింది. అక్కా, అక్కా అని తిరిగేవాడు. వాడికేం పోయేకాలం? కారుకూతలు కూసేడట!" అంది భార్య.

"వాడికి నాలుగు రాళ్లు కనబడుతున్నాయి. అక్క ఇల్లు, ఆర్థికస్థితి వెక్కిరింపుగా తోచి ఉంటుంది" అన్నాడు పరమేశం.

"బుచ్చిబాబు గతం మరచిపోయి ప్రవర్తిస్తాడనుకోలేదు" అంది మాధవి తల్లి.

"నడమంత్రపు సిరి ఏదైనా చేస్తుందే! మాధవి అక్కదీ, నాదీ ఒకటే ప్రాణం అనేవాడు. ఎలా మారిపోయాడో చూసావా!" పరమేశం అందుకున్నాడు.

"సెలవు దొరికినప్పుడల్లా ఆ ఇంట వాలిపోడం ఎందుకు? ఈ కూతలెందుకు? వాళ్లింటికి పోవచ్చుగా? " పరమేశం భార్య ఆవేశంగా అంది.

"అసలు ఏ విషయమై వాగాడంటావ్? " అన్నాడు పరమేశం.

"మన మాధవిని గూర్చి ప్రేలాపన పేలడానికి ఏం కారణం ఉంది? మీరన్నట్టు డబ్బు మదంతోనే అయ్యుంటుంది"

"మనం ఇలా సందేహపడే బదులు మాధవికి ఫోన్ చేస్తే పోలా? " అప్పుడు తెలివి తెచ్చుకుని అన్నాడు పరమేశం.

కూతురికి ఫోన్ చేసి విషయం అడిగాడు. అట్నుంచి మాధవి నవ్వుతూ చెప్పిన విషయం విని పగలబడి నవ్వాడు పరమేశం! సంగతి బోధపడక పరమేశం భార్య అయోమయంగా మొహం పెట్టింది. భార్యకి అసలు సంగతి వివరించాడు పరమేశం. "బుచ్చిబాబు మిమిక్రీ నేర్చుకున్నాడట. కారు హారన్ని నోటితో కూసి చూపించాడట!" అని చెప్పాడు. విషయం తెలుసుకుని ఇక్కడ భార్యాభర్తలు, అక్కడ మాధవి విరగబడి నవ్వుకున్నారు.

*– కాండూరి వెంకట సన్యాసిరావ్,*

జామి, విజయనగరం జిల్లా

# ఆతిథ్యం




ప్రతిరోజూ ఉద్యోగ బాధ్యతల్తో విసిగి వేసారిన భాస్కర్, రంజని ఈసారి వేసవి శెలవులకు విశాఖ ప్లాన్ చేశాడు. అన్నయ్య శ్రీధర్ కూడా ఆ మధ్య చాలాసార్లు రమ్మని ఫోన్ల మీద ఫోన్లు చేశాడు. గతసారి వెళ్ళినప్పుడు ఇద్దరికీ బట్టలు పెట్టి, పిల్లలకు మంచి బొమ్మలు కొనిచ్చాడు. మేము రాత్రిపడుకునేందుకు తన ఎ.సి. రూము కూడా ఇచ్చాడు.

ఆ మంచీమర్యాదలు నచ్చాయి కాబట్టే రెండేళ్ళ తర్వాత భాస్కర్, రంజనిలు విశాఖకు చేరారు. గోదావరి ఎక్స్‌ప్రెస్ దగ్గరకు కారు తీసుకొచ్చి రిసీవ్ చేసుకున్నాడు శ్రీధర్.

మరుసటి రోజు భాస్కర్, రంజని, వాళ్ళ



పిల్లలు పగలంతా కైలాసగిరి, ఆర్కే బీచ్, భీమిలి వగైరాలు చూసి ఇంటికి చేరుకున్నారు. చీకటి పడింది. ఇంట్లోని మూడు రూముల్లోనూ జీరో వాట్ బల్బులే వెలుగుతున్నాయి. శ్రీధర్ ఎ.సి. రూములో ఎ.సి. ప్లగ్ తీసేసి వుంది. ఎండాకాలం వల్ల ఉక్కపోత ఎక్కువగా ఉంది. అడుగుదామంటే మొహమాటంగా ఊరుకుంది రంజని.

ముసుగులో గుద్దులాట ఎందుకని శ్రీధరే "మరేం అనుకోకండి బావగారూ! మేడమీద చల్లగా ఉంటుంది పడుకుందాం. కరెంటు బిల్లులు గూబ గుయ్యిమనిపిస్తున్నాయి. నెల్లాళ్ళయ్యింది ఎ.సి. చెడిపోయి. వేసుకోకపోవడం వల్ల కంప్రెషరు జామయిపోయింది"

విషయం అర్థమైన భాస్కర్, రంజని టెర్రస్‌మీదే సరిపెట్టేసుకున్నారు! మారిన కాలంతో మారిన ఆతిథ్యం మరి! అని.

**– గుడిమెట్ల గోపాలకృష్ణ**

అరసవిల్లి, శ్రీకాకుళం

# సర్దుబాటు

"పిల్లలిద్దర్నీ సిద్ధం చేసి, లంచ్ బాక్సులిచ్చి, స్కూలు బస్సెక్కించి, సిటీబస్సు పట్టుకుని టైముకు ఆఫీసుకెళ్ళాలంటే నాకు కష్టంగా వుంది. పిల్లలిద్దర్నీ హాస్టల్‌లో చేరుద్దాం" అంది సుందరి.. బెడ్‌రూంలో పడుకున్న సుందరరావు ఎదమీద మునిగోటితో గీతలు గీస్తూ.



"పిల్లల్ని చూడకుండా నేనుండలేను. హాస్టల్‌లో చేర్చడం నాకు సుతరామూ ఇష్టం లేదు" అన్నాడు సుందరరావు ముఖం మాడ్చుకుంటూ.

సుందరికి ఎక్కడలేని కోపం వచ్చేసింది.

"మీరు, పిల్లలూ ఇంట్లో వుండండి. నేనే వర్కింగ్ వుమెన్స్ హాస్టల్లో చేరిపోతాను. ఆఫీసులో ఆఫీసర్ రోజూ లేటుగా వస్తున్నానని చీవాట్లు పెడుతున్నాడు" అంది తీవ్రస్వరంతో.

"నాకంటే పిల్లలకు నీ అవసరమే ఎక్కువ. ఇంట్లో నువ్వే వుండు. నేనే మెన్స్ హాస్టల్లో చేరిపోతాను" అన్నాడు సుందరరావు అదే స్వరంతో.

అమ్మా నాన్నలు మా గురించి వాదులాడుకుంటున్నారని పిల్లలిద్దరూ హాల్లోంచి బెడ్‌రూంలోకొచ్చారు. "మీరిద్దరూ ఇక్కడే వుండండి! మేమే హాస్టల్లో చేరిపోతాం. మా కోసం మీరు ఇబ్బంది పడకూడదు" అంటున్న పిల్లల మాటలు విని, సుందరీ సుందరరావుల కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.




"సుందరీ! రేపట్నుంచి నీవు చేసే పనుల్లో సగం నేనూ చేస్తా. కూరగాయలు, ఇంటి సరుకులు బజారు నుంచి నేనే తెస్తా.. స్కూలుకు పిల్లల్ని సిద్ధం చేస్తా.. స్కూలు బస్సెక్కిస్తా. రోజూ సిటీ బస్సుకోసం ఎదురు చూడకుండా ఆఫీసుకెళ్ళేందుకు స్కూటీ కొనిస్తా.. నీ సమస్యలు తీరినట్లేగా" అన్నాడు సుందరరావు.

"నాన్నగారూ! మీరు మమ్మల్ని స్కూలుకు సిద్ధం చేయాల్సిన పనిలేదు. మేమే సిద్ధమవుతాం. లంచ్‌బాక్సులొద్దు, క్యాంటీన్‌లో తింటాం. స్కూలు బస్సెక్కించడానికి మీరు రావద్దు. మేమే వెళ్ళి ఎక్కుతాం" అంటున్న పిల్లల మాటలు విని విస్తుపోయారు సుందరీ సుందరరావులు.

"అలా అందరం సర్దుకుంటే మనకు హాస్టళ్లే వద్దు! ఇల్లే ముద్దు!!" అంటూ ఇద్దరి పిల్లల్నీ కౌగిలించుకున్నారు సుందరీ, సుందరరావు.

**– పోలిశెట్టి ఓబయ్య,**
రాయచోటి, కడప జిల్లా


ఈ రంగు చీరలంటే
అయ్యగారికి భలే ఇష్టం
అమ్మగారూ!!
బాలి

# సరసిజం

విదేశాలకైతే అది తీసుకోండి. మన స్టేట్‌లో రోడ్ల
షికార్లకైతే ఇది బెటరండీ ఇనపచక్రాలది!





కేసు వాదించడానికి ఎవరైనా
కుర్రలాయర్ని పెట్టపోయావా?
ఇంత ముసలాయన్ని పెట్టావే?
నా కేసు మొదలెట్టినప్పుడు అతను
కుర్ర లాయరేనయ్యా బాబు...!!
కోర్టు
తీర్పుల్లో జాప్యం
శేఖర్.



ఇంకా టైము కాలేదే !!
ఇంకాస్త ఆగరా బాబూ!!
WELCOME


గంట నుండి సెల్లులో
వాయిస్తున్నాడు.. ఎవర్రా?


సెల్‌ఫోన్ వల్ల వచ్చే
అనర్థాల గురించి....
చెబుతున్నాడ్రా
మా అంకుల్!
వడ్డేపల్లి
వెంకటేష్


కూరగాయలు ఎలాగూ కొనలేము కదా అని
ఈ పూటకి చికెన్ చేశా.. సర్దుకోండి
కళాధర్



ఏంటు! ఎవరదీ! ఆ!!
అమ్మగారింట్లో ఉంటే.. మనకేంపనుండదు!
కి కృకృ!!
SARMA

మనవడా..! కాన్వెంట్ చదువుతున్నావు కాదా!
ఏనుగు పెద్దదా..? ఎలుక పెద్దదా..?



అదీ తెలియదు తాతా..
ఏది ముందు పుడితే అదే పెద్ద.







దానిది డూప్లెక్స్
పుట్ట అని బడాయి పోతుంది రా..

చప్పు/..




క్యారికేచర్స్ గీయటం
చాలా సులభం.
ఒక నిలువుగీత, ( / )
అర్ధచంద్ర గీత ( ( ) గీయగలిగిన
వారంతా వీటిని గీయవచ్చు.
ఎలా గీయవచ్చో చూద్దాం.

1



2



3



4



మన ప్రధాని బొమ్మ తయారైపోయిందోచ్!

- శ్రీధర్ (ఈనాడు కార్టూనిస్ట్)

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: VIPULA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

# కామమయుడు మానవుడు!




'ధర్మార్థకామమోక్షము'లనే చతుర్విధ పురుషార్థాలలో 'కామము' నిరసింపదగిందే కానీ, అభిలషింపదగింది కాదని భావిస్తూ ఉంటాం. కానీ చిత్రంగా భగవంతుడు 'కామం' తన వైభవం అంటున్నాడు. కాకపోతే ఎలాంటి కామమో స్పష్టం చేశాడు. 'ధర్మ అవిరుద్ధ కామః అహమస్మి' ధర్మానికి విరుద్ధం కాని కామం తన స్వరూపమని పరమాత్మ విశదం చేశాడు.

'అర్థం' అనే పురుషార్థం రక్షణకు సంబంధించింది కాగా, 'కామము' సుఖానికి చెందింది. ఈ సుఖం ఇంద్రియాలకు సంబంధించింది కావచ్చు లేదా మనసుకు చెందిందీ కావచ్చు. శరీరాన్ని రక్షించుకోడానికి ఆహారం సంపాదించుకోవడం 'అర్థం' అనే పురుషార్థం. ప్రత్యేకంగా ఇలాంటి ఆహారమే కావాలి అనుకోవడం కామం. దేహం అలసటతో ఉన్నప్పుడు రక్షించుకోడానికి విశ్రాంతి అవసరం.. ఇది అర్థం. కానీ మెత్తగా, చల్లగా, తెల్లగా ఉన్న పక్కమీదే పడుకోవాలి అని ఆలోచించడం కామం.

మనిషికి రుచులే కాదు అభిరుచులూ ఉన్నాయి. అభీష్టాలు చిత్రవిచిత్రంగా ఉన్నాయి. కేవలం ఆహారం, నిద్ర, వస్త్రం, గృహంతో భద్రత పొంది మనిషి తృప్తి చెందలేక పోతున్నాడు. విలాసాలు, వినోదాలు, ఉల్లాసాలు, సుఖాలు ఇలా ఎన్నింటినో కోరుకుంటున్నాడు. ఇవన్నీ కామం అనే పురుషార్థం పరిధిలోకే వస్తాయి. అందాలు కావాలి. ప్రేమబంధాలు కావాలి. బాంధవ్యాలు కావాలి. శృంగారం కావాలి. సంగీతం కావాలి. సాహిత్యం కావాలి. నాట్యం కావాలి. క్రీడలు కావాలి. ఇవన్నీ భద్రత కోసం కాదు కనుక అర్థం కిందికి రావు. సుఖాన్ని కోరి చేసేవి కనుక కామం. ఇదికూడా కేవలం మనుషులకే పరిమితం కాదు. కొద్దోగొప్పో ఇతర ప్రాణుల్లో కూడా కనిపిస్తోంది. నెమలి నాట్యం చేస్తుంది. కోకిల పాడుతుంది. పక్షి మెత్తని గూడు కట్టుకుంటుంది.

'కామ మయ ఏవ అయం పురుషః' - మనిషి కామమయుడుగా ఉంటాడని వేదం చెబుతోంది. కోరికలన్నీ కామమని తెలుస్తోంది. కోరే శక్తి ఉన్నవాడే కోరుతాడు. ఈ కోరే శక్తినే ఇచ్ఛాశక్తి అంటారు. కోరుకునే వస్తువుకు సంబంధించిన జ్ఞానం ఉన్నప్పుడే దానిని ఇష్టపడతాడు. ఇదే జ్ఞానశక్తి. కోరుకోవడం తప్పుకాదు. కానీ దేనిని కోరుకోవాలో, దానికి సంబంధించిన జ్ఞానం విషయంలో స్పష్టత ఉండాలి. ఆ కోరిక ధర్మ విరుద్ధమైంది కాకూడదు. మతి చెప్పినట్లు కాకుండా శ్రుతి చెప్పినట్లు ప్రవర్తించాలి. అదే ధర్మ అవిరుద్ధ కామం. ధర్మరూపంలో ఉన్నది దైవమే కనుక ధర్మ అవిరుద్ధ కామం పరమాత్మ స్వరూపమే.

న జాతు కామః కామనా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే

అగ్నిలో ఆజ్యం పోయడం వల్ల ఆరకపోగా మరింతగా వృద్ధి చెందునట్లు, అనుభవించడం వల్ల కోరిక (కామము) నశించదు. అలా తీర్చుకోవడం వల్ల కొత్తగా మళ్లీ మళ్లీ కోరికలు పుడుతూంటాయి. అంటే కోరికలను ఎంత జాగ్రత్తగా అదుపు చేసుకోవాలో తెలుస్తోంది. ఇలా కామం వల్ల కలిగే సుఖం ఎంత అల్పమైందో మహాభారతం స్పష్టం చేస్తోంది.

యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్
తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హ తః షోడశం కలామ్

లోకంలో ఏ కామ సుఖం ఉందో, స్వర్గంలో ఏ గొప్ప సుఖం ఉందో ఆ రెండూ కూడా కోరికలు ఉపశమించిన బుద్ధిలో కలిగే సుఖంలో పదహారో వంతు కూడా ఉండవు. ఇహపర సుఖాలు అంతర్ముఖమైన చిత్తం పొందే సుఖంలో పదహారో వంతు కూడా ఉండవు.

ఇంద్రియాభ్యాం అజయ్యాభ్యాం ద్వాభ్యామేవ హతం జగత్
అహో! ఉపస్థ జిహ్వాభ్యాం బ్రహ్మాది మశకావధి

అజేయములైన జిహ్వేంద్రియ, గుహ్యేంద్రియాలనే రెండే బ్రహ్మ మొదలు దోమ వరకు సమస్త ప్రపంచాన్నీ హతమారుస్తున్నాయి.

వివేకం లేని కారణంగా జగత్తంతా మోహజాలంలో చిక్కుకుపోయింది. గుణపాశాలతో బంధింపబడింది. యుక్తాయుక్త వివేకం కోల్పోకుండా గుణవికారాల నుంచి బయటపడి పరమాత్మ వైభవాన్ని దర్శించాలి. ఇంద్రియ విషయాల పట్ల విరక్తి చెందడమంటే విషయాలకు దూరంగా పరుగుతీయడం కాదు. మనిషి పారిపోవచ్చు కానీ మనసు దూరం కాలేదు. ఇంద్రియ విషయాలలోని దోషాలు తెలుసుకుంటే మనసులో పూర్ణ వైరాగ్యం సిద్ధిస్తుంది. అప్పుడు జ్ఞానాసక్తి పెరుగుతుంది. **– చారి**



★ జనవరి సంచికలో కథలన్నీ బాగున్నాయి. ముఖ్యంగా తెలుగు కథల్లో 'అహల్య, అపాత్ర పింఛను' ఎంతగానో ఆకట్టుకున్నాయి. అనుమానంతో భార్యను వేధించే వారికి చెంపపెట్టు 'అహల్య' కథ. రచయిత్రికి అభినందనలు. 'అపాత్ర పింఛను' కథలో సుబ్రమణ్యం సదాశయం చివరకు ఎలా వికటించిందో, చక్కగా చెప్పారు. 'జ్ఞానధార'లో 'మరణానంతర మార్గాలు' ఆసక్తికరంగా, ఆధ్యాత్మికంగా సాగింది. హారిక అనువదించిన కార్డుకథ 'తృప్తి' బాగుంది. 'ముషాయిరా' కవితలు బాగున్నాయి.

**– డాక్టర్ శివభూషణం,** కర్నూలు

★ జనవరి సంచికలో అన్ని కథలూ చక్కగా ఉన్నాయి. ప్రత్యేకించి మెరుపు తపాలా, మునెమ్మ అనువాదకులకు ధన్యవాదాలు. కన్నడంలో కొన్ని కథలు విభిన్నంగా, ఆలోచింపజేసేవిగా ఉంటాయి.

**– డా. ధరణి పార్థసారథి,**
డి.డి. కాలనీ, హైదరాబాద్

★ ఈ నెల కథలన్నీ బాగున్నాయి. ముఖ్యంగా 'కథకుల ఫైల్'లోని రాచమల్లు వారి 'దేశంలోని దేవకన్యలు' కథ ముగింపులో దేవకన్యను బతికించి ఉంటే బాగుండేది. నేటి డాక్టర్లు డబ్బు సంపాదించే యంత్రాలుగా మారడం శోచనీయం. మూర్తిలాంటి నిస్సహాయ వైద్యులు మనసున్నా మార్గం కానరాక నరకయాతన పడుతున్నారు. భారతీయ భాషల కథల్లో కరుణానిధి 'ఉడుత పిల్ల' ఆలోచింపజేసింది. కార్డు కథల్లో 'చౌరస్తాలో అమ్మ' చాలా బాగుంది.

**– పి.ఎస్. సుశీలమ్మ,** కొత్తచెరువు

★ 'దేశంలోని దేవకన్యలు' కథ అత్యుత్తమమైంది. ఈ కథ మనిషిలోని వివిధ కోణాలను వ్యక్తీకరించింది. కథలో డాక్టర్ అన్నట్లు సేవ అందంతో పనిలేకుండా ఉండాలి. ఇక 'మునెమ్మ' దేశంలో మహిళల పరిస్థితికి అద్దం పట్టింది. 'ఉడుత పిల్ల' కథాకథనం చాలా బాగుంది.

**– లహరి**

★ జనవరి సంచిక బాగుంది. ముఖ్యంగా తెలుగు కథల్లో 'అనాథాశ్రమం, అపాత్ర పింఛను' నేటి సామాజిక పరిస్థితులను ప్రతిబింబించాయి. భారతీయ భాషల కథల్లో 'మునెమ్మ, ఉడుతపిల్ల' బాగున్నాయి. ప్రపంచ భాషల కథల్లో 'మెరుపు తపాలా, చీకటి' అలరించాయి. చిన్నతనంలో చదవలేని కథలను 'కథకుల ఫైల్'లో చదవడం ఆనందంగా ఉంది. 'జ్ఞానధార' మనసుకు హత్తుకునేలా రాయడం బాగుంది. కార్డుకథలు, ముషాయిరా బాగున్నాయి.

**– మంచాల శ్రీలక్ష్మి,** వైజాగ్

★ తెలుగు కథ 'సలోమి' కథాంశం మనసుకు హత్తుకుంది. మాజీ ముఖ్యమంత్రి కరుణానిధి కలం నుంచి జాలువారిన తమిళ కథ 'ఉడుత పిల్ల' వాస్తవ పరిస్థితులకు అద్దం పట్టింది. జర్మనీ కథ 'అమ్మాయి మనసు' బాగుంది. కార్డుకథల్లో 'పరిమళించిన మానవత్వం' మనసును స్పందింపజేసింది.

**– టి.వి.డి.ఎస్. సీతారామారావు,** పంజాగుట్ట

★ యామీ గౌతమ్ ముఖచిత్రంతో వెలువడిన జనవరి 'విపుల' వర్ణరంజితంగా ఉంది. కథలన్నీ ఇంటిల్లిపాదికీ ఎంతగానో నచ్చాయి. విభిన్నమైన శీర్షికలతో ఎప్పటికప్పుడు నవ్యతను సంతరించుకుంటున్న 'విపుల'కి అభినందనలు.

**– కాళహస్తి వెంకట శేషగిరిరావు,** నెల్లూరు

★ జనవరి సంచిక పుస్తకాలంకరణ చాలా బాగుంది. తమిళ కథ 'ఉడుత పిల్ల'ను మాజీ ముఖ్యమంత్రి కరుణానిధి చాలా సున్నితంగా నడిపారు. కన్నడ కథ 'మునెమ్మ'లో అంధురాలైన మునెమ్మ తన శీలాన్ని పోగొట్టుకుని బాధపడే సంఘటన మనసును కలచివేసింది. నిర్భయ సంఘటనను గుర్తుకు తెచ్చింది.

**– పల్లా పవన్‌కిశోర్,** ప్రొద్దుటూరు, కడప జిల్లా
**– వానపల్లి వాసిని,** కశింకోట, విశాఖ జిల్లా

★ 'విపుల' జనవరి సంచిక మమ్మల్ని రంజింపజేసింది. సంస్కృత కథ 'ఆక్రమణ'లో కొసమెరుపునకు కళ్లు చెమ్మగిల్లాయి. ప్రపంచ భాషల కథల్లో 'దుష్టనాయిక' హృదయాన్ని కదిలించింది. 'చీకటి' కథ అనుమానం పెనుభూతం లాంటిదని మరోసారి రుజువు చేసింది. 'అమ్మాయి మనసు'లో నిలకడ లేని మనసు గురించి బాగారాశారు.

**– టి. గాయత్రి,** కందుకూరు, ప్రకాశం జిల్లా

★ జనవరి సంచికలో 'ఉడుత పిల్ల, అహల్య, అమ్మాయి మనసు' కథలు బాగున్నాయి. 'దేశంలోని దేవకన్యలు, సెలవురోజు' కథలు ఆణిముత్యాలు. 'జ్ఞానధార' ఆసక్తికరంగా ఉంది.

**– బిక్కునూరి రాజేశ్వర్,** పొన్కల్

# పాతొక రోత!



ఇద్దరు స్నేహితురాళ్లు వాలెంటైన్ పార్టీలో కలిశారు.

**ఒకామె** : కొత్తసూటులో మీ ఆయన్ని గుర్తుపట్టలేకపోయానే!

**రెండో ఆమె** : ఫరవాలేదులే. సూటే కాదు, ఆయన కూడా కొత్తాయనే!



# కార్డు లవర్

**రాణి:** రామ్‌ని అంతగా పొగిడేస్తున్నావ్, చాలా సార్లు కాఫీ బార్లో అతనితో కనిపించావ్.. ఏంటి కథ? (చిలిపిగా అడిగింది స్నేహితురాల్ని)

**రాగిణి:** ఎంతైనా డ్రా చేసుకోమని తన ఏ.టి.యమ్ కార్డు నాకిచ్చేశాడు మరి!

# దెబ్బకు దెబ్బ!



**జేమ్స్:** ఏమిటి! నువ్వు నాకు లిఫ్ట్ ఇస్తావా? వాటే వండర్. మరి నీ లవర్ ధనుష్ వూరుకుంటాడా?

**షకీలా:** నిన్న ఎవతినో బైక్ మీద కూర్చోబెట్టుకుని వచ్చి నాకెంత ఫోజిచ్చాడనుకున్నావ్! అందుకే నువ్వీరోజు నా వెనక గట్టిగా అదిమి పట్టుక్కూర్చో, అది చూసి వాడు ఉడుక్కు చావాలి ఆc..

# ఎందుకో చెప్పుకో



**పో**స్టాఫీసులో ఒక మధ్యవయస్కుడు హృదయాకారం ముద్రించిన గులాబిరంగు కవర్లమీద 'లవ్' అని రాస్తున్నాడు. తర్వాత అన్నిటికీ సెంటు పూశాడు.

ఒక యువకుడు, అతన్ని ఏం చేస్తున్నారని ఆసక్తిగా అడిగాడు.

"'ఎవరో చెప్పుకో' అని వెయ్యి వాలెంటైన్ కార్డులు పంపిస్తున్నాను"

"ఎందుకు? "

"నేను డైవోర్స్ లాయర్ని"

# ఎంతకీ తియ్యదే!



"మా పక్కింటి మేడ మీద ఒక అందమైన అమ్మాయి ఈ మధ్య టవల్ చుట్టుకుని ఎండలో నిలబడుతోంది రోజూ. అందుకని వారం రోజులుగా నేను ఏ పనీ చెయ్యలేకపో తున్నాను"

"ఏం? ఎందుకని? "

"ఎంతకీ ఆ టవల్ ఆరెయ్యటంలేదు మరి"



# ఎటు నుంచి చూసినా..

పూట గడవని పాస్టర్ తన భార్య పదిహేనువేల రూపాయల చీర కొన్నదని తెలిసి అగ్గి మీద గుగ్గిలమయ్యాడు.

"మన పరిస్థితి తెలిసి కూడా ఇలా ఎలా చేయగలిగావు? "

"నేను నడుస్తున్నానండీ, షాపు అద్దంలోంచి ఇది కనపడింది. వెంటనే సైతాను నా చెవిలో 'ఈ చీర నీకు బాగుంటుంది, కొనెయ్' అన్నాడు"

"తుచ్ఛమైన కోరికల నుంచి విముక్తి కోసం 'వెనక్కి మరలు సైతాన్' అనాలని తెలుసుగా"

"చెప్పానండీ. కానీ 'వెనకనుంచి కూడా బాగుంది' అన్నాడు"



# అర్థం ఇదే..

ఓ మధ్యాహ్నం కునుకు తీసి లేచాక రంగతో మంగ ఏమండీ! వాలెంటైన్స్ డేకి నాకు మీరు ముత్యాలహారం కొన్నట్టు కల వచ్చింది. దానర్థం ఏమయ్యుంటుంది?

**రంగ:** ఈ రాత్రికల్లా తెలుస్తుందిలే...

రాత్రికి ఓ చిన్నపెట్టెని మంగకి కానుకగా ఇచ్చాడు. ఉబ్బితబ్బిబ్బైపోతూ తెరిచి చూసింది. అందులో 'కలలకు అర్థం' అనే పుస్తకం ఉంది!

# సర్‌ప్రైజ్



**చింటూ :** మమ్మీ, నాకో చిన్న తమ్ముడు కావాలి.

**తల్లి:** డాడీ దుబాయ్ వెళ్ళారు కదా, వచ్చాక అడుగుదాంలే.

**చింటూ:** కాసేపు ఆలోచించి... పోనీ, డాడీకి సర్‌ప్రైజ్ ఇద్దాం మమ్మీ!

# ఇరగదంతే!



"మేస్త్రీ, మంచం చాలా గట్టిగా తయారుచెయ్యాలి, నా కొడుకు దీనిమీద మొదటిరాత్రి చేసుకోబోతున్నాడు"

**మేస్త్రీ:** ఇగ ఎట్టా సేసేత్తానో సూడండి, మీ అబ్బాయిగోరే కాదు, ఈదిఈదంతా ఒకేసారి సేసుకున్నా ఇరగదంథే!

- శారద

# సంస్కార హీనుడు

తన సర్వస్వమూ ఆరిపోయ్యేదాకా తిరిగి తిరిగి, విసుగెత్తి ఇంటికి వొచ్చాడు కృష్ణరాజు. అతని ఈ ప్రవర్తన పట్ల అందరికీ వెగటూ అసహ్యమూ కలిగినా, కామేశ్వరికి ఒక్క రవ్వన్నా కోపం కలగలేదంటే ఆశ్చర్యం వేస్తుంది. ఇంట్లో అందరూ కృష్ణని అనరాని మాటలు అన్నారు. తండ్రి లేనేలేడు. తల్లి, మేనమామ, పిల్లనిచ్చిన మామా, అందరూ అతన్ని తిట్టిపోశారు. భార్య మాత్రం ఏమీ అనలేదు. నలుగుర్లోనే గాదు అతన్ని ఒంటరిగా కలుసుకున్నప్పుడు గూడానూ. సామాన్యంగా, సంఘం దృష్టిలో దుర్మార్గుడుగా పరిగణించబడ్డ వాణ్ణి భార్య ఆ విధంగానే చూడ్డం సహజమే. కృష్ణరాజు కూడా దీన్ని అంగీకరించాడు. భార్య మౌనం అందరి తిట్లకన్నా కూడా అతన్ని ఎక్కువ బాధ పెట్టింది. ఆ వేళ అందరూ తిండ్లు తిని పడుకున్న తర్వాత కామేశ్వరి మొగుడి దగ్గిరకెళ్ళింది మామూలుగానే. కృష్ణ దొడ్లో మంచం వేసుకుని గాఢంగా ఆలోచిస్తున్నాడు, చీకట్లో ఊగే తులసి చెట్టువంక చూస్తో.

కామేశ్వరి అతన్ని అతి ఆప్యాయంగా చూస్తో దగ్గిరకెళ్ళి కూచుంది. ఆమె స్పర్శ

## వ్యావహారిక భాషకు జవం.. జీవం!

శారద (నటరాజన్) తమిళనాడులోని పుదుక్కోట నుంచి 1937లో బతుకుతెరువు కోసం తెనాలి వచ్చేనాటికి తెలుగు బొత్తిగా రాదు. అనతి కాలంలోనే భాషమీద, భావంమీద పట్టు చిక్కడంతో తనదైన శైలిలో 'రియలిజమ్' ఆసరాగా రచనలు చేశారు. పగలంతా బావగారి హోటల్లో పనిచేస్తూ, రాత్రులు రచనలు చేసేవారు. 1946 మేలో అరసం సాహిత్య పాఠశాలకు నెలరోజులు హాజరుకావడం శారద జీవితంలో ఓ మలుపు. తొలిసారిగా శారద రాసిన 'ప్రపంచానికి జబ్బు చేసింది' అనే వ్యంగ్య రచన జులై 1946 ప్రజాశక్తిలో వచ్చింది. 'గొప్పవాడి భార్య' అనే వ్యంగ్య కథనం 'శారద' పేరుతో మొదటగా వచ్చిన రచన. ఆ రోజుల్లో పేరెన్నికగన్న అన్ని పత్రికలలో వీరి రచనలు ప్రచురితమయ్యాయి.

తాపీ ధర్మారావుగారి 'జనవాణి' స్ఫూర్తితో 'ప్రజావాణి' అనే లిఖిత వారపత్రికను నడిపారు శారద చిన్నతనంలోనే. చక్కటి దస్తూరితో మూడు కాపీలు తయారు చేసేవారు. ఒక కాపీ మున్సిపల్ లైబ్రరీలోనూ, రెండోది తెనాలి కమ్యూనిస్టు పార్టీ ఆఫీసులో, మూడోది స్నేహితుల మధ్య తిరుగుతుండేది.

ఆప్తమిత్రుడు ఆలూరి భుజంగరావు ఆసరాతో శారద బతికినంత కాలం చిన్నాచితకా వ్యాపారాలు చేస్తూనే ఉన్నారు. కటిక దరిద్రం, మూర్ఛరోగం బాధిస్తున్నా తెలుగు సాహిత్యానికి వెలకట్టలేని సేవలందించిన శారద అతి పిన్నవయసులోనే అమరులయ్యారు. 'తెలుగు మాతృభాషగా గల వారికి కూడా దుస్సాధ్యమైన జాతీయమునూ, నానుడినీ పోషిస్తూ వీరు రచించిన కథలు, నవలలు వ్యావహారిక భాషకు ప్రమాణప్రాయంగా ఉన్నాయి' అని వీరిని గురించి కృష్ణాపత్రిక రాసింది. వీరి రచనలు చదివితే 'కథలు రాయాలని రాసినవి కావు.. హృదయం ద్రవించి ప్రవహించినవి' అనిపిస్తుంది.




| | | |
|---|---|---|
| **పూర్తి పేరు** | : | **శారద ( నటరాజన్ )** |
| జననం | : | 1924లో తమిళనాడు పుదుక్కోటలో |
| ప్రసిద్ధి | : | వీరికి 'మంచి-చెడు' నవల మంచి గుర్తింపు తెచ్చింది. కాకతీయ యూనివర్సిటీ ఆ నవలను బి.ఏ. విద్యార్థులకు పాఠ్యగ్రంథంగా నిర్ణయించింది. స్వీయ సంపాదకత్వంలో 'చంద్రిక' అనే మాసపత్రిక ఒక సంచిక వెలువరించారు. |
| రచనలు | : | **కథలు:** సందేశం, హరిశ్చంద్రుడు, పరోపకారి, కొత్తవార్త, ధర్మఖాతా, నాగరికుని ప్రేమ, రక్తస్పర్శ సంపుటిలో 35 కథానికలు. **నవలలు** :మంచి-చెడు, ఏదిసత్యం? , సరళాదేవి హత్య. అపస్వరాలు, మహీపతి, చీకటి తెరలు (అసంపూర్ణం), 'అందాలదీవి' రెండు నెలల్లోనే రెండు ముద్రణలు పొందింది. **నాటికలు:** నరబలి, అహల్య. **ఇతరాలు:** 'పరిశోధన' (గల్పిక), 'క్షణంలో సగం' శీర్షికతో వ్యంగ్య కథనాలు. |
| మరణం | : | 1955 సంవత్సరం ఆగస్టు 17వ తేదీ |



## కార్డు లవర్

**రాణి:** రామ్‌ని అంతగా పొగిడే స్తున్నావ్, చాలా సార్లు కాఫీ బార్లో అతనితో కనిపించావ్.. ఏంటి కథ? (చిలిపిగా అడిగింది స్నేహితు రాల్ని)
**రాగిణి:** ఎంతైనా డ్రా చేసుకోమని తన ఏ.టి. యమ్ కార్డు నాకిచ్చేశాడు మరి!

తగిలిన ఉత్తరక్షణం కృష్ణే నీరసంగా ఆమె వైపు తిరిగి "కామూ, నిన్ను ఏనాడూ, పెళ్ళి అయిన నాలుగేళ్ళ కాలంలోనూ, ఒక్కసారైనా ఆప్యాయంగా పలకరించి ఎరుగని నన్ను నువ్వు ఇంతగా ప్రేమించి సహించటానికి కారణం ఏమిటి? నన్ను పరీక్షిస్తున్నావా? చెప్పు" అని అడిగాడు, దోషి న్యాయాధిపతి ముందు క్షమార్పణ వేడుకునే స్వరంతో.

కామేశ్వరి చాలా ధీరంగా, కాని ఆప్యాయంగానూ దయగానూ "అది కాదండి. మీరు చేసిన పనులు ధైర్యం ఉన్న ప్రతివాడూ, ప్రతి ఆడది చేస్తుందని నేను నా వరకూ గట్టిగా విశ్వసించాను. అంతకన్న ఇందులో ప్రత్యేకంగా సహనమేమీ లేదు. మీరు నన్ను చూసి ఎందుకు భయపడుతున్నారో నాకర్థం కాదు" అన్నది.

కృష్ణ నిజంగా ఉలిక్కి పడ్డాడు. అతనికి గత జీవితం అంతా ఒక్కసారిగ జ్ఞాపకమొచ్చింది. అతనికి తను చేసిన పనులు, తనకే తప్పుగా తోచినయి. అందువల్లనే అందరి తిట్లనీ భరించి ఊరుకున్నాడు. ఇప్పుడు కామేశ్వరి ఏమిటి ఇట్లా మాట్లాడుతోంది? నిజంగా తను చేసినవన్నీ ధైర్యస్థుడైన ఓ వ్యక్తికి సహజమూ, న్యాయమూనా? కృష్ణ కామేశ్వరి జడ చాలా అనురాగంతో సర్దుతో "నువ్వు చాలా కొత్తగా మాట్లాడుతున్నావు. నేను ఇలాంటి భావాన్ని ఎదురు చూడలేదు నీనించి. అందువల్ల పొరపడ్డాను. నువ్వనేది నిజమా? " అని అడిగాడు.

కామేశ్వరి అతన్ని ఓ రకంగా చూసింది ఆ చీకట్లో "నిజమా అంటారా? కాక మరేమిటి? నేనన్నది నిజమే. నాకున్న కొద్దిపాటి తెలివితో ఆలోచించి ఈ నిర్ణయానికొచ్చాను. మీరు మీ తాలూకు డబ్బును, శక్తిని, చాలా త్వరగా ఖర్చు పెట్టారు. అందులో మీ లోపంకన్న పరిస్థితుల లోపం ఎక్కువగా ఉన్నది. ఏ జీవితానుభవమూ లేని స్తబ్దు అయిన మొగుడితో, నిరామయంగా వందేళ్ళు గడపటం కన్నా మీబోటి వారితో ఒక్క ఏడాది గడపడం నాకు చాలా ఇష్టం" అన్నది.

ఆమె చెప్పేవన్నీ అతన్ని ప్రోత్సాహపరచినై. ఆమెలో ఇంత సంస్కారం ఉంటుంది అని ఇదివరలో తను ఊహించి ఉండలేదు. భారత పతివ్రతలాగా, చాటున దేవుళ్ళని "నా భర్తని బాగు చెయ్యండి. వాడు దుర్మార్గుడు. కాని నా భర్తే సుమా" అని ఆమె వేడుకోకండా తనని అటు దుర్మార్గుడిగా కాకుండా, ఇటు సన్మార్గుడిగా కాకుండా, వొట్టి మనిషిగా మాత్రమే స్వీకరించి వూరుకోగలగటం, అతన్ని శాంతింపచేసింది. అతను లోలోపల, ఓ ప్రమాణం చేసుకున్నాడు. 'ఇక, తను ఏ పరాయి స్త్రీని తాకకుండా సద్బుద్ధి కలిగి ఉండాలి' అని. గత పదిరోజుల బంధు తిరస్కారాల మోతనించి, ఆ రాత్రి అతను తన భార్య చేతుల్లో శాంతిగా చిన్న పిల్లవాడల్లే నిద్రపోయినాడు.

★ ★ ★

కృష్ణరాజు తాలూకు ఆస్తి యావత్తూ ఆరిపోయినా, వాడి మీద ప్రేమ కొద్దీ చచ్చిపోతూ పినతల్లి రాసిచ్చిన ఆస్తితో, అతను మళ్ళీ కోలుకున్నాడు ఆర్థికంగా. సహజంగా అతనితో ఎప్పటివలెనే ప్రవర్తిస్తోంది కామేశ్వరి. వస్తుతః ఆమె స్వాతంత్ర్యవాది. ఇతరుల స్వతంత్రాన్ని అరిగట్టడం కాని, తన

# స్త్రీ వివక్షపై పాశుపతాస్త్రం



మహిళల పాలిట గుదిబండ లాంటి పితృస్వామిక సమాజపు ద్వంద్వ ప్రవృత్తిని బట్టబయలు చేసిన చిన్నకథ 'సంస్కారహీనుడు'. పురుషుని శీలానికి లేని పరీక్ష, వివక్షా స్త్రీలకున్నాయి. దాన్ని ధిక్కరించిన ఉత్తర రామాయణంలోని సీత వ్యక్తిత్వం ఈ కథలోని కామేశ్వరిది. నిజానికీ పాత్ర మహాభారతంలోని కుంతిని పోలి ఉంటుంది. అయితే ఇక్కడ కథకునికి ప్రేరణ గతకాలపు పురాణాలు కావు. వర్తమాన జీవితమే!!

కథ నుంచి ఒక్కవాక్యం తొలగించినా ఏదో అసమగ్రత గోచరించేట్టూ, ఒక్కపదం తొలగించినా వాక్యం బలహీనపడేట్టూ పాఠకునికి అనిపించటం గొప్ప కథల లక్షణాల్లో ఒకటి. ఈ కథ ఆ కోవకి చెందింది. ఈ కథలోని శిల్పాన్ని వస్తువే చిత్రిక పట్టింది. శీర్షిక నుంచి ముగింపు దాకా రచయిత కంఠస్వరం బలంగా వినిపిస్తూంటుంది.

ఉపదేశాలూ, ఉద్బోధనలూ, కవితాత్మక వర్ణనలూ, ప్రతీకలూ ఏవీ లేకుండానే.. సరళంగా, గంభీరంగా కథ నడిచింది. కామేశ్వరి స్వతంత్ర వ్యక్తిత్వాన్ని పాఠకుల ఆమోదం పొందేలా నిర్వహించిన తీరు, కథారచనా సంవిధానానికే నమూనాగా నిలుస్తుంది.

కథంతా చదివిన తరువాత మరొక్కసారి కథలోని మొదటి వాక్యమూ, చిట్టచివరి వాక్యమూ ఒకదాని వెంటనే మరొకటి చదవండి. సర్వస్వమూ ఆర్పేసుకుని ఇంటికి చేరిన పిరికివాడి.. సంస్కారహీనుడి ఇంటి నుంచి దూరంగా వెళ్ళిపోదలుచుకున్న ఆత్మవిశ్వాసంగల స్త్రీ కనిపిస్తుంది. ఈ రెండు వాక్యాల నడుమా... కథ యావత్తూ వుంటుంది.

ఆలూరి భుజంగరావు, రావూరి భరద్వాజల కంటే చాలా ముందుగానే చలం, కొ.కు, త్రిపురనేని గోపీచంద్‌లతో సమంగా కథను నడిపించటం, జీవితాన్ని నిశితంగా ఆవిష్కరించటం, స్త్రీ వివక్ష ప్రదర్శించే సమాజాన్ని సంస్కారహీనమైందిగా నిర్ద్వంద్వంగా ప్రకటించటం ద్వారా శారదకున్న సామాజిక అవగాహన, దృక్కోణ పరిణతి, కథాకథన శిల్ప చాతుర్యమూ ఇందులో చూడొచ్చు.

**– దివికుమార్,** విజయవాడ
(ప్రజాసాహితి మాసపత్రిక సంపాదకవర్గ సభ్యులు)

స్వేచ్ఛకు ఇతరులు అడ్డం రావడం కాని ఆమెకు తలనెప్పిగా ఉండేది. ఈ గుణం, చదువుతోనే గాక, ఆమెకు పుట్టుకనించే వొచ్చి ఉండాలి. ఆమె అందగత్తె. వొయ్యారం వొలకపోస్తూ ఉండేది ఆమె ప్రతి చర్యా. మితభాషిణి కావడం ఆమెకొక ప్రత్యేక ఆకర్షణగా పరిణమించింది. కృష్ణ ఈ భార్యను వొదిలి ఇన్నేళ్ళూ దరిద్రగొట్టు ముండలతో కాలం గడిపినందుకు చాలా పశ్చాత్తాపబడ్డాడు. ఆమెను ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగా చాలా మాట్లు క్షమార్పణ వేడుకున్నాడు అతని బలహీనత కొద్దీనూ. అతనికింకా మానవ జీవితం, గీట్లలో గోడల్లో ఇరుకుగా ఉండజాలదని, ప్రతిక్షణం, సమాజ నిర్మిత నీతి చట్టాల్ని వ్యతిరేకిస్తూనే ఉంటుందనీ తెలీదు. తన భార్య గొప్పది కావటం వల్లనే తనని సహించిందని అతని వుద్దేశం. ఈ గొప్పదనాన్ని అతను గుర్తించినప్పణ్ణించీ, భార్యని సుగుణరాశిగా, వెనకటి పతివ్రతల లిస్టుకే చేర్చి పూజించసాగాడు. ఆమె అతని మనస్సులో అత్యున్నత స్థానం ఆక్రమించింది. కామేశ్వరి దీన్నేమీ గమనించలేదు. తన భర్తకి తన మీద ఏర్పడ్డ గౌరవాన్ని పెంచటానికి ఆమె ఎట్టి ప్రయత్నమూ చెయ్యలేదు. అతన్ని సహజంగా ప్రేమించింది. అంతవరకే, అట్లానే రోజులు దొర్లిపోతున్నాయి.

★ ★ ★

ఒక రోజు కామేశ్వరి చీకటి పడ్డాక ఎక్క

డికో పోవటానికి బయల్దేరింది. ఇంట్లో మరెవ్వరూ ఆమెని అడ్డగించరు. ఒక కృష్ణ రాజే ఆమెని అడ్డగిస్తే. అప్పటికే చాలా మాట్లు ఆమె అట్లా చీకటి పడ్డాక ఎక్కడికో పోవటం, పొద్దుపోయి రావటం కృష్ణరాజు గమనిస్తూనే ఉన్నాడు. ఆమె మీద గౌరవం కొద్దీ వూరుకున్నాడు, ఇన్నాళ్ళూ కారణమన్నా అడక్కుండా. కానీ ఇవాళ ఆమెను కారణం అడిగే ధైర్యం లేక, ఆమెని వెంబడించి, ఆమె ఎక్కడికి పో తోందో కనుక్కోవాలని నిర్ణయించుకు న్నాడు కృష్ణరాజు. ఆమె గడప దాటగానే చల్లగా తానూ వెంబడే వెళ్లాడు.

ఆమె సరాసరి పార్కు రోడ్డేపోయి ఓ చిన్న ఇంట్లోకి వెళ్ళింది. కృష్ణరాజు లోప లికి వెళ్ళక చుట్టూ తిరిగి దొడ్లోకి వెళ్ళి, పూరిల్లు కావటం వల్ల, తడిక సందులో గుండా లోపలికి చూశాడు. లోపల ఎవరో

నిర్వహణ :
**డా. వేదగిరి రాంబాబు**

ఒక అమ్మాయి, ఒకతను నుంచుని కామే శ్వరిని నమ్రతగా ఆహ్వానిస్తున్నారు. కృష్ణ రాజుకి చెవులు చురుకుగా పనిచేశాయి.

మసకగా వెలుగుతున్న లాంతరు వెలు గులో కామేశ్వరి మొహం వెలవెలపోతు న్నది. ఆమె ఏడుస్తోందేమో అనిపిస్తోంది. ఆమెకీ ఆ దంపతులకీ అయిదారు గజాల దూరంలో ఓ ఆరేళ్ల అందమైన కుర్రాడు కూచుని ఉన్నాడు. బెదురు చూపులు చూస్తున్నాడు. కామేశ్వరి అమ్మాయికేసి చూస్తో: "అమ్మా! మీ రుణం తీర్చలేను. అబ్బాయికి ఈ రూపాయి ఇవ్వండి. వాడికి ఏ లోటూ రానివ్వకండి" అని, ఆ కుర్రాడి దగ్గరగా వెళ్ళి "రా నాన్నా, నీకు మంచి చొక్కా తెచ్చాను" అని ఎత్తుకుంది.

కుర్రాడు నిర్ఘాంతపోయినా, ఆమెని ఆ రెండు మూడు నిమిషాలకల్లా గుర్తుపట్టి "సిల్కు చొక్కాయేనా? " అంటూ ఆమె చేతిలో చొక్కా లాక్కుని "బావుంది, బావుంది" అని చంకలెగరేస్తో ఆమెను గట్టిగా కావలించుకున్నాడు.

లోపల నుంచుని ఉన్న అతను, "రుణ మేముందమ్మా, ఇందులో. అబ్బాయి డబ్బులు అబ్బాయికే ఖర్చు పెడ్తున్నాం. ఇందులో మా దయేముందండి!" అన్నాడు చాల నమ్రతగా.

కృష్ణరాజుకి అర్థం కానిదేదో విషయం గొంతులో వెలక్కాయల్లే పడి ఊపిరాడని య్యడం లేదు. అతనిలో ఒక విపరీతమైన సందేహం పట్టుకుంది. 'అది నిజమా? ఆ కుర్రాడిలో తన భార్య పోలికలు అగుపిం చడం తన పొరపాటా? ఈ నాటకం ఏమిటి? తనకి తెలియకుండా తన భార్యకి పిల్లాడా? '

అతని బుర్ర ఆలోచించడం మానివే సింది. కారణం కామేశ్వరి అక్కణ్ణించి బయిల్దేరి బయటికి వెళ్లిపోవటమే. ఏమి టో ఈ రాత్రే తేల్చుకుందామని కృష్ణరాజు గబగబా నడచివెళ్లాడు. అతని నడకా ఆవేశం ఆ నిమిషాన అటూ ఇటూ ఆలో చించలేని తాగుబోతుని జ్ఞప్తికి తెచ్చింది.

భార్యా భర్తా ఇంటి గడపదగ్గరే తారస పడ్డారు. ఒకరు తీరని ఆవేదనతో - మరొ కరు అత్యంతావేశంతో. కృష్ణరాజు చాలా ఆవేశంతో కామేశ్వరిని గడపలోనే పట్టు కుని ఆగి, "ఈ నాటకం ఏమిటండి? కామే శ్వరి గారూ!" అన్నాడు.

కామేశ్వరి, చాలా అధైర్యపడింది ఆ క్షణాన. తన భర్త ఈ రకంగా తనని అడ గడం ఇదే మొదటిసారి. కానీ మరుక్షణమే ధైర్యం తెచ్చుకుని, "లోపలికి పోనివ్వండి ముందు, తీరికగా మాట్లాడదాం" అంటూ అతన్ని విదిలించుకుని చరచరా లోపలికి పోయింది.

కృష్ణరాజు, స్తబ్దుడై మెల్లగా ఆమెని అను

సరించాడు. రెండడుగులు వేసేప్పటికి అతనిలో అగ్ని రగులుకుంది; గబుక్కున తన గదిలోకి వెళ్ళి, తనెన్నడో కొన్న చాకు పంచెతో తుడిచి, తీసుకుని, కామేశ్వరి కోసం వెదుక్కుంటూ ఆమె గదిలోకి వెళ్ళాడు. ఆమె గదిలో కిటికీ దగ్గిరగా నుంచుని వుంది... బయట అప్పుడే ఉదయిస్తున్న చంద్రుణ్ణి నీరసంగా చూస్తూ..!

కృష్ణరాజు ఆమె దగ్గిరకి అత్యుద్రేకంతో పోయి ఆమె జుట్టు ఒక చేత్తో పట్టుకుని, బాకుని గుండెల్లో గురిపెట్టి, "చెప్పు, ఆ కుర్రాఁరెవడో? వాడికీ నీకు ఏం సంబంధమో? " అన్నాడు.

పరిస్థితిని అర నిముషంలో అర్థం చేసుకుంది కామేశ్వరి. ఆమె తన భర్త సంస్కారాన్ని అదివరకల్లా తప్పుడు అంచనా వేసింది. అతను ఇంత బలహీనుడని ఆమెకిప్పుడే తెలిసింది. ఇప్పుడు అధైర్యపడడం వల్ల జరిగేది తనకి అన్యాయమేగాక, అపజయం కూడానూ.

"ఆగండి. ఉద్రేకపడకండి. మీరు నన్ను పెళ్ళిచేసుకున్న తర్వాత, నన్ను నా గతికి వొదిలి నాలుగు సంవత్సరాలు ఎవరితోనో సుఖిస్తే, నేనేమీ మాట్లాడలేదు. అందులో మానవ సహజం ఉన్నదని భావించి వూరుకున్నాను. మీరు- నన్ను ఏమీ అర్థం చేసుకోకుండానే నాకు హాని చెయ్యటానికి ప్రయత్నిస్తున్నారు. కానీండి" అంది ఆమె జారిపోతున్న ధైర్యాన్ని కూడతీసుకుంటూ.

కృష్ణరాజు వస్తుతః అధైర్యవంతుడు. అతను దుర్మార్గం చెయ్యగలడు గానీ, ఇంకోళ్ళకి తెలిసేటట్టు ఎన్నడూ చెయ్యలేడు. ఇదివరలో చెయ్యలేదు కూడానూ. భార్యని ఊరికే బెదిరించటానికే బాకు తెచ్చాడు కానీ పొడవడానికి కాదు. అతను కోపంతోనే, "వెధవ వుపన్యాసం చెప్పావు గానీ, ఆ పిల్లవాడెవరో చెప్పు ముందు, లేకపోతే.." అన్నాడు పొడిచేవాడికి మల్లే, కత్తి వొణికించి. కానీ చెయ్యి భయంతో సగంలోనే వొణకుతోంది.

కామేశ్వరికి ఈ సంగతి కొద్దిగా తెలిసింది. ఆమె ఇంకా ధైర్యంగా, "పొడిస్తే పొడవండి. జరిగింది చెప్పేస్తాను. మీరు ధైర్యవంతులనీ, ఇతరుల తప్పులని మానవ నైజంగా అంగీకరించే సంస్కారం మీకుందనీ నేను భావించాను. కానీ మీరింత పిరికివారనీ, కనకనే ఆవేళ నా క్షమార్పణకోసం అంత తాపత్రయపడ్డారనీ ఇప్పుడు తెలుస్తోంది. నేను స్కూలులో చదువుతుండగా ఒకతను నన్ను ఒక రోజు పరిస్థితుల అనుకూలతని అండగా చేసుకుని, నా చిన్నతనపు అజ్ఞానాన్ని పురస్కరించుకునీ, అనుభవించాడు. దాని ఫలితంగా గర్భవతయినాను. నా స్నేహితులు నాకు ఈ విషయంలో సహాయం చేసి, ఆ పిల్లవాణ్ణి ఇందాక మీరు చూసిన దంపతులకి ఇచ్చి వేశారు. ఆ కుర్రాడంటే నాకు చాలా మమకారం ఉంది. అతని పోషణని ఇన్నాళ్ళబట్టీ నేనే భరిస్తూ వచ్చాను. ఇక ముందు భరిస్తాను. ఇది, మన పెళ్ళికాక ముందు సంగతి. అప్పుడు ఆకస్మాత్తుగా జరిగిన దురదృష్టానికి నన్ను ఇవ్వాళ మీరు సంజాయిషీ అడిగేట్టయితే నేనేమీ చెప్పలేను. నేను ఇంకొకర్ని దేని కోసమూ సంజాయిషీ అడగను. ఇంకొకరు నన్ను దేనికోసమూ సంజాయిషీ అడగడం అనవసరం" అని తెగేసి చెప్పింది.

కృష్ణరాజు, కోపోద్రేకంతో, కత్తి కిందికి విసరి పారేశాడు. "ఉద్ధరించావు-లం-... నిన్ను ఖూనీ చేసి.. ఆ స్త్రీ హత్య ఎక్కడ మొయ్యను. పో-ఈ ఇంట్లో నుంచి; నీ పిల్లాడు దగ్గిరకో, నీ రంకు మొగుడి దగ్గిరకో... సంస్కారమట - ధైర్యమట ..." అంటూ, ఆమెని వాకిలిదాకా ఈడ్చుకొచ్చి, రోడ్డుమీదికి నెట్టి తలుపేసుకున్నాడు నిశ్చింతగా. కామేశ్వరి, ఏమీ ఆశ్చర్యపడకుండా, ఆవేశపడకుండా, అక్కణ్ణించి వెళ్ళిపోయింది. V

తెలుగు కథ - సరసి

# అష్టోత్తర వసంతం

"నూతన వధూవరులకు స్వాగతం! మా గ్రామ ఇలవేలుపు సంతాన గోపాల స్వామి సన్నిధిలో ప్రతి ఏటా వైశాఖమాసంలో వసంతోత్సవం జరపడం సంప్రదాయంగా వస్తోంది. ఇందులో 'నూట ఎనిమిది జంట'లకు 'సామూహిక వివాహాలు' నిర్వహించడం కద్దు. అదే మా గ్రామ విశిష్టత. రాష్ట్రం నలుమూలల నించి ఎంతో మంది వచ్చి ఇక్కడ వివాహాలు చేసుకుని, వంశాభివృద్ధి చెంది సుఖసంతోషాలతో ఉంటున్నారు.

ఆ క్రమంలోనే ఈ ఏడు కూడా మీ నూట ఎనిమిది జంటలూ పెళ్ళిళ్లు చేసుకున్నారు. అయితే ప్రతి ఏడూ వివాహాల అనంతరం కొందరు కొత్తదంపతులు 'సామూహిక వివాహాలు నిర్వహించిన వారు ఆ తర్వాతి కార్యక్రమాన్ని- అంటే- శోభన కార్యక్రమాన్ని ఎందుకు నిర్వహించరూ..' అని వారిలో వారు తర్కించుకోవడం నేను వింటున్నాను. నిజమే! ఈ పుణ్యస్థలంలో వివాహం చేసుకుని రెండు మూడు రోజులకు గానీ వారి స్వస్థలాలకు చేరుకోలేనివారున్నారు. అందువల్ల ఆ ముచ్చట కూడా ఇక్కడే తీరుద్దామని సంకల్పించాం. అయితే దేవాలయం తరపున వివాహాలు జరపడం వరకే. మిగిలిన వ్యవహారాల నిర్వహణకు ఎవరైనా ముందుకు వస్తే బాగుంటుందన్న ప్రతిపాదన వచ్చినపుడు- ఎవరో ఎందుకు మనమే నిర్వహిద్దాం, మనకెట్లాగూ సంతానం లేదు, ఇటువంటి సత్కార్యం చేస్తే సంతానమైనా కలుగుతుందని నా భార్య కోమలి సలహా ఇచ్చింది. అందువల్ల ఈ ఏటి నుంచి సామూహిక శోభన కార్యక్రమాన్ని నేను నా సొంత ఖర్చుతో ప్రారంభించాలని సంకల్పించాను" అన్నారు సర్పంచి గారు చిరుదరహాసం చేస్తూ. కొత్తపెళ్లికొడుకులంతా చప్పట్లు కొట్టగా, పెళ్లికూతుళ్లంతా కొరకొరా చూశారు భర్తలవైపు.

★ ★ ★

చంద్రుడు చల్లగా వెన్నెల కురిపిస్తున్న వేళ ఊరికి నాలుగుమైళ్ల దూరంలో సర్పంచిగారి మామిడి తోట దగ్గరకు మూడు బస్సులు వచ్చి ఆగాయి. వాటిల్లోంచి దిగిన కొత్త జంటలకు స్వాగతం పలికారు సర్పంచి దంపతులు.

తోట ప్రధాన ద్వారానికి 'అష్టోత్తర వసంతానికి స్వాగతం' అని పెద్ద బ్యానర్ కట్టి ఉంది. యువజంటలు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ గేటుదాటి లోపలికి ప్రవేశించాయి. లోపల కొద్దిదూరంలో విశాలమైన ఓ కృష్ణ మందిరం, ఆ మందిరం మధ్యలో వేణువుతో ఒయ్యారంగా నిలబడిన శ్రీకృష్ణుడి పాలరాతి విగ్రహం ఆకర్షణీయంగా కనిపిస్తున్నాయి.

నూతన దంపతుల వినోదం కోసం ఆ

మందిరంలో 'గోపికా వస్త్రాపహరణం' నృత్య ప్రదర్శన ఏర్పాటయ్యింది. గోపికల జలకాలాటలు, కృష్ణుడు వస్త్రాలతో సహా చెట్టెక్కి కూర్చోవడం, గోపికల దీనాలాపన లు- అన్నీ కనుల విందుగా ప్రదర్శించారు కళాకారులు. ఆ ప్రదర్శన కొత్తజంటలకు శృంగార రసోద్దీపన కలిగించి, వారి వల పుల పంటకు విత్తులు నాటింది.

ఈలోగా కొందరు మహిళా వాలంటీర్లు మందిరం ముందు కొన్ని కౌంటర్లు ఏర్పాటు చేసుకుని నిలబడ్డారు. మొదటి బల్ల దగ్గర వధూవరులమీద పన్నీరు చల్లి సెంటు పూశారు. రెండోబల్ల దగ్గర పెళ్లి కూతుళ్ల తలల్లో బారెడు మల్లెపూదండల్ని గుచ్చి, మగవాళ్ల చేతులకు దండల్ని చుట్టేరు. తర్వాతి బల్ల దగ్గర పెళ్లి కూతు ళ్లకు పాలగ్లాసులు, మంచినీళ్ల సీసాలు, స్వీట్లు అందించారు. కాస్తంత దూరంలో ఉన్న బల్ల దగ్గర 'రాష్ట్ర ప్రభుత్వ సౌజ న్యంతో' అని రాసివున్న చిన్న పేకట్టు చేతిలో పెట్టారు. దానిమీద ఎర్రటి రంగులో త్రికోణం గుర్తు ఉంది.

"తెల్లవారే వరకు మేము గేటు బయట కాపలా ఉంటున్నాం. మీకు ఎటువంటి భయమూలేదు. నిశ్చితంగా కార్యోన్ముఖులు కండి" అన్నారు వాలంటీర్లు. అలా ప్రక టించిన మరుక్షణం కొత్తజంటలు ఉరకలు వేస్తున్న ఉత్సాహంతో పరుగులు తీశారు తోటలోకి.

అది పాతికెకరాల మామిడితోట. కోత కొచ్చిన కాయలతో తోటంతా కళకళలాడు తోంది. మామిడి చెట్లకు తోడు మల్లె పందిళ్లూ, సంపెంగ, మందారాలవంటి పూల చెట్లూ, జాజి తీగెల గుబుర్లు తోటంతా పరుచుకుని, చిరుగాలికి నాట్యం చేస్తున్నాయి. మొత్తం తోటనంతా వెన్నెల వల కప్పేసింది. చెట్లకింద, పందిళ్లకింద, గుబుర్ల మాటున చిరుచీకట్లలో ఎక్కడ వీలుగా వుంటే అక్కడ ఒక్కొక్క మంచం, దానిమీద తెల్లని దుప్పటి, తలగడలు అప్ప టికే ఏర్పాటు చేశారు. విస్తరించిన చెట్లూ, పూలచెట్ల గుబుర్లూ ప్రతిపాన్పుకూ రక్ష ణగా, మరుగుగా, మదుగుగా మరొకరి దృష్టి పడకుండా కాపు కాస్తున్నట్లున్నాయి. కుర్చీలాటలోలాగా పరుగులు పెడుతూ మంచి చోటు వెతుక్కుని స్థిరపడిపో యాయి పెళ్లిజంటలు.

★ ★ ★

ఎక్కడి వాళ్లక్కడకి చేరారని నిర్ధారించు కున్నాక సర్పంచిగారూ, భార్య కోమలి కృష్ణమందిరంలో విశ్రమించారు. వాలిన రెండు నిమిషాలకే అటువైపు తిరిగి నిద్ర పోయి గురక పెట్టసాగారు సర్పంచిగారు. ఆమె అతని వైపు నిర్వేదంగా చూసింది. ఆశలు తీరని ఆవేదనగా మిగిలిపోయిన ఆమె అతడికి రెండవ భార్య. ఇద్దరి మధ్య ఇరవైవసంతాల ఎడం.

ఓ రాత్రివేళ మగత నిద్రలో ఉలిక్కిపడి లేచింది కోమలి. ఒక పక్క ఒళ్లంతా చెమ టతో తడిసిపోయివుంది. కొంగుతో మొహం తుడుచుకుంటూ పక్కనే సమ్మో హనకరంగా నవ్వుతున్న కృష్ణుడి విగ్రహం వైపు తదేకంగా చూస్తూ వుండిపోయింది.

కొద్దిసేపటికి ఏదో తెలియని మోహం, ఏమిటో చెప్పలేని తన్మయత్వం ఆమెను ఆవహించాయి. తోటలోంచి సన్నగా వేణువు వినిపించిదామెకు. లేచి మందిరం బయటకు వచ్చింది కోమలి. తోటలోంచి వస్తున్న పరిమళం చిరుగాలితో కలిసి వస్తూ వస్తూ.. వచ్చి ఆమెకు మత్తెక్కిం చింది. అవ్యక్తమైన పరవశంతో వూగి పోతూ అప్రయత్నంగా తోటలోకి ప్రవేశిం చిందామె.

ఆ వసంత రాత్రి చిలిపి వలపుల చిరు గాలులు, జాజి మల్లెల తావుల గుసగు సలు, మావిరెమ్మల మధ్య కోకిలల కుహూ కుహూలు, శృంగారపు తెరల బృందావ నంలా సింగారాలు ఒలికిస్తోంది తోటంతా.

ఒక మల్లెపొద చాటునుంచి ఏవో సన్నని మాటలు వినిపిస్తున్నాయి కోమలికి. సవ్వడి చెయ్యకుండా వెళ్లి చాటుగా నక్కి చూసింది. అద్భుతమైన దృశ్యం! ఆమె కన్నులు వెన్నెల గనులయ్యాయి.

నల్లనయ్య కౌగిట్లో గోపిక! "తెల్లవారనీకు ఈ రేయిని, తీరిపోనీకు ఈ తీయని హాయిని" అంటున్నాడు రసాస్వాదన చేస్తున్న గోపాలుడు. ఈ తీయని మాటలే తనకు వేణువై వినిపించాయా ఇందాక..? తన్మయత్వంలో చేతులు జోడించింది కోమలి.

ఈలోపు పక్కనే వున్న గున్నమామిడి చెట్టు వెనకవైపు నుంచి కిలకిల నవ్వులు వినిపించాయి. అటువైపు కదిలి తొంగి చూసింది కోమలి. "ఆమని సొబగుల అలివేణీ, నిను ఏమని పొగడుదునే" అంటూ ఆ చుబుకం మీద ముద్దు పెట్టుకుంటున్నాడు ప్రణయారాధకుడు. ఆమె చూపు మరొక పొదవైపు మళ్లింది. ఒక్కొక్క పక్క మీద ఒక్కొక్క చక్కని వసంత శోభ కవితలల్లుకుంటోంది. "నీ తెలికన్నుల తేట వెలుగులే నాపై కురిసే వెన్నెల జలపాతాలు" అంటూ ప్రియురాలి కన్నుల్ని చుంబిస్తూ ఓ కన్నెరసికుడు కలవరిస్తూ వుంటే... మరొక పొదచాటున "నీ పెదవుల తేనెలే నాకు తీపి విందులు" అంటూ తన మదవతి అధరాన్ని వదలని మరో అభినవ మన్మథుడు. "తమకంతో పరవశింపజేసే నీ కౌగిలే నాకు స్వర్గం" అంటూ అర్ధనిమీలిత నేత్రాలతో తన్మయుడవుతున్న రసరాజు ఒక పొద మాటున గోచరిస్తే... "నీ విరిసీ విరియని మొలక సిగ్గులే నాకు కర్పూర నీరాజనాలు" అంటూ తన భామను గుండెకు అదుముకుంటున్న ఆనందరసాస్వాదకుడు మరొక పొదచాటున!

"హా.. ఉహు.. ఓహ్.. అబ్బ.." వంటి చిలిపి వూపిరుల సవ్వడుల్ని పొదలన్నీ వింటూ, అప్పుడప్పుడు అభినందనగా ఒకటి, రెండు పువ్వుల్నో చిగురాకుల్నో వారిపైన విసురుతున్నాయి.

తోటలో పాన్పుల మీద కనిపించిన ప్రతి జంటా రాధాకృష్ణులుగానే తోచింది కోమలికి. 'ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కొక్కడై' అన్నట్టు 'ప్రతి గోపికకీ ఆమె ఒక్కతికే పరిమితమైనట్టు నటిస్తూ అందరితోనూ కులుకుతున్నావా దొంగా!' అనుకుంది కోమలి మనసులో. ఒక్కొక్క పాన్పును ఒక్కొక్క పుణ్యక్షేత్రంగా భావించి చేతులు జోడించింది. ఇంత మంది గోపికలలో తను కూడా ఒక గోపిక కాలేకపోయానే అని బాధతో దుఃఖించింది కోమలి. వెంటనే కళ్లు తుడుచుకుని 'లేదు లేదు అన్నిచోట్లా వున్నది నేనే' అనుకుని ఆనందంతో పరవశించిపోయింది.

★ ★ ★

తోట మెల్లగా నిద్రలోకి జారుకుంది. అంతవరకూ ఆరాటపడిన పోరాటవీరులు అలసిసొలసి వాలిపోయారు. అందమైన అనుభవాలకు ఆతిథ్యమిచ్చిన అతివలు మగత నిద్రలోకి జారుకున్నారు. ఎడతెరిపి లేకుండా పూలబాణాలను సంధించి వలపు పోరుకు పురికొల్పిన మన్మథుడు తన ప్రతాపానికి తగిన ప్రతిఫలం ముట్టిందని గర్వపడ్డాడు. అతడు ధరించిన తూణీరాన్ని, మిగిలిన బాణాల్ని తీసి పక్కన పెట్టి, కొంగుతో భర్త నుదిటికి పట్టిన చెమటను తుడిచింది రతీదేవి. అతడి కళ్లల్లోకి చూస్తూ చిలిపిగా నవ్వింది. మన్మథుడు కూడా శ్రుతి కలిపాడు. వసంతుడు తోటంతా కలియ తిరుగుతూ వచ్చి ఆ ఇద్దర్నీ అభినందించాడు.

ఇంతలో ఒక్కసారిగా సుడిగాలి ప్రారంభమైంది. అది క్షణాల్లో తీవ్రమైంది. ఆదమరచి నిద్రిస్తున్న కొత్త దంపతులు ఉలిక్కిపడి లేచి కూర్చున్నారు. చూస్తూవుండగానే వాళ్లు విడిచిన బట్టలన్నీ గాలిలో ఎక్కడికో ఎగిరిపోసాగాయి. వలపు రసా

స్వాదనకు పానకంలో పుడకల్లా అడ్డుగా వున్నాయని తొలగించిన ఆ దుస్తులతో బాటు, వాటిని అందుకోబోయే ప్రయత్నంలో మంచాలు దిగగానే, వాటి మీద పరిచిన దుప్పట్లు కూడా ఆకాశంలోకి సుడులు తిరుగుతూ ఎగిరిపోతూ, అందనంత దూరంలో చెట్ల కొనకొమ్మలకు చుట్టుకుపోయాయి. వలువలు కోల్పోయిన వనితలు సిగ్గుతో ముడుచుక్కూర్చుండిపోతే, చేజారిపోతున్న బట్టల్ని దక్కించుకోవడం కోసం యువకులు హడావుడిగా పరుగులు తీయసాగారు. అనుకోని సంఘటనకు కొందరు హాహాకారాలు చేస్తే, అరుదైన అనుభవానికి కొందరు కేరింతలు కొట్టారు. ఆనందపు హేలలు, కేరింతలు, నవ్వులతో తోటంతా ఒకటే సందడి!

గాలి ఉధృతమైంది. దట్టమైన మబ్బులు క్షణాల మీద కమ్మి చంద్రుణ్ణి కప్పేశాయి. చిన్నగా చినుకులు ప్రారంభమయ్యాయి. గాలికి మామిడికాయలు వూగివూగి రాలి రాళ్లల్లాగా మీద పడసాగేయి. అప్పటికే మంచాల కిందకు దూరిన కొందరు వలపు వీరులు పెనుగాలి తీవ్రమై మంచాలు కూడా కదిలిపోయే పరిస్థితి వచ్చేసరికి బయటపడి, అందరూ కృష్ణ మందిరం వైపు పరుగులు తీశారు.

అప్పటికే మందిరానికి చేరుకున్న అతివలు కొందరు దుస్తులకు దూరమై, కృష్ణుడి పంచన చేరి, మగవాళ్లకు మందిర ప్రవేశం లేదని తలుపులు మూసేశారు. దాంతో మగమహారాజులు ఏ పుట్టకో చెట్టుకో పోయి తలదాచుకోవలసి వచ్చింది.

చిరువెలుగులో చిద్విలాసం చూస్తున్న కృష్ణుడి వంక చూస్తూ "ఇలా చీరలెత్తుకెళ్లి మమ్మల్నిలా నగ్నంగా... నీ కొంటె బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు కదా!" అంటూ నల్లనయ్య బుగ్గల్లో పొడిచింది ఒకామె.

"ఛీ సిగ్గుతో చచ్చిపోతున్నాం బాబూ! ఈ మగాళ్ల మధ్య" అంది మరో వనిత.

"నువ్వొక్కడివీ అయితే బాగానే వుంటుంది గానీ, మరో నూటెనిమిది మంది మగాళ్లున్నారు కదయ్యా ఇక్కడా" అంది ఇంకో లలామ.

"నూటెనిమిది కాదులే మావార్ని మినహాయించు, నూటేడే" అంది మరో యువతి నిట్టూరుస్తూ. అందరూ నవ్వేరు.

"మనం అందరం సిగ్గు విడిచి మొరబెట్టుకుంటేనే కృష్ణుడు కనికరిస్తాడు. రండి" అంటూ అందరూ కృష్ణుడు ముందు భక్తిగా చేతులు జోడించి మోకరిల్లేరు. వర్షం వెలిసింది! వాతావరణం శాంతించింది!

ఇంతలో రెండు జీపుల్లోంచి మహిళా వాలంటీర్లు పెద్దపెద్ద బట్టల మూటలతో దిగారు. కృష్ణుడే వస్త్రదానం చేసినట్టు భావించి యువతులందరూ ఎగబడి ఆ బట్టల్ని అందుకుని చుట్టుకున్నారు.

ఈలోగా మగవాళ్లు కూడా బట్టలు చుట్టబెట్టుకుని బైటకొచ్చారు.

"ఆ మధ్య తుఫాను వచ్చినపుడు ఆ బాధితుల కోసం బట్టలు సేకరించాం. వాటిల్లో చాలావరకూ మిగిలిపోయాయి. ఇపుడు మీరు కూడా వలపు తుఫాను బాధితులే కనక ఆ బట్టలు మీకు ఉపయోగపడుతున్నాయి. అందరూ బస్సులెక్కండి" అన్నారు సర్పంచిగారు గంభీరంగా.

తెలతెలవారుతుండగా బస్సులు బయల్దేరాయి. ఎవరూ మరొకరివైపు చూసే సాహసం చెయ్యలేదు.

అయితే తొలిరాత్రి ఆ అపురూప అనుభవానికి అందరూ మురిసిపోతూ తమలో తామే నవ్వుకోసాగారు. కొద్దిసేపటికి ఆ నవ్వులు పెద్దవై.. నవ్వుల దీపాలై వెలిగి మొత్తం బస్సులన్నింటినీ ఆ నవ్వుల వెలుగులతో నింపేశాయి.

★ ★ ★

పదిరోజుల తర్వాత పడగ్గదిలో- "మన సామూహిక శోభన నిర్వాకం నలుగురి నోటా పడి వచ్చే ఏడు సామూహిక వివాహాలకు ఎవరూ రారేమోనని భయపడ్డాను గానీ- ఇంకా మనం ప్రకటన కూడా ఇవ్వకుండానే వచ్చే సంవత్సరానికి దరఖాస్తులు కుప్పలుతెప్పలుగా వచ్చిపడుతున్నాయట. ఇదంతా సర్పంచిగారివల్లే వచ్చిందని ఆలయ ధర్మకర్త నన్ను తిట్టి పోస్తున్నాడట" అన్నారు సర్పంచిగారు భార్యతో.. కోమలి చెయ్యి అడ్డం పెట్టుకుని నవ్వింది.

"నా పేరు బైటికొచ్చిందిగానీ అసలీ అష్టోత్తరం ఐడియా నీదికాదూ-" అంటూ ఆమె నడుము మీద చిన్నగా గిల్లేరు సర్పంచిగారు.. నల్లరంగు వేసిన మీసాల మధ్య చిన్నగా నవ్వుతూ.. Ⓥ



భారతీయాంగ్ల కథ - జులియన్ సునిల్ మార్టిన్ రాయ్

# మోజు

ప్రీతి తన చిన్ననాటి స్నేహితురాలు నిక్కీని ఆ సాయంత్రం షాపింగ్ చేసేటప్పుడు కల్సింది. ఇద్దరికీ పెళ్లయింది. ప్రీతి ఆహ్వానించటంతో, ఆ ఆదివారం నిక్కీ తన భర్తతో కల్సి వారింటికి వెళ్లింది. ప్రీతి, ఆమె భర్త సందీప్.. నిక్కీని, ఆమె భర్త సమీర్‌ని ఆప్యాయంగా ఆహ్వానించారు. పరస్పర పరిచయాలు అయ్యాయి. మగాళ్లిద్దరూ స్నాక్స్ తింటూ టీ తాగుతూ కబుర్లలో పడ్డారు. గదిలో స్నేహితురాళ్లిద్దరూ తమ రహస్యాలను కలబోసుకుంటున్నారు.

"నా పెళ్లయి రెండేళ్లయింది. ఐదారు నెలల్లో ఇంట్లోకి పాపాయి రాబోతోంది. ఈ మధ్యనే కలకత్తాకి వచ్చాను. మా అత్తగారు వాళ్లు బాగా డబ్బున్నవారు. కాన్పూర్‌లో బహుళ అంతస్తుల భవనాలున్నాయి. ఆయన నన్ను అపురూపంగా చూసుకుంటాడు. అత్తింటి వేధింపులు అస్సల్లేవు. అయినా నాకు వింత వింత కలలు వస్తుంటాయి. వీటివల్ల నా ప్రవర్తనలో మార్పు వస్తోంది. ఊరికే చేతుల్లోంచి వస్తువులు జారిపడ్తుంటాయి. పరాకుగా ఉండి వంట చేసేప్పుడు చేతులు కాల్చుకుంటున్నా గూడా! ఒక రాత్రి వింత కల వచ్చిందే! ఓ యువకుడు, చక్కని కనుముక్కుతీరు, అందం, ఆకర్షణ ఉన్నవాడు, చూపుల్తో నన్ను కట్టిపడేశాడే! 'నీవంటే నాకిష్టం' అని నాతో పదేపదే అంటున్నాడే..." అంది నిక్కీ.

"మరి దానికి నువ్వేమన్నావు" స్నేహితురాలి కల గురించి కుతూహలంగా అడిగింది ప్రీతి.

"కలలోని నా రాకుమారుడు కనబడగానే 'మనిద్దరం ఎప్పుడూ కల్సుకోలేదు. నువ్వెవరివి?' అని అడిగాను. 'నీవు నాకు సుపరిచితురాలివి' అని అదేనవ్వుతో నన్ను సూదంటు రాయిలా ఆకర్షించాడే. అంతే ఆ రోజు నించీ ఆ అపరిచితుడే నా లోకం, నా ధ్యానం, నా సర్వస్వం... నా కలలో తప్ప అతన్ని ఎప్పుడూ, ఎక్కడా.. ఇంతవరకూ చూడలేదు నేను. అతనంటే ఏదో తెలియని వ్యామోహం ఏర్పడింది. కానీ ఇది నా భర్త ఎక్కడ గ్రహిస్తాడో అనే భయం కూడా ఉంది. కానీ నన్ను నేను తమాయించుకోలేక పోతున్నాను. సమీర్, నా అత్తమామలు నా ప్రవర్తనలోని మార్పుని గమనించారు. కానీ దాన్ని గర్భిణి లక్షణాలని సరిపెట్టుకుంటున్నారు. సమీర్ బలవంతంపై మార్పు కావాలని మా పుట్టింటికి వచ్చాను ఆయన్తో కల్సి" అని తన కల గురించి చెప్పింది నిక్కీ.

ఇంతలో ప్రీతి ఫ్రిజ్‌లోంచి సాల్మన్ శాండ్‌విచ్, సందేష్‌లు తీసి ప్లేటులో పెట్టి తెచ్చి నిక్కీకి ఇస్తూ-

"నిక్కీ! వీటిని తినవే. కాబోయే తల్లికి ఇవి అవసరం. మంచి పుష్టిగా, అందంగా ఉండే పాపాయి పుడ్తుంది" అంది.

"నీవూ తినవే ప్రీతీ! నీకూ త్వరలో బాబు పుడ్తాడు" అని నిక్కీ అనగానే ప్రీతి నవ్వింది.

నిక్కీ కూడా నవ్వి "వచ్చే ఆదివారం మా ఇంటికి రండి" అంది.

"ఉండు, మా ఆయన్ని అడిగి వస్తా"

అని వారిద్దరి భర్తలు కూర్చుని మాట్లాడు తున్న గదిలోకి వెళ్లి-

"సారీ! మధ్యలో పానకంలో పుడకలా దూరినందుకు! సందీప్! వచ్చే ఆదివారం నిక్కీ వాళ్లింటికి రమ్మంటోంది. ఏం చెప్పను? " అని ఆమె మాట పూర్తికాకముందే-

"ఆ... మీరు వచ్చి తీరాలి" వెంటనే నిక్కీ భర్త సమీర్ బలవంతపెట్టాడు.

"ఓకే.." అన్నాడు సందీప్.

అది వినగానే ప్రీతి నిక్కీ ఉన్న గదిలోకి వచ్చి- "నిక్కీ! మా ఆయన ఒప్పుకున్నాడే. సమీర్ కూడా బలవంతం చేశాడులే!" అంటూ ప్రీతి ఉత్సాహంగా చెప్పింది.

"వెరీ నైస్" అంది నిక్కీ.

పది నిముషాల తర్వాత ప్రీతి, సందీప్ లకు బై చెప్పి నిక్కీ, సమీర్‌లు ఇంటికి బయలుదేరారు.

శనివారం నిక్కీ ఎంతో ఆత్రంగా ప్రీతికి ఫోన్ చేసింది. ఫోన్లో "ప్రీతీ! మీరు రేపు ఉదయమే వచ్చేయండి. రోజంతా నాతో గడపవచ్చు. అన్నట్లు నీకో వింత విషయం చెప్పనా..! నా కలల రాకుమారుడ్ని చూశానే.. అచ్చు కలలో కన్పించినట్లే ఉన్నాడే! రోజంతా ఎవర్ని గూర్చి అయితే కలలు కనేదాన్నో అతనే నా కళ్లెదుట కన్పించాడు. నాకు చాలా ఆనందంగా ఉంది"

"అతన్తో మాట్లాడావా? "

"ఓ.. ఇదంతా ఫోన్‌లో చెప్పలేనే. రేపు ఉదయం దాకా వేచి ఉండు. అంతా సస్పెన్స్!" అని ఫోను పెట్టేసింది నిక్కీ.

ఆదివారం ఉదయమంతా సన్నగా చిరు జల్లులు, నీరెండతో వాతావరణం వింతగా ఉంది. 'అయ్యో! ప్రీతి సందీప్ ఈ ముసురుకి వస్తారో.. రారో..' అంటూ మనసు లోనే సందేహిస్తోంది నిక్కీ.

ఇంతలో నిక్కీ చెల్లెలు రీతూ కేకేసింది "అక్కా! కాఫీ రెడీ! అమ్మ పిలుస్తోంది"

ఇద్దరూ కాఫీ తాగుతూ టి.వి. చూసి, పేపరు తిరగేశారు. తొమ్మిదికల్లా ఎండ బాగా వచ్చింది. తొమ్మిదిన్నర కల్లా గేటు ముందు టాక్సీ ఆగటంతో "అక్కా ఎవరో వచ్చారే" అరిచింది రీతూ.

"సమీర్! నా ఫ్రెండ్, ఆమె భర్త వచ్చారు" అంటూ నిక్కీ భర్తని పిలిచింది. ఇద్దరూ ఆ దంపతుల్ని సాదరంగా ఆహ్వానించారు. ప్రీతి బెంగాలీ స్వీట్స్‌ని నిక్కీ చేతుల్లో పెట్టింది. తన ఫ్రెండ్‌ని అమ్మా నాన్నలకు కూడా పరిచయం చేసింది నిక్కీ. వంటవాడు అల్పాహారం వడ్డించాడు. అందరూ సరదాగా మాట్లాడుకుంటున్నారు. కబుర్లతో అల్పాహారం పూర్తయ్యాక రీతూ టి.వి ముందు కూలబడింది. సందీప్, సమీర్‌లు హాల్లో కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ప్రీతి, నిక్కీలు మాత్రం పడకగదిలోకి చేరారు.

"ఏమే, నీ కొత్త బాయ్‌ఫ్రెండ్‌ని ఎక్కడ, ఎప్పుడు కలిశావు? అతని పేరేంటి? ఏం చేస్తున్నాడు? " ప్రీతి తన ప్రశ్నలతో నిక్కీకి ఊపిరిసలపనివ్వలేదు.

"ఒసే ప్రీతీ! ఏంటే ఆ హడావిడి! అలా ప్రశ్నల వర్షం కురిపిస్తే ఎలా? అతని గురించి చెప్పాలంటే బోలెడంత ఉంది. రోజంతా నువ్వు ఇక్కడే ఉంటావుగా? భోజనాలయ్యాక చెప్తా" అంది నిక్కీ.

భోజనాలయ్యాక నిక్కీ తనగదిలో కూచుని కలలోని రాకుమారుడ్ని వర్ణించటం మొదలు పెట్టింది.

"అతనెవరో కాదే, మాచెల్లి రీతూ కొత్త ట్యూటరు. అతని పేరు ఆనంద్. ఆరడుగుల అందగాడు. అతన్ని ముఖాముఖి చూసి సంభ్రమాశ్చర్యాల్లో మునిగిపోయాననుకో. నా కలల రాకుమారుడు కంటి కెదురుగా ప్రత్యక్షం కావటం ఎంత అద్భుతం!" అంటూ నిక్కీ తన్మయత్వంతో చెప్పుకుంటూ పోతుంటే...

"అబ్బబ్బ! నీ బాయ్‌ఫ్రెండ్‌ని పొగడ్తల్లో ముంచేయకు. నీకు భర్త ఉన్నాడని మరువకు" అంటూ ప్రీతి వారించింది.

"అచ్చా బాబా అచ్చా! నన్ను అమితంగా ప్రేమించే భర్త ఉన్నా కూడా ఆనందే నామనసంతా ఆక్రమించాడు ప్రీతీ. కలల రాకుమారుడు ఓ వంక, నా గర్భం వల్ల వచ్చే సమస్యలు ఇంకో వంక నన్ను ఇరకాటంలో పెడ్తున్నాయే! అసలు మా తొలి కలయిక ఎప్పుడు జరిగిందో చెప్పనా! గత బుధవారం, అతను రీతూకి కమ్మని కంఠంతో పాఠం చెప్తుంటే అలా చెవులప్పగించి వినసాగాను. ఆ వ్యక్తిని చూడాలన్పించింది. వంటింటి వైపు వెళ్తున్నట్లు అడుగేసి అతన్ని చూశాను. అదే మొహం, అవే పోలికలు! గుండె దడదడలాడ్తుంటే, ఆ గదిలోకెళ్లి "గుడ్ ఈవినింగ్ సార్! సారీ, మిమ్మల్ని డిస్టర్బ్ చేస్తున్నందుకు.. నేను రీతూ అక్క నిక్కీని" అని

అనువాదం :
**ప్రవల్లిక**

పరిచయం చేసుకున్నాను.

"గుడ్ ఈవినింగ్! రీతూ చెప్పింది మీ గురించి. ఆమె మంచి విద్యార్థిని. నాకు చదివే పిల్లంటే చాలా ఇష్టం" అన్నాడు. ఆ రెండు మాటలకే నా అడుగులు తడబడ్డాయి. దాంతో ఇవతలికి వచ్చేశాను. ఆ మర్నాడు మా ఆయన బైటికెళ్లాడు. అమ్మానాన్న టీవీ చూస్తున్నారు. రీతూకి పాఠం చెప్తున్న ఆనంద్‌తో ఎలాగైనా మాటలు కలపాలనిపించింది. రీతూ చదువుకి అంతరాయం కల్గినా ఫర్వాలేదు, ఆనంద్ పక్కనే కూచోవాలనే పిచ్చి ఆలోచన నన్ను ఉండనీయటం లేదు. "రీతూ! ఓ గ్లాసు మంచినీరు ఇవ్వమ్మా!" అన్న ఆనంద్ స్వరం నా చెవిలో అమృత ధారలు కురిపించింది. అంతే దొరికిందే ఛాన్సు అని గ్లాసుతో వెళ్ళి నిలబడ్డాను రెప్పపాటులో. ఒకరి కళ్లల్లోకి ఒకరం అలా చూసుకుంటూ ఉండిపోయాం. "తీస్కోండి" అని గ్లాసం దించాను. "థ్యాంక్స్" అన్నాడు ఆనంద్.

"రీతూకి మీరు చదువులో మంచి ఆసక్తి, ప్రేరణ కలిగిస్తున్నారు. మీరిచ్చే నోట్సు బాగుంది" అన్నాను నేను. అందుకు ఆనంద్ "ఓహ్! నన్ను కూడా పొగిడేవారున్నారన్నమాట" అని తమాషాగా అన్నాడు. అతనికి బాగా దగ్గరగా కుర్చీ జరుపుకుని అతని చొక్కా అంచుల్ని తాకుతూ తీయగా అన్నాను "నాలాంటి కొత్తవారితో మాట్లాడటం మీకేమీ ఇబ్బందిగా అన్పించదా? "

"మీరేం కొత్తగా అన్పించటం లేదే? ! మీ గురించి రీతూ చెప్తూనే ఉంటుంది. మీ పెళ్లి ఆల్బం కూడా చూపించింది. అందమైన వధువుగా మీరు నా మదిలో నిల్చిపోయారు" అని ఆనంద్ బదులిచ్చాడు.

షాంపూతో స్నానం చేయడం వల్ల నా కురులు అతన్ని సుతారంగా ముద్దెట్టుకుంటున్నాయి. అతనూ రహస్యంగా మనసులోని ఆ అనుభూతిని ఎంజాయ్ చేస్తున్నాడు. ఆ విషయం నాకు తెలుస్తోంది. రీతూ జవాబులు రాస్తుంటే, తగ్గుస్వరంతో "మీది విశాల హృదయం, మీరు పక్కనుంటే హాయిగా ఉంది" అన్నాడు. నేను అతని కళ్లల్లోకి చూస్తుండిపోయాను. రీతూ మధ్యలో టాయ్‌లెట్‌కి వెళ్లగానే, నెమ్మదిగాలో గొంతుతో "ఆనంద్! నువ్వంటే నాకిష్టం. నిన్ను ప్రేమిస్తున్నా.." అన్నాను.

నిశ్శబ్దంగా విని ఊరుకున్నాడు. వెంటనే నేను "ఆనంద్! నన్ను నీవు ప్రేమించటం లేదా? నీ ప్రేమభిక్ష పెట్టవా? " అన్నాను. నా మాటలు అతన్ని కదిలించినట్లున్నాయి. "మరి నీ సంసారం మాటేంటి? " నాపై మోహం కలిగిన వాడిలా అడిగాడు. "నా సంసారం నాతోటే ఉంటుంది. నీవు నా సర్వస్వానివి, నాస్నేహ సంపదవి" అన్నాను. అంతలో రీతూ రావటం, ఆనంద్ సెలవు తీసుకుని వెళ్లిపోటం జరిగింది.

ఆ రోజు నేను ఆనంద్‌తో ఏకాంతంగా

ఉన్నప్పుడు సమీర్ అనుకోకుండా బైటనిం చి త్వరగా వచ్చేశాడు. ఆనంద్‌తో కూర్చు న్న నా వైపు అదోలా, ప్రశ్నార్థకంగా చూశా డు కానీ అనుమానించలేదు.

నేను వెంటనే సమీర్‌తో "ఇలా కూచోం డి, రీతూ చదువు చూస్తున్నా" అని నా భర్తకు పక్కనున్న కుర్చీ చూపాను.

సమీర్ కూర్చున్నాడు.

"ఏంటి త్వరగా వచ్చారు? బైట బాగా ఎండగా ఉందా? " అడిగాను.

"ఆ... అంత వేడిలేదులే" అంటుండ గానే చల్లని నీరు అందించి-

"సార్ రీతూకి మంచి నోట్సు ఇచ్చా రండి!. ఇంప్రూవ్ అయింది" అన్నాను.

సమీర్ నవ్వుతూ "సార్! మా నిక్కీకి టాలెంట్ ఉన్నవారంటే ఇష్టం" అన్నాడు.

"ఓ! అంతగొప్ప గుణం చాలా కొద్దిమం దికి ఉంటుంది సార్! మీరెన్నాళ్లు కలక త్తాలో ఉంటారు? " అనడిగాడు ఆనంద్.

"నేను ఒకటి రెండ్రోజుల్లో వెళ్లిపోతా. కానీ మా ఆవిడ ఓ నెల ఇక్కడే ఉం టుంది" అని చెప్పి సమీర్ వెళ్లిపోయాడు.

నిక్కీ మాటల ప్రవాహానికి భోజన సమ యం తాత్కాలిక విరామాన్నిచ్చింది.

భోజనాలు చేశాక అంతా విశ్రాంతిగా ఒరిగారు. నిక్కీ, ప్రీతి కబుర్లలో పడ్డారు. బాతాఖానీలో మునిగిన స్నేహితురాళ్లి ద్దరూ "నిక్కీ టీ టైం అయింది" అన్న తల్లి పిలుపుతో ఈ లోకంలోకి వచ్చారు. టీ తాగుతూ, వంటవాడు చేసిన కేక్స్ తిన్నా రంతా! నిక్కీ తిరిగి తన ప్రేమ కథను చెప్పడం ప్రారంభించింది.

"ఆనంద్, రీతూకి ట్యూషన్ కోసం రాగా నే అతనికి, ఓ గ్లాసు చల్లటి నీరు ఆపై టీ, స్నాక్స్ ఇస్తూ వస్తున్నాను. ఛాన్స్ దొరికిన ప్పుడల్లా రొమాంటిక్ జోక్స్ వేసేదాన్ని. ఒక్కోసారి నా చేతివేళ్లు అతని జుట్టులోకి పోనిచ్చి "తల ఎందుకు దువ్వవూ? " అని చిలిపిగా అడిగేదాన్ని" అని చెప్పింది నిక్కీ. అలా ఆ స్నేహితురాళ్లిద్దరూ కబుర్లు చెప్పు కుంటూనే ఉన్నారు రాత్రి భోజన సమ యం అయ్యేవరకూ..!

రెండ్రోజుల తర్వాత సమీర్ కాన్పూర్ వెళ్లిపోయాడు. రోజూ ఫోన్‌లో నిక్కీ, ప్రీతితో ఆనంద్ కబుర్లు చెప్పేది.

కొద్దిరోజుల తర్వాత సమీర్ నిక్కీని తీసి కెళ్ళడానికి వచ్చాడు. నిక్కీ ప్రీతికి ఫోన్ చేసి- "ప్రీతీ! మేమిద్దరం సన్నిహితంగా ఉంటున్నాం. కానీ ఆనంద్ హద్దులు దాట డు. సమీర్‌కి అవిశ్వాస పాత్రురాల్ని కాలే దింకా. రేపు నేను కాన్పూర్ వెళ్తున్నా. సమీర్ నన్ను తీసికెళ్లటానికి వచ్చాడు" అని చెప్పింది. నిక్కీ సమీర్‌తో వెళ్ళింది. కానీ ఏదో ఒక వంక పెట్టుకుని కలకత్తా వచ్చి ఆనంద్‌ని చూసిపోతుండేది నిక్కీ. కాన్పూర్‌లోనే పండంటి బాబుని ప్రసవిం చింది. బాబుకి ఆరోనెల వచ్చాక కలకత్తా వచ్చిన నిక్కీ ప్రీతిని కల్సింది. "ఏంటే? చెప్పాపెట్టకుండా వచ్చావ్? " బాబుని ముద్దెట్టుకుంటూ అంది ప్రీతి. నిక్కీ సమా ధానం చెప్పేలోపే "అబ్బ, ముద్దులమూట కడ్తున్నాడే నీ కొడుకు!" అంది ప్రీతి.

"మరే, నీవు ఇచ్చిన సందేష్‌లు బాగా మెక్కాను కదే!" అంది నిక్కీ.

"వీడికి పేరేం పెట్టావు? "

"రవి!"

"అవునూ? నీవెప్పుడు పిల్లల్ని కనటం మొదలెడ్తావే? " ప్రశ్నించింది నిక్కీ.

"మేమిద్దరం బానే ఉన్నాం అని డాక్టర్ల రిపోర్టు. లక్ కావాలి" నిట్టూర్చింది ప్రీతి. "ఒసే, ఆనంద్ మా బాబుని ఎత్తుకుని ముద్దాడాడే! ఇప్పుడు ఆనంద్ పాట్నాలో ఉన్నాడు. నా భర్త కన్నా ఆనంద్‌ని కాస్త ఎక్కువ ప్రేమించా. కానీ ఇప్పుడు నా ప్రాణం, ప్రేమ అంతా నా బాబు చుట్టూనే తిరుగుతోందే!" మనసులో ఏదోమూల తప్పుచేస్తున్నానన్న భావన పూర్తిగా తొలగి ఆనందంగా అంది నిక్కీ. V

ఫ్రెంచ్ కథ

- గైడి మపాసా

# శీతకాల విరహం

ప్రతి శుక్రవారం ఉదయం పదకొండు కల్లా ఠంచనుగా అతను రాచగృహ మైదానానికి చేరుకుంటాడు. రాగానే నెత్తిమీద టోపి కాళ్ల దగ్గర పెట్టుకొని గిటార్ మీటుతాడు. వెంటనే గళం విప్పి మధురమైన ప్రేమ గీతికలు ఆలపిస్తాడు. అతడి పాట వినిపించగానే ఆ మైదానం చుట్టూ వున్న ఇళ్ల కిటికీలు భళ్లుమని తెరుచుకుంటాయి. ఎగిరివచ్చిన సీతాకోక చిలుకల్లాంటి అమ్మాయిలు కళ్లు నులుముకుని, చెవులు రిక్కించి వరండాల్లో వచ్చి వాలుతారు. ఆ తియ్యని గానలాహిరిలో చిరునావలై తేలిపోతారు. అతను పాడే సమయంలో మిద్దెలపైన చేరిన ముద్దుగుమ్మలు డబ్బులు విసురుతారు. పరవశంతో ఆ గాన గంధర్వుడి వెంట పడతారు.

'నా కుటీరానికి రారండి. బంగారు వన్నెల ఆ కుటీరం నిత్యకల్యాణం పచ్చతోరణం. అమర ప్రేమలోని పరమానందం మిమ్మల్ని ఆస్వాదించమని స్వాగతిస్తుంది' అతడి పాట అలలు, అలలుగా అక్కడున్న అందర్నీ తడిపేస్తుంటాయి.

అతడి పాటలోని ప్రేమ భావన అమ్మాయిల మనసుల్లో మధురోహాలు కలుగజేస్తుంది. వలపులోని ఆనందం ఏమిటో?, ఎప్పుడో నాన్నమ్మ చెప్పిన కథల్లోని రాకుమారులెలా వుంటారో? అవన్నీ అనుభవించి ఆనందించాలని వాళ్ల ఉబలాటం. అవన్నీ ఈ యువ గాయకుడి విరహ సంగీతంలో ప్రతిధ్వనిస్తుంటాయి. వాళ్లని వివశుల్ని చేస్తుంటాయి. అమ్మాయిల కళ్లల్లో మెరుపులు, బుగ్గల్లో ఎరుపులు, వారి మనోగతాన్ని చెప్పకనే చెబుతుంటాయి. ప్రేమ పిపాస, ఆరాధన, అన్వేషణ, వాళ్ల కళ్లల్లో ప్రతిఫలిస్తుంటాయి. అంచేత, ఆ అమ్మాయిల్లో చాలామంది ఈ ప్రేమ పూజారితో జీవితం పంచుకోవాలనుకోవటంలో ఆశ్చర్యపడవలసిందేమీలేదు. అందుకు తగిన సమయం రావాలి అంతే! ఎప్పుడైనా చటుక్కున అతను పాట ఆపితే, వాళ్ల కళ్లు నిరాశతో మూసుకుపోతాయి. గుండెలు నిర్వేదంతో దడదడమంటాయి. కొందరమ్మాయిలు హద్దుమీరి కన్నుగీటటం, పెదాలు విప్పి వాయుచుంబనం అందించటం కద్దు. అన్ని హద్దులు రద్దు చేసుకోటానికి సిద్ధమేనని సందేశం పంపించటం కూడా అతగాడికి తెలుసు.

'అతగాడు నిజంగా అందగాడు. అతడి పాట మరింత అందమైంది' ఆ పాటగాడ్ని తలచుకుంటూ అతడి పొందుకోసం వారు తహతహలాడుతారు. విరహతాపంతో ఊగిసలాడుతారు. నిజంగానే ఆ సంగీత చక్రవర్తి సొగసైనవాడు. తేనెకళ్లు.. కోటేరు ముక్కు.. మన్మథుడి విల్లు లాంటి పెదాలు.. చురకత్తి మీసం.. ఉంగరాల జులపాలు - సోగ్గాళ్లకు సోగ్గాడు అమ్మాయిల పాలిట అతగాడు. అయినా అతడు అమ్మాయిల ఆపసోపాలు పట్టించుకోడు. ప్రేమ సందేశాలకు, చిలిపి సైగలకు చలించడు. బంగారానికి పరిమళంలా, ఆ మనోనిగ్రహం అతడి అందానికి అనుబంధం.




ఒకటి రెండుసార్లు, అమ్మాయిల మన్మథ చేష్టల్ని నిరసిస్తూ ఆకాశం వంక చూస్తూ, వాళ్ల మొహాల మీద ఉమ్మటానికి ప్రయత్నించాడు. కానీ సాహసించలేకపోయాడు. అలా జరిగినా, వాళ్లు మరింత రెచ్చిపోయే ప్రమాదమే కనిపించింది. రాన్రాను అమ్మాయిల ప్రేమ ముదిరి పిచ్చిగా

## పాతొక రోత!



ఇద్దరు స్నేహితురాళ్లు వాలెంటైన్ పార్టీలో కలిశారు.

**ఒకామె :** కొత్తసూటులో మీ ఆయన్ని గుర్తుపట్టలేకపోయానే!

**రెండో ఆమె :** ఫరవాలేదులే. సూటే కాదు, ఆయన కూడా కొత్తాయనే!

మారింది. ఇలా కాదని ఓ రోజు సామూహిక వలపు పంపిణీకి సన్నద్ధం అయ్యారు.

ఆ రోజు ఓ జవరాలు అందరి తరఫున వకాల్తా పుచ్చుకుని, అతడి ముందు కనక వర్షం కురిపించింది. ఆ సంగీత సార్వభౌముడికి జోహారులర్పించింది. చాటుమాటు విరహం దేనికని, నేరుగా తానే రంగ ప్రవేశం చేసేసింది. తనతో రమ్మంది. పైనుంచి మిగిలిన అమ్మాయిలు కూడా

**అనువాదం :**
**ఉప్పు రాఘవేంద్రరావు**

అతడి పొందుకోసం బాహాటంగానే పిలవడం ప్రారంభించారు. పోటీలు పడి కనకవర్షం కురిపించారు. అతడిపైకి పట్టురుమాళ్లు, సిల్కు తలపాగాలు విసిరారు. అతను అన్నింటిని ఏరుకుని సంచిలో దాచుకున్నాడు. టోపీని పెట్టుకున్నాడు.

"అందరికి నా ధన్యవాదాలు! అమ్మాయిలూ! నేను అందని ద్రాక్ష పండుని" అని మనవి చేశాడు. అతడి మాటలకు అమ్మాయిల బృందం నివ్వెరపోయింది. కాసేపటికి నాయకురాలు తేరుకుని ఓ అడుగు ముందుకేసి ఒక ప్రతిపాదన చేసింది.

"మనం ఇంతమంది. పాపం! అతనొక్కడు. అంచేత, మనలో ఎవర్నో ఒకర్ని అతడినే ఎంచుకోమందాం. ఏమంటారు? " అతడి పొందుకోరే సుందరాంగులను అడిగింది. "అలాగే" అమ్మాయిలందరూ ముక్త కంఠంతో తమ సమ్మతి తెలిపారు. వాళ్ల అంగీకారం తనకు తిరస్కారమన్నాడతడు. అలా అనటం వల్ల అతను అమ్మాయిల దృష్టిలో ఓ దక్షిణ నాయకుడిలా కనిపించాడు. అతడి పొందుకోసం పరితపించిపోతోన్న ఆ అమ్మాయిలు ఈసారి అతడితో సంబంధం లేకుండా తామే ఒక నిర్ణయానికి రావాలనుకున్నారు. చీటీల పోటీలో ఎవరి పేరు వస్తే వారు అతడితో వెళ్లాలి. అది వాళ్ల ఒప్పందం. అలా కఠినమైన శాసనానికి కట్టుబడ్డారు.

"ఇష్టమేనా ఒప్పందం? " నిలదీసింది నాయకురాలు ఆ గాన గంధర్వుడిని. తల అడ్డంగా ఊపి "వీల్లేదు. ఒకరైనా, ఒకరి తర్వాత ఒకరైనా మనం ఒకటికావటం జరగని పని" అంటూ కుండబద్దలు కొట్టాడు. అతడి మాటలు తూటాలై అమ్మాయిల హృదయాలకు గాయం చేశాయి.

"ఏం? ఎందుకని? " అమ్మాయిల ఆవేశం, ఆవేదనగా మారి దిగంతాలకు వ్యాపించింది. వారి బుగ్గలు వాడిన మల్లెలయ్యాయి. కళ్లల్లో నెగళ్లు చెలరేగాయి. కొంతమంది పళ్లుబిగబట్టి పిడికెళ్లు బిగించారు.

"ఆగండి! శాంతించండి! అతణ్ణి సమాధానం చెప్పనివ్వండి" అతడిపై ఆగ్రహం వ్యక్తం చేస్తోన్న వారిని వారిస్తూ అంది నాయకురాలు. అక్కడంతా సద్దుమణిగింది. అతడి సమాధానం కోసం అందరూ ఎదురు చూస్తున్నారు.

"మీరు నన్ను ఇంతగా కోరుకోవటం నాకు గర్వంగా వున్నా, మీ కోరిక కాదనలేకపోతున్నాను. అందుకు నాకూ బాధగానే వుంది. ఎందుకంటే ఇంటివద్ద మా అమ్మాయిలిద్దరూ ఇప్పటికే నాకోసం ఎదురు చూస్తూ వుంటారు" అంటూ అతని రెండు చేతులూ గాలిలో నిస్సహాయంగా ఊగి ఆగిపోయాయి. అమ్మాయిల గుండెల్లో ఒక్క క్షణం ఊపిరి ఆగిపోయింది. V

- మిలన్ కుండెరా




**ఫ్యూ**యల్ మీటర్‌లో ముల్లు సున్నా మీదకి పడిపోతోంది. ఆ స్పోర్ట్స్‌కార్ నడుపుతున్న యువకుడు చిరాగ్గా "ఛ! ఈ కారుకి పెట్రోలు దాహం చాలా ఎక్కువ!" అని స్టీరింగ్‌ని చేత్తో కొట్టాడు.

"ఈసార్నించైనా దీని విషయంలో జాగ్రత్తగా ఉండాలి" రూఢిగా చెప్పింది పక్కనే కూర్చున్న ఇరవైరెండేళ్ళ యువతి. అంతకు ముందు వాళ్ళకెన్ని చోట్ల ఇలాంటి అనుభవం ఎదురైందో అతనికి గుర్తుచేసింది.

ఆ యువకుడు "నాకేం దిగుల్లేదు, నీతో ఉంటే ఎలాంటి అనుభవమైనా సరదాగానే ఉంటుంది" అన్నాడు.

"అవును, సరదా నీకే! హైవే మీద కారాగిపోయినప్పుడల్లా నువ్వు దాక్కుని చూస్తుంటావ్. నేను రోడ్డుపక్కన వయ్యారంగా నుంచొని బొటనవేలెత్తి ఎవర్నైనా లిఫ్ట్ అడగాలి. పెట్రోల్ కొని మళ్ళీ హొయలొలుకుతూ ఈ దారిన వచ్చేవాళ్ళని లిఫ్ట్ అడగాలి. ఇవన్నీ నాకేం సరదా? " చిరుకోపంగా అంది యువతి.

"అలాంటి సమయాల్లో కార్లడ్రైవర్లు నీతో మర్యాదగా వ్యవహరించేవాళ్ళేనా? "

"ఏం? "

"ఇబ్బంది కలిగినట్టు చెప్తేనూ..."

అతన్ని ఉడికించాలని "అంత త్వరగా వాళ్ళను వదిలెయ్యడం ఇబ్బందే! కొంత మంది అసలు ఎలా ఉండేవారనుకున్నావు! పెట్రోలు క్యాను బరువువల్ల, నువ్వు ఎదురుచూస్తుంటావనే కారణంవల్లా వాళ్ళను బలవంతంగా వదిలెయ్యాల్సి వచ్చేది కానీ...." అతిశయంగా అంది.

"ఫో పందీ!"

"నువ్వే పందివి! కార్లో ఒంటరిగా వెళ్తూ ఎంతమంది అమ్మాయిలకి లిఫ్ట్ ఇచ్చి బుట్టలో వేసుకున్నావో నాకేం తెలుసు!"

అతను అమ్మాయిభుజాల చుట్టూ చెయ్యేసి నుదుటిమీద చిన్నముద్దు పెట్టాడు. ఆమె తనని ప్రేమిస్తోందని అతనికి తెలుసు. ఆడవాళ్ళకు సహజమైన ఓర్వలేనితనం ఆమెకు ఓ పాలు ఎక్కువే ఉందని కూడా తెలుసు. అసూయ మంచి లక్షణం కాదు. అయినా, అణకువగా ఉంటూ అసూయని ప్రదర్శిస్తే అది మనసుకు హత్తుకుంటుంది. అతనికింకా ఇరవై ఎనిమిదేళ్ళే. దానికే పెద్దవాడినై పోయాననీ, ఆడవారి గురించి తనకంతా తెలుసనీ అనుకుంటూంటాడు! తన పక్కనే ఉన్న, తను ప్రేమించే అమ్మాయిలో అతనికి అమితంగా నచ్చిందీ, తను ఎరిగిన ఏ ఇతర ఆడవారిలో లేనిదీ 'నిర్మలత్వం' అనే ఏకైక లక్షణం!

రోడ్డుపక్కన సైన్‌బోర్డ్ పెట్రోల్ బంక్ పావుమైలు దూరంలో ఉందని చెప్పింది. "ఆహా... ఎంత అదృష్టం!" అని అమ్మాయి అంటుండగానే కారుని బంక్‌దగ్గర ఆపి దిగాడు. అక్కడ ట్యాంకర్లోంచి సంపులు నింపుతున్నారు. ఆలస్యమయేలా ఉంది, ఆమెతో కార్లోనే కూర్చుందామనుకున్నాడు. కానీ అప్పటికే ఆమె కారు దిగింది.

"అబ్బ కూర్చొని కూర్చొని కాళ్ళు పట్టే శాయి. అలా తిరిగొస్తాను"

"ఎక్కడిదాకా? " కావాలనే అడిగాడు. ఈ ప్రశ్న వినగానే అమ్మాయిలో కలిగే తత్తరపాటును చూస్తూ నవ్వుకోవడం అతనికి సరదా. వారిద్దరి పరిచయమై ఏడాది. ఇంకా ఆమె అతనిముందు సిగ్గుపడుతుంది! సిగ్గుతో ఎర్రబడ్డ ఆమె ముఖమంటే అతనికి చాలా ఇష్టం. ఈ సిగ్గే ఆమెను ప్రత్యేకమైన వ్యక్తిగా చేస్తుంది. ఆమె సిగ్గును తనకు చెందిన అపురూప వస్తువుగా భావిస్తాడతను.

★ ★ ★

అమ్మాయికి గంటలతరబడి కార్లో వెళ్ళడం విసుగు. తుప్పలు కనిపించినపుడు ఆపమని అడగాలంటే సిగ్గు. అతను తెచ్చిపెట్టుకున్న ఆశ్చర్యంతో 'ఎందుకూ' అనగానే ఆమెకి కోపం వచ్చేస్తుంది. తన సిగ్గుకి అర్థం లేదని, అది వెనుకటితరం లక్షణమని తెలుసు. ఉద్యోగం చేసే చోట కూడా ఆమెను ఈ విషయంలో గేలి చేస్తుంటారు. తోటి ఆడవారిలా తనుకూడా శరీరంగురించి పట్టించుకోకూడదని ఆమె అనుకునేది. ఆత్మ శరీరాన్ని బట్టల్లాగే తొడుక్కుంటుందని, అది దైవికమేగానీ వ్యక్తిగతం కాదనీ ఎన్నోసార్లు నచ్చజెప్పుకునేది. అయినా శరీరం, మనసు అద్వైతం అన్న భావనలోంచి బయటపడలేకపోయేది. అందుకే శరీరం గురించిన ఎటువంటి ఆలోచనైనా ఆమెకు మనసులో ఆదుర్దా పుట్టిస్తుంది.

అతని సాహచర్యం ఆమెకెంతో ఇష్టం. అతను ఎప్పుడూ ఇతర మగవారిలా శరీరాన్నీ మనసునీ విడివిడిగా చూడలేదు. అతని దగ్గర మాత్రమే తను తనలా ఉండగలదు. ఈ ప్రేమ వెనకే అనుమానం కూడా తారట్లాడేది. ఇతర స్త్రీలు అతన్ని చాలా తేలిగ్గా వల్లో వేసుకుంటారేమోనని. ఈ అనుమానం అతని మాటలు, చేతల వల్ల ఇంకా బలపడేది. తనకి అటువంటి స్త్రీలు చాలామందే తెలుసని చెప్పేవాడు. ఎప్పుడో ఒకరోజు అలాంటిదాని కోసం తననొదిలేసి పోతాడని ఆమె భయం! వారిద్దరూ ఒకరికోసం ఒకరుగా జీవితాంతం కలిసుండాలని ఆమె ఆశ, కోరిక! కానీ ఎప్పుడైతే తను అతనికి సంపూర్ణంగా సమర్పించుకోవాలనుకుంటుందో అప్పుడే - ఇంకేదో ఇవ్వలేకపోతున్నాననే భావన ఆమెను ఆవరించేసేది. పైపైమెరుగుల ఆకర్షణో సరసపు మాటలో ఇచ్చే మామూలు ఆనందం తను అతనికి ఇవ్వలేకపోతున్నానని మథనపడేది. గాఢ ప్రేమా, ఆటవిడుపు ప్రేమా రెండూ కలవలేకపోతున్నాయని చింతించేది!

అయితే ఇప్పుడామె అనుమానాలని దూరంగా నెట్టేసి హుషారుగా ఉంది. సంవత్సరంనించీ కలలుగన్న రెండువారాల సెలవులో ఇవాళ మొదటిరోజు. ఆకాశం నిర్మలంగా ఉంది, అతను తన పక్కనే ఉన్నాడు, తన సంతోషానికి అవధుల్లేవు!

అతను ఎక్కడికి అని అడగ్గానే ఆమె బుగ్గల్లోకి ఎరుపు పాకింది. జవాబు చెప్పకుండానే బంక్‌కి కొంచెం దూరంలో ఉన్న చెట్లచాటున మాయమైంది. ప్రేమించే వ్యక్తిని అప్పుడప్పుడు విడిచి ఉండటం అవసరం. కొద్దిపాటి విరహం బంధం బలపడటానికి ఎంతో తోడ్పడుతుంది!

కాసేపటికే ఆమె హైవే మీదకొచ్చి కారు కోసం వెనక్కి చూసుకుంటూ నడుస్తోంది. కనుచూపుమేరలో కారు కనపడగానే నిలబడిపోయి అజ్ఞాతవ్యక్తిలా లిఫ్ట్ కోసం చేతులూపడం మొదలుపెట్టింది. స్పోర్ట్స్ కార్ స్లో అయింది. అతను కిటికి అద్దం దించి నవ్వుతూ అపరిచితుడిలాగే "ఎక్కడిదాకా వెళ్తున్నారు? " అనడిగాడు.

"బిస్త్రిట్సా" అందామె కొంటెగా నవ్వి.

"నేనూ అటే. ఎక్కండి" అంటూ తలుపు తీశాడు.

ఆట మొదలైంది.

★ ★ ★

అతను తన గర్ల్‌ఫ్రెండ్ ఉల్లాసంగా ఉన్నపుడు అమితంగా ఇష్టపడతాడు. ఇంట్లో మంచంపట్టిన తల్లికి చాకిరి, ఉద్యోగంలో శ్రమదోపిడి- దీంతో ఆమె బాగా అలసిపోతుంది. అందుకే ఆమె ఆనందంగా, హుషారుగా ఉంటే అతను ఎంతో మురిపెంగా చూస్తూ ప్రోత్సహిస్తాడు.

"ఐదు సంవత్సరాలుగా డ్రైవ్ చేస్తున్నానుగానీ ఈరోజు నాకు పట్టిన అదృష్టం మాటల్లో చెప్పలేను. ఇంత అందమైన స్త్రీకి మునుపెన్నడూ లిఫ్ట్ ఇవ్వలేదు!" నవ్వుతూ తెలియనివ్యక్తిలా మనస్ఫూర్తిగా చెప్పాడు.

ఆమెకి పొగడ్తల్లోని సుఖం అందుబాటులోకి వచ్చింది. ఆట కొనసాగించాలని "మీరు అబద్ధాలు బాగా చెప్తారు" అంది.

"నేను అబద్ధాలకోరులా కనిపిస్తున్నానా? "

"ఆడవారికి అబద్ధాలు చెప్పేవారిలా ఉన్నారు" అప్పుడామెకు అతను స్త్రీలతో అబద్ధాలాడేవాడిలానే కనిపించాడు.

ఆమె అసూయ అతన్ని చికాకు పెట్టేదే, అయితే ఈ మాటలు నిజంగా తనని కాదు, అపరిచిత డ్రైవర్‌ని అంది! అందుకని భుజాలెగరేసి అడిగాడు "ఎనీ ప్రాబ్లెం? "

"నేను మీతో కలిసి వెళ్తుంటే ప్రాబ్లెం"

అతనికి తన శ్లేష అర్థమవుతుందనుకుంది.

"తన మనిషి గురించిన ప్రతి చిన్నవిషయం స్త్రీలను ఆదుర్దా పెడుతుంది. అయినా మనం అపరిచితులం కాబట్టి తొందరగానే కలిసిపోవచ్చు!"

ఈసారి కావాలనే అతని మాటల్లోని అర్థం గాలికొదిలేసింది. డ్రైవర్‌తో చెప్పింది "కాసేపట్లో విడిపోయేవాళ్ళం ఇవన్నీ పట్టించుకోవటం అవసరమా? "

"అదేం? "

"నేను బిస్త్రిట్సాలో దిగిపోతాను కదా!"

"నేనూ మీతోపాటు వచ్చేస్తే? "

ఆమె కళ్ళెత్తి అతనివంక చూసింది. ఇతర స్త్రీలను వల్లో వేసుకునేప్పుడు అతను ఎలా ఉంటాడని ఊహించుకుందో, ఇప్పుడు ముమ్మూర్తులా అలానే ఉన్నాడు. అపరిచితురాలితోనే ఇంత కవ్వింపుగా మాట్లాడుతున్నాడే, ఇదే అతని నిజస్వరూపమా? అనుమాన బీజం నాటుకుంది ఆమె మనసులో.

"నాతో వచ్చి ఏంచేస్తారు? "

అతను ఏమాత్రం తగ్గకుండా "ఇంత అందమైన అమ్మాయితో వయసులో ఉన్న మగాడు ఏంచెయ్యాలో ఎక్కువ ఆలోచించక్కర్లేదు" అన్నాడు.

ఈ మాటలు అపరిచితురాలితో కాదు, తన గర్ల్‌ఫ్రెండ్‌తోనే అన్నాడు. కానీ ఆమెకు తన భయాలన్నీ ఒక్కసారే దాడి చేసినట్టనిపించింది. పొగడ్తగా తీసుకోవడానికి మనసు అంగీకరించలేదు. బుస్సున కోపం పొంగింది.

"మీ మీద మీకు నమ్మకం మరీ ఎక్కువనుకుంటా!"

ఈసారి అబ్బాయి కళ్ళెత్తి ఆమెను చూశాడు. తనవంక తిరస్కారంగా చూస్తున్న ఆమె ముఖకవళికలు పోల్చుకోలేకపోయాడు. అతనికి ఈ ఆట ఆపేయాలనిపించింది. ఆమె భుజాలచుట్టూ చెయ్యేసి తను ఆమెను ఎప్పుడూ పిలిచే పేరుతో పిలిచాడు. దాంతో ఆట ముగిసిందని ఆమె అర్థం చేసుకుంటుందనుకున్నాడు.

అమ్మాయి "మీరు మరీ ఫాస్ట్‌గా ఉన్నారు" అని అతని కౌగిలినుండీ విడిపించుకుంది. తన అభ్యర్థనని ఇలా విసిరికొట్టడంతో అబ్బాయి "క్షమించండి" అనేసి మౌనంగా రోడ్డువంక చూస్తూ డ్రైవ్ చేయసాగాడు.

★ ★ ★

అతన్ని నొప్పించానని తెలియగానే ఆమె

కోపం మాని పశ్చాత్తాప పడింది. ఇది కేవలం ఆట అని తెలుసు. అతన్ని నెట్టివేయడానికి కారణం అసూయ కాదు, ఆట కొనసాగించాలన్న కోరికే అని తనను తానే మభ్యపెట్టుకుంది. "హర్ట్ అయ్యారా మిస్టర్? " అనేసింది తేలిగ్గా.

"ఎక్స్‌క్యూజ్ మీ మిస్! మళ్ళీ మీ మీద చెయ్యి వెయ్యను!" అన్నాడు సీరియస్‌గా.

అతనికి రగిలిపోతోంది ఆమె తనమాట వినడంలేదని, ఆమె ఆమెలా ఉండట్లేదని. ఆ కోపాన్ని తన గర్ల్‌ఫ్రెండ్ మీద ప్రదర్శించలేడు గానీ ఎదురుగా ఉన్న ఈ అపరిచితురాలి మీద చూపించగలడు! అతనికి ఈ ఆటలో తన పాత్ర ఏమిటో ఇప్పుడు బాగా అవగతమైంది. ఆమెను పొగడాల్సిన అవసరం లేదు. ధీమాగా, మొండిగా, విరసంగా, వ్యంగ్యంగా మాట్లాడటమేగా పురుషలక్షణం! అది ఆమెకు తెలిసేలా చేస్తాడు. ఈ పాత్ర తను ఆమెతో ఏకాంతంగా ఉన్నప్పుడు ప్రవర్తించేదానికి పూర్తి వ్యతిరేకం. నిజమే, ఆమె పరిచయమవకముందు ఆడవాళ్ళతో కఠినంగా ఉండేవాడు. కాని ఎప్పుడూ నిర్దయగా, పాషాణహృదయుడిలా మాత్రం ప్రవర్తించలేదు. అమానుషంగా ఉండాలనేది అతనిలో నిద్రాణమైన కోరిక. అవకాశం దొరికినప్పుడు అణగదొక్కిన కోరికలు పాముల్లా పడగెత్తుతాయి. ఇప్పుడీ అవకాశం దొరికింది, అతను నిర్దయుడి పాత్రలోకి దూరిపోయాడు.

అబ్బాయి ప్రవర్తన అమ్మాయికి కూడా సరిగ్గా సరిపోయింది. తను తనుగా ఉండక్కరలేని అవకాశం కల్పించింది. అతని మీద తనకున్న అనుమానాలన్నీ ఈ పాత్ర ద్వారా బయటపెట్టచ్చు అనుకుంది. అతను మౌనంగా డ్రైవ్ చేస్తుంటే ఆమె పూర్తిగా తన పాత్రలోకి ఒదిగిపోయింది. ఏమిటామె పాత్ర? బూతుసాహిత్యంలో ఎక్కువగా కనిపించే పాత్ర. ఆమె కారు ఎక్కింది నిజంగా ఎక్కడికో వెళ్ళటానికి కాదు, రాత్రికి డ్రైవర్‌తో గడపటానికి! ఈ విషయంలో ఆమె గొప్ప కళాకారురాలు. మగాళ్ళని ఆకట్టుకోవడంలో జాణ. తన సహజస్వభావానికి పూర్తి విరుద్ధమైన ఈ పాత్రలోకి తను తేలిగ్గా దూరిపోగలగటం ఆమెను ఆశ్చర్యపరచింది!

★ ★ ★

యువకుడికి సరదాగా ఉండటమంటే ఇష్టం. పనిగంటలుకాక మిగతా సమయాన్ని కూడా మీటింగులనీ, హోమ్‌స్టడీ అనీ ఉద్యోగమే తినేస్తుంది. వ్యక్తిగత జీవితానికి కొంచెం కూడా చోటివ్వదు. అతను ఏరోజు ఎవరితో ఎక్కడ ఉన్నాడో తోటి ఉద్యోగులు గాసిప్స్ చెప్పుకునేవారు. ఇప్పుడీ రెండువారాల సెలవు కూడా వాళ్ళకు తెలుసు. ఎండాకాలంలో హోటళ్ళన్నీ నిండిపోతాయని ఆరునెలల ముందే టాట్రాలో రూమ్ బుక్ చేశాడు. ఎడ్వాన్స్ రిజర్వేషన్ కావాలంటే ఆఫీస్ రికమండేషన్ ఉండాలి కాబట్టి ఆఫీస్‌లో అందరికీ ఈ విషయం తెలిసిపోయింది. తన జీవితం తెరిచిన పుస్తకమైపోవడాన్ని బానే తట్టుకున్నాడు. తను మలుపులులేని రోడ్డు మీద ప్రయాణిస్తున్నట్టు, అందరూ తనని వెనుకనుంచీ చూస్తున్నట్టు భావించేవాడు. ఈ భావన నుంచీ తప్పించుకోవాలని అతనిప్పుడో పిచ్చిపని చేశాడు.

"ఎక్కడ దిగాలన్నారు? " అడిగాడు అమ్మాయిని.

"బాన్స్కా బిస్ట్రిట్సా" జవాబిచ్చింది.

"అక్కడేం చేస్తున్నారు"?

"పనుంది"

"అదే ఏంటి? "

"ఒకర్ని కలవాలి"

అప్పుడే కారు నాలుగు రోడ్ల కూడలి దగ్గరికి వచ్చింది. స్లోచేసి ఊరిపేర్లు రాసున్న బోర్డులు చదువుతూ "ఆ ఒకర్ని కలవకపోతే ఏమవుతుంది? " అని అడిగాడు.

"అది మీ తప్పే కాబట్టి మీరే నా బాధ్యత వహించాలి!"

"నేను బిస్ట్రిట్సా వైపు కాకుండా నోవ్‌జామ్కీ వైపు కారు తిప్పడం మీరు గమనించలేదా? "

"నిజమా! మీకేమన్నా పిచ్చా? " ఆమె నిజంగానే కంగారుపడింది.

"ఏం ఫరవాలేదు. మిమ్మల్ని జాగ్రత్తగా చూసుకుంటాలే..."

ఒక్కసారిగా ఆటస్థాయి పెరిగిపోయింది! నిజజీవితం మీదకి కల్పన క్రూరమైన దాడిచేసింది. ఆ యువకుడు ఇంతవరకూ తెరిచి ఉంచిన పుస్తకంలాంటి తన జీవితంలోంచి పక్కకు మళ్ళాడు!

"మీరు లోటాట్రా వైపు వెళ్ళాలన్నారుగా? "

"చూడండి మిస్! ఇది నా కారు! నా ఇష్టమొచ్చిన చోటికి వెళ్తాను, నా కిష్టమొచ్చినట్టు చేస్తాను!"

★ ★ ★

వాళ్ళు నోవ్‌జామ్కీ చేరేసరికి చీకటి పడుతోంది. అతనెప్పుడూ ఈ ఊరికి రాలేదు. ఈ రాత్రికి అక్కడే బస చేద్దామని నిశ్చయించుకున్నాడు. అమ్మాయిని కార్లోనే ఉండమని హోటల్లో గదులున్నాయేమో కనుక్కోవటానికి వెళ్ళాడు.

కారు దిగగానే అతను మామూలైపోయాడు. తన గమ్యానికి దూరంగా ఇలా ఊరుగాని ఊరికి రావటం ఆందోళన కలిగించింది. మరోపక్క సెలవుల్లో మొదటి రోజు ఇలా అనూహ్యంగా గడవటం నచ్చింది. టాట్రాలో రూమ్‌కి రేపు పొద్దున వెళతారు, ఇంతలో మునిగిపోయేదేముంది?

రెస్టారెంట్ కిక్కిరిసిపోయుంది. సిగరెట్టుపొగ దట్టంగా కమ్ముకుంది. అతికష్టమ్మీద రిసెప్షనిస్టు దగ్గరికెళ్ళి ఒక ఖాళీగది తాళాలు సంపాదించగలిగాడు.

అమ్మాయి కూడా కారులో ఒంటరిగా ఉంది కాబట్టి తను తనులా ఆలోచించింది. ఈ పరిస్థితి ఆమెకి కొత్తగా, ఇబ్బందిగా ఏమీలేదు. తన బాయ్‌ఫ్రెండ్ అన్నీ ఆలోచించే చేస్తాడని ఆమెకి చాలా నమ్మకం. కానీ మళ్ళీ అసూయ

## 'సరసిజం

విదేశాలకైతే అది తీసుకోండి. మన స్టేట్‌లో రోడ్లూ ప్లాట్‌ఫారాలకైతే ఇది బెటరండీ ఇనపచక్రాలవి!



మేల్కొంది. ఇలా కార్లో కూర్చొని అతని కోసం ఇంతకుముందు ఎంతమంది ఆడ వాళ్ళు ఎదురుచూశారో! అయితే చిత్రంగా ఈ ఆలోచన ఇదివరకులా ఆమె గుండె పిండేయలేదు. పైగా ఈరోజు తను 'అటు వంటి' స్త్రీ - నిజజీవితంలో ఎప్పుడూ కాలేని స్త్రీ- అని ఆమెకు చాలా సరదాగా కూడా ఉంది. తను వాళ్ళందర్నీ మించిపో తుంది! ఇన్నాళ్ళూ తన బాయ్‌ఫ్రెండ్‌కు ఏదైతే ఇవ్వలేననుకుందో 'ఆ' ఆనందం కూడా తనే ఇస్తుంది! అతను తన సొం తం! ఏదో ఆత్మతృప్తి కలిగింది ఆమెకు!

అతనొచ్చి కారు తలుపుతీసి ఆమెను దిగమన్నాడు. జనం నిండిన టేబుళ్ళ మధ్యనుంచీ నడుచుకుంటూ మొత్తానికి వెనకమూలగా ఉన్న ఒక ఖాళీటేబుల్ దగ్గర ఇద్దరూ కూర్చున్నారు.

అనువాదం : **వి హెచ్ కే**

★ ★ ★

"సో.. మిస్టర్! ఇప్పుడు నన్ను జాగ్ర త్తగా ఎలా చూసుకుంటారు? " కవ్వింపుగా అడిగింది.

సమాధానంగా అతను "భోజనం చేసే ముందు ఏమైనా తాగుతారా? "అని అడి గాడు.

ఆమె వెర్మూత్ తప్ప ఏమీ తాగదు. కానీ ఇప్పుడు తనపాత్రకు తగ్గట్టు వోడ్కా చెప్పింది.

"ఫర్లేదు! అయితే తప్పతాగి నామీద పడిపోకండి"

"పడిపోతే? "

అతను జవాబివ్వకుండా వెయిటర్ని పిలిచి వోడ్కా, భోజనం ఆర్డర్ చేశాడు. రెండు వోడ్కా గ్లాసులూ రాగానే తన గ్లాస్ ఎత్తి

"నీకు" అన్నాడు.

అతని ఏకవచన సంబోధన గమనించి అమ్మాయి "ఇంకేదైనా తెలివిగా చెప్పండి" అంది.

అతనికి ఈ ఆటతో ఏదో చిరాకొస్తోంది. కార్లో గమనించలేదు గానీ, ఇప్పుడిలా ఎదు రెదురుగా కూర్చుంటే తెలుస్తోంది - తన గర్ల్‌ఫ్రెండ్‌ని అపరిచితురాలిగా మారు స్తోంది ఆమె మాటలే కాదు, ఒంటివిరు పులూ, చేతలు కూడా. తనకి బాగా తెలి సిన నెరజాణల చేతలు! తను ఎంతో అస హ్యించుకునే చేతలు!

అందుకని గ్లాసు ఎత్తి పట్టుకొని "సరే, నీకోసం కాదు! మనిషిలోని వికృతత్వాన్ని, జంతువుల్లోని సాత్వికత్వాన్ని పుణికి పుచ్చు కున్న నీలాంటి వాళ్ళందరి కోసం" అన్నాడు.

"నాలాంటివాళ్ళు... అంటే ఆడవాళ్ళంద రూనా? "

"నీలాగా ప్రవర్తించేవాళ్ళని!"

"ఏమో, స్త్రీని జంతువుతో పోల్చడం నాకు నచ్చలేదు"

"ఓకే! పోనీ నీ మనసుకి! సరేనా? " అంటూ గ్లాసెత్తి "నీ మనసుకోసం- తల లోంచి మొలలోకి దిగినప్పుడు వెలిగి, మళ్ళీ తలకి చేరగానే ఆరిపోయే నీ మన స్సాక్షికోసం!" అని టోస్ట్ చేశాడు.

"ఓకే! తల్లోంచి మొల్లోకి దిగిన నా మన సుకి" అని ఆమె గటగటా తాగేసింది.

"కాదు, మళ్ళీ చెప్తా! నీ మనసుజారిన నీ మొలలోకి!"

ఎబ్బెట్టుగా ఉన్నా ఒప్పుకుంది "సరే, నా మొలకి"

ఇప్పుడా మాట ప్రత్యేకంగా అన్నారు కాబట్టి ఆమె కటిప్రదేశమంతా జవాబిచ్చి నట్టు పొంగింది. ఆమెకు తన శరీరం అణువణువులోని స్పందనా స్పష్టంగా తెలి సింది. భోజనం వచ్చింది. అతను ఇంకో రెండు వోడ్కాలు చెప్పాడు. ఈసారి

అమ్మాయి గుండెలకిచ్చాడు టోస్ట్. ఆమె తన బ్లౌజ్ ముందుకు లాగి లోపలకి చూసుకుంది. ఇలానే వింతగా, వారిద్దరి మధ్యా మునుపెన్నడూ జరగని విధంగా పచ్చిమాటలతో భోజనం సాగుతోంది. ఆమె ఇంత పూర్తిగా 'అటువంటి' స్త్రీగా ఎలా మారిపోగలిగిందన్న ఆలోచనే అతన్ని నిలకడగా ఉండనివ్వటంలేదు. ఆమె ఇంత బాగా నటిస్తోందంటే - నిజంగా అలాంటిదేనా? మరెవరిదో ఆత్మ ఖచ్చితంగా ఆమెలో ప్రవేశించలేదే? తను పరిచయమయ్యాక ఇలాంటివన్నీ కట్టిపెట్టిందేమో! ఇప్పుడీ ఆట ద్వారా తన పూర్వ జీవితాన్ని రుచి చూపిస్తోంది!? ఇది తన గర్ల్‌ఫ్రెండే! అపరిచితురాలు కాదు. ఆమె సిగ్గూ, మొహమాటం అంతా నటన కాబోలు! ఇదే నిజం! అతనికి ఆమె అంటే అసహ్యం కలిగింది.

మానసికంగా దూరమవుతున్న కొద్దీ అతను ఆమె శరీరాన్ని, మనసునూ విడిగా చూడటం మొదలుపెట్టాడు. ఈ ఆట ఏమిటో కానీ ఆమెశరీరాన్ని విపరీతమైన ఆకర్షణీయంగా మార్చేసింది! ఒంట్లోంచి ఆవిర్లు రప్పిస్తోంది. స్వచ్ఛత, ప్రేమల ముసుగు తొలగించి వలపుబాణాలు విసురుతున్న ఆమెను మొట్టమొదటిసారి చూస్తున్నట్టు చూశాడు.

మూడోవోడ్కా తర్వాత అమ్మాయి "ఎక్స్‌క్యూజ్ మీ" అని లేచింది.

"మీరు ఎక్కడికి వెళ్తున్నారో తెలుసుకోవచ్చా మిస్" అన్నాడు చాలా మర్యాదగా.

"మీరు అనుమతిస్తే....." అని ఎక్కడికి వెళుతోందో అతనికి కుండబద్దలు కొట్టినట్టు చెప్పి టేబుళ్ళ మధ్య నుంచి 'లేడీస్' అని రాసున్న తలుపు వైపు నడిచింది.

★ ★ ★

ఇంత ధైర్యంగా తనామాట చెప్పగలగడం ఆమెకు చాలా సరదాగా అనిపించింది. అతను నిరుత్తరుడైపోయాడు. ఆమె నోటినుంచి ఎప్పుడూ అలాంటి

## దెబ్బకు దెబ్బ!



**జేమ్స్:** ఏమిటి! నువ్వు నాకు లిఫ్ట్ ఇస్తావా? వాటే వండర్. మరి నీ లవర్ ధనుష్ వూరుకుంటాడా?

**షకీలా:** నిన్న ఎవతినో బైక్‌మీద కూర్చోబెట్టుకుని వచ్చి నాకెంత ఫోజిచ్చాడనుకున్నావ్! అందుకే నువ్వీరోజు నా వెనక గట్టిగా అదిమి పట్టుక్కూర్చో, అది చూసి వాడు ఉడుక్కు చావాలి ఆc..

మాట వినలేదు! అయినా ఆ మాటలో తప్పేముంది? తన పాత్రకి పూర్తిన్యాయం చేసింది. ఈ ఆట చాలా బాగుంది. ఇంత ఉల్లాసంగా, ఏమీ పట్టనట్టుండటం లైఫ్‌లో ఫస్ట్‌టైమ్! 'ఏం చేస్తే ఎవరేమనుకుంటారో' అని ప్రతిక్షణం వ్యథ చెందే ఆమెను 'ఏం జరిగితే ఏమిలే' అనే భావం ఎంతగానో ఆకట్టుకుంది. ఒక వెలయాలిగా - తన పాత్ర ఏమైనా మాట్లాడవచ్చు, ఏమైనా చెయ్యొచ్చు! తనకిష్టమైనట్టుండచ్చు! సామాజిక కట్టుబాట్లేవీ అడ్డుగా లేవు.

అక్కడున్నవారంతా తననే చూస్తున్నారన్న విషయం ఆమె గమనించింది. ఇది వరకెన్నడూ తనశరీరం అటువంటి ఆనందాన్నివ్వలేదు. తన సున్నితభాగాలమీద ఎవరి దృష్టీ పడనిచ్చేది కాదు. రోడ్డుమీద తనకెదురుగా నడిచే మగవాళ్ళ చూపులు ఎక్కడెక్కడ గుచ్చుకున్నా కుంచించుకుపోయేది. తనకు నాజూకైన ఒంపుసొంపులున్నాయని ఆమెకు తెలుసు; కానీ వాటిని ప్రదర్శించడం తప్పనిపించేది. స్త్రీ అందం కేవలం శృంగారానికే పనికొస్తుందని ఆమె అనుమానం. తన శరీరం తనను ప్రేమించేవాడికి మాత్రమే సొంతమవాలని ఆరాటం!

కానీ ఇప్పుడు తన పాత్రకు శరీరస్పృహ లేదు. ప్రేమ పేరుతో వేసిన బంధాలేవు.

ఈ శరీరాన్ని అందరూ చూడచ్చు! ఈ ఊహ రాగానే ఆమె ఆడతనం వెయ్యింత లైంది. అందరి కళ్ళూ తనని తినేసేలా చూస్తుంటే ఆమె అమితగర్వంగా రొమ్ము విరుచుకొని నడుస్తోంది. ఒకడు ఫ్రెంచ్‌లో 'వస్తావా, ఎంత?' అనడిగాడు. ఆమెకు అర్థమైంది. గుండెల్ని ఇంకో రెండంగుళాలు పొంగించి వాడికి కన్నుగీటి ఊపుకుంటూ తెర చాటుకు వెళ్ళింది.



★ ★ ★

ఆట ఎంతో ఉత్సుకత రేకెత్తిస్తోంది!

అతను అపరిచిత డ్రైవర్‌లానే నటిస్తున్నా, ఆమెలో తన గర్ల్‌ఫ్రెండ్‌నే తప్ప హిచ్‌హైకర్‌ని చూడలేకపోతున్నాడు! సరిగ్గా ఈ విషయమే అతని బుర్రని తొలుస్తోంది. ఫ్రెంచిలో మాట్లాడినవాడికి ఆమె కన్నుగీటటం అతను తట్టుకోలేకపోతున్నాడు. తనను ఆమె ఎప్పుడైనా మోసం చేస్తే ఇలానే చేస్తుందేమో!

ఆమెను అతను ప్రేమించినదానికంటే ఎక్కువగా ఆరాధిస్తాడు. ఆమె అసలు స్వభావం పాతివ్రత్యం, స్వచ్ఛత. వీటిని దాటి ఆమె పోలేదనుకున్నాడు. స్వచ్ఛత లేకపోతే, ఆమె ఆమె కాదు, అంతే! ఆమె ఈ గీత దాటుతుండగా- అదీ అత్యంత సునాయాసంగా- ప్రత్యక్షంగా చూశాడు కాబట్టి అతను కోపంతో రగిలిపోతున్నాడు.

ఆమె లేడీస్‌రూమ్ నుంచి తిరిగొచ్చి అతనికి ఫిర్యాదు చేసింది ముద్దుముద్దుగా "అక్కడొకడు నన్ను వస్తావా అనడిగాడు"

"అందులో ఆశ్చర్యమేముంది? అచ్చంల... లానే ఉన్నావు..."

చిత్రంగా కళ్ళు తిప్పింది.

"...పిలవగానే వెళ్ళాల్సింది"

"నాతో నువ్వున్నావుగా"

"నాతో అయ్యాక మాట్లాడుకొని ఏదో ఏర్పాటు చేసుకో. ఒక రాత్రిలో చాలామంది.. నీకు తప్పుకాదుగా"

"చూడ్డానికి బాగుంటే ఎంతమందైతే ఏంటి"

"ఒకళ్ళ తర్వాత ఒకళ్ళని ఇష్టపడతావా? అందరూ ఒకేసారా?"

"ఎలా అయినా ఇష్టమే"

సంభాషణ అత్యంత అవమానకరంగా, నిర్లజ్జగా సాగిపోతోంది. అమ్మాయికి మొదట్లో ఉక్రోషమొచ్చినా ఆట కాబట్టి ఆపలేకపోయింది. ఆటగాళ్ళకి స్వేచ్ఛ ఉండదు. ఆటయొక్క నియమాలు పాటిం

చాల్సిందే. పాత్రలో ఒదిగిపోయినపుడు మనస్సాక్షిని పక్కకు తోసెయ్యాలి. దాని నోరు నొక్కెయ్యాలి. ప్రత్యర్థి ఆట ఎలా ఆడినా తను ఒప్పుకోవాలిప్పుడు!

బిల్లు కట్టేసి లేచాడు.

"మనం వెళ్తున్నాం"

"ఎక్కడికి" ఆశ్చర్యం నటించింది.

"ఎదురు మాట్లాడకుండా రా"

"నాతో మాట్లాడే పద్ధతదేనా? "

"ఇదే ల... తో మాట్లాడే పద్ధతి"

మెట్లెక్కి పైకి వెళ్ళారు. రెండోఅంత స్తులో చిత్తుగా తాగిన మగవాళ్ళు నుంచొ నున్నారు. అతను అమ్మాయి వెనకనుంచి చెయ్యివేసి ఆమె కుడిఎదను నొక్కిపట్టుకు న్నాడు. అది చూసి వాళ్ళు ఈలలేశారు. ఆమె విడిపించుకోవటానికి విఫలయత్నం చేసింది. దాంతో వాళ్ళామెను బూతులు తిడుతూ పెద్దగా కేకలుపెట్టారు. భరించ లేకపోయింది.

ఆమెను గదిలోకి తోసి తలుపు మూసి లైట్ వేశాడు. పొగ రుగా నడుమ్మీద చేతులుంచి ఎర్రటిపెదవులను ముందుకు తోసి కోరికనిండిన కళ్ళతో తలెగరేసి అత నివంక చూసింది. ఆ ముఖంలో తనకు తెలిసిన సిగ్గరి అమ్మాయి పోలికలకోసం వెతికాడు. రెండు ముఖాలూ ఈమెవేనని; నిర్మలత్వం, వెలయాలిగుణం, అమాయ కత్వం, మోసం - విరుద్ధభావాలన్నీ ఈమె లోనే ఉన్నాయనీ అనిపించింది. తీవ్రనిరా శకు గురయ్యాడు. ఈమె పైకే ఇతర స్త్రీల



కన్నా తేడా. లోపల అందరూ ఒకటే. తను ప్రేమించే అమ్మాయి- తన ఊహా సుందరి- ఈమె కాదు!

"ఏంటి నుంచున్నావ్? బట్టలిప్పెయ్"

అమ్మాయి ఓరచూపు చూస్తూ "అది అవసరమా? " అని నాలుకతో పెదవులు తడుపుకుంది. ఆ చూపు, ఆ నవ్వు అతనికి ఇతర స్త్రీల ముఖాలలో గతంలో పరిచిత మే. తనొక ఆట ఆడుతున్నాడని అతను మర్చిపోయాడు. పట్టరాని ద్వేషంతో ఆమెను అవమానించడానికి సిద్ధమైపో యాడు. అపరిచితురాల్ని కాదు, తన గర్ల్ ఫ్రెండ్‌నే! ఆమెవంక సాలోచనగా చూసి పర్సులోంచి యాభైపౌండ్ల నోటు తీసి "ఇది సరిపోతుందా" అన్నాడు.

ఆమె తీసుకుంది. "నా విలువ ఇంతేనా? "

"ఇంతకన్నా ఎక్కువైతే కాదు"

ఆమె దగ్గరికొచ్చి అతన్ని వాటేసుకుంది. పెదాలమీద ముద్దు పెట్టడానికి ప్రయత్ని స్తుంటే అతను వాటిమీద వేళ్ళుంచి "నేను ప్రేమించే స్త్రీలను మాత్రమే ముద్దుపెట్టు కుంటాను" అని నెట్టేశాడు.

"అయితే నన్ను ప్రేమించట్లేదా? "

"లేదు"

"మరెవర్ని"

"నీకనవసరం. డబ్బు తీసుకున్నావ్, టైమ్ వేస్ట్‌చెయ్యకుండా బట్టలిప్పెయ్!

★ ★ ★

ఆమె అంతకుముందెప్పుడూ బట్టలు ఇలా విప్పలేదు. తన సిగ్గు, ప్రియుడి కళ్ళు తననే చూస్తున్నాయన్న స్పృహా విహ్వలప రిచేవి. ఇప్పుడవేమీ లేవు. ఆత్మవిశ్వా సంతో, లైటు వెల్తుర్లో అతని ఎదురుగా నిర్లక్ష్యంగా నుంచొని.. అసలు ఈ చేష్ట లన్నీ.. తనకు తెలియనివి... ఎక్కడి నుంచీ వచ్చాయో! నెమ్మదిగా ఒక్కొక్క బటన్ తీస్తూ, బట్టలు ఒక్కటొకటే విప్పి దూరంగా విసిరేస్తూ, అతని చూపులు వెర్రెక్కిస్తూ శరీరాన్ని తడుముతుంటే ఇంకాఇంకా కావాలనిపిస్తూ- స్ట్రిప్ టీజర్లు కూడా చెయ్యలేని విధంగా చేస్తుంటే ఆమెకే ఆశ్చర్యమేసింది. ఆమె అతని ముందు నగ్నంగా నుంచుంది! నిలువెల్లా సిగ్గు కమ్ముకుంది. హబ్బ లైట్ అయినా తియ్యడేంటి- దాక్కోవటానికి వీలుగా? ఇంతటితో ఆట ముగిసిందని చెప్తాడేమో! బట్టలు విప్పేసినట్టే తను ధరించిన పాత్రను కూడా విప్పేసిందని అతను తెలు సుకుంటే బాగుండు! ఇక తన దగ్గరకొచ్చి చిన్నసైగ చేసి ఆట పూర్తయిందని చెప్పిన తరువాత ఏముంది! అత్యంత రసవత్తరం గా, వారికి బాగా ఇష్టమైన భంగిమల్లో...!

ఆమె నగ్నంగా నుంచున్న క్షణం నుంచి ఆట ఆడటం ఆపేసింది.

తన స్వభావసిద్ధమైన సిగ్గూ, ఇబ్బందిగా నవ్వే నవ్వూ ఆమె ముఖంలోకి పిలవకుం డానే వచ్చేశాయి. కానీ అతను రాలేదు. తన ముగ్ధప్రేయసి ముఖంలో చిరపరిచిత మైన ఆ నవ్వునసలు పట్టించుకోలేదు. అందమైన అపరిచితురాలి శరీరాన్ని మాత్రమే చూస్తున్నాడు. ద్వేషం అతని లోని సున్నితభావాలని తుడిచిపారేసింది. అతనివైపు ఆమె రెండడుగులు వేసింది.

"అక్కడే నుంచో! నిన్ను పూర్తిగా చూడనీ!"

అతనికంటికి ఆమె ఇప్పుడొక వేశ్య మాత్రమే! అంతకుముందెప్పుడూ అతను వేశ్యలతో గడిపిందిలేదు. తను చదివిన సాహిత్యంలోంచి, ఇతరులు చెప్పినదాన్లోం చి తెలుసుకున్నదే! అమ్మాయిని పియానో మెట్లమీద పడుకోబెట్టి చేసే రతి చాలా ఉత్తేజకరంగా ఉంటుందన్నది గుర్తొచ్చింది. ఈ గదిలో పియానో లేదు. ఆ ఎత్తులో ఉన్న బల్లమీద నుంచోమని శాసించాడు. అమ్మాయి వద్దని బతిమిలాడింది.

"డబ్బులు తీసుకున్నావ్! చెప్పినట్టు చెయ్!"

***గమనిక : విపులకు కథలు, అనువాద కథలు, ఇతర రచనలు, కార్టూన్లు, నేనెవరిని, వినోదిని కూపన్లు పంపేవారు పారితోషికం, బహుమతులు పొందడంలో అసౌకర్యం కలగకుండా ఉండేందుకు విధిగా వారు తమ పూర్తి చిరునామా, పిన్‌కోడ్, వయసు, ఫోన్ నంబరు స్పష్టంగా రాయాలి. తిరస్కృత రచనలు కావాలనుకునేవారు సొంత చిరునామాతో తగినన్ని స్టాంపులు అంటించిన కవరు జతచేయాల్సిందిగా మనవి. చందాదారులు కూడా తాము పంపే డి.డి. వెనుక భాగంలో విధిగా చిరునామా, ఫోన్ నెంబరు ఇవ్వాలి.***

ఈ దశలో ఆట ఎలా ఆడాలో ఆమెకు తెలీదు! ఆమె ఏదైనా కావచ్చుగానీ వేశ్య కాదుగా? అసహాయస్థితిలో కళ్ళలోకి నీళ్ళు వస్తుంటే బల్లమీదకెక్కింది. తన కన్నా పొడుగ్గా ఉన్న ఆమె నగ్నశరీరాన్ని అతను తలెత్తి చూస్తూ తనలోని పశువాంఛని మేల్కొల్పాడు. ఇతర మగవాళ్ళు ఆమెను ఎన్నివైపులనుంచి ఎన్నిరకాలుగా ఎలా చూసి ఉంటారో - అలా చూడాలనుకున్నాడు. ఆమెను అవమానించడమే లక్ష్యంగా ఎంతో మొరటుగా, కరకుగా ప్రవర్తించాడు. చుట్టూ తిరుగుతూ ఆమె అతని నోటినుంచి ఎప్పుడూ వినని ఛండాలమైన మాటలు మాట్లాడాడు. ఆమెకు ఇదంతా సహించరానిదిగా ఉంది. తను అతన్ని ప్రేమగా పిలిచే పేరుతో పిలిచింది.

"నోర్మూయ్! బజారుమనుషులకి అలా పిలిచేహక్కు లేదు"

ఆమెకు కళ్ళలోంచి నీళ్లు ఉబికివచ్చాయి. అసలేమీ అర్థం కావటంలేదు. అతను చెప్పిందల్లా చెయ్యాల్సొస్తోంది. ముందుకు వంగింది, మోకాళ్ళ మీద కూర్చుంది, సెల్యూట్ పెట్టింది, ఒక కాలెత్తింది, శరీరం మొత్తం ఊపుతూ 'ట్విస్ట్' డ్యాన్స్ చేసింది. ఆ ఊపులో కాలుజారి కిందపడబోతే ఆమెను పొదివిపట్టుకొని మంచం దగ్గరికి ఈడ్చుకెళ్ళాడు. ప్రేమలేని కామం మాత్రమే ప్రదర్శించాడు. చివరిక్షణంలో ఆమె ఆత్రంగా అతని పెదవులందుకోబోయింది. ఆయాసంతో రొప్పుతూనే "నేను ప్రేమించే స్త్రీలను మాత్రమే ముద్దుపెట్టుకుంటాను" అన్నాడు. ఆమె దుఃఖం పట్టలేక పెద్దగా ఏడ్చేసింది. కానీ అతని ఆటింకా పూర్తికాలేదు, ఆమెకు ఏడ్చే స్వాతంత్ర్యం లేదు!

కాసేపటికి ఆమె ఏడుపు ఉధృతి తగ్గి అతనికి అనుకూలంగా స్పందించసాగింది. తను ఇన్నాళ్ళూ ఏదైతే జరగకూడదని బలంగా కోరుకుందో చివరికదే జరిగింది! ఒక్కసారి గీత దాటితే ఏమవుతుందో ఆమెకు అనుభవమైంది.

★ ★ ★

కాసేపట్లోనే అతని పశువాంఛ చల్లారిపోయింది. ఆమెమీదనుంచి లేచి లైట్ కట్టేశాడు. ఆమెముఖం చూడ్డానికి ధైర్యం చాలలేదు. ఆట అయిపోయిందని తెలుసు. అయినా వెంటనే పాత బంధంలోకి వెళ్ళాలంటే భయమేసింది. దూరంగా జరిగి పడుకున్నాడు. ఒకక్షణం తర్వాత ఆమె వెక్కిళ్ళు వినిపించాయి.

ఆమె అతనిచేతిమీద చెయ్యివేసి సందేహంగా వెనక్కి తీసుకుంది. మళ్ళీ వేసింది. అతన్ని బతిమిలాడుతున్నట్టు "నేను నేనే.. నేను నేనే.." అని చెప్తోంది వెక్కిళ్ళ మధ్య.

అతను కదల్లేదు మెదల్లేదు. ఆమె చెప్పే దాంట్లో నిజమెంతో తేల్చుకోలేకపోతున్నాడు. ఏడుపు పెద్దదైపోయింది.

"నేను నేనే..., నేను నేనే..."

తనలోంచి దూరంగా ఎగిరిపోయిన కరుణ, జాలిలాంటి లక్షణాలన్నిటినీ అతను తిరిగి రమ్మని వేడుకుంటున్నాడు. అమ్మాయిని ఓదార్చాలి మరి. వారికింకా పదమూడురోజుల సెలవుంది!

V

ఇటలీ కథ

- ఆల్బెర్టో మొరావియా

# ట్రక్ డ్రైవర్

సాధారణంగా ట్రక్ డ్రైవర్లు మంచి ఒడ్డూపొడుగు కలిగి లావుగా బలంగా వుంటారు. కానీ నేను మాత్రం పొడవుగా బక్కపలుచగా అందవిహీనంగా వుంటాను. సన్నని కాళ్లు, పొట్ట నడుముకి ఎంతగా అతుక్కుపోయినట్టు వుంటుందంటే ప్యాంటు కిందకి జారిపోతూ వుంటుంది.

నావికుడిలా ట్రక్కు డ్రైవరు కూడా స్త్రీల గురించి ఎక్కువగా ఆలోచించకూడదని అంటుంటారు. అలాంటి ఆలోచనలవల్ల ప్రయాణం మధ్యలో మనసు అదుపుతప్పి ప్రమాదం కలగొచ్చు. కానీ నేను మాత్రం ఎప్పుడూ స్త్రీల గురించే ఆలోచిస్తుంటాను. అది నా బలహీనత.

ట్రక్కు డ్రైవర్‌గా పనిచేయడం కష్టమనిపించినప్పటికీ నేను ఓ ట్రక్కు డ్రైవరు కావాలనుకున్నాను. అదృష్టవశాత్తు ఓ ట్రాన్స్‌పోర్టు కంపెనీలో నాకు పని దొరికింది.

నాకు సహాయకుడిగా ముప్పై సంవత్సరాల వయసున్న యువకుడు పలోంబి కూడా వున్నాడు. అతనిలో యవ్వనపు ఛాయలేవీ లేవు. మోటుగా వుండే మొహం, గుండ్రటి లావుపాటి బుగ్గలు, చిన్ని కళ్లు ఇంకా గూడులాంటి చిన్న మూతి. వట్టి మూర్ఖుడు. ట్రక్కులాగే అతనిలోకూడా బుద్ధి అన్నది ఏకోశానా లేదు. తిండి గురించి విన్నప్పుడు అతని కళ్లలో మెరుపు కదలాడుతుంది. భోజన ప్రియుడు.

ఆ రోజుల్లో ఇటలీలోని రెండు నగరాలు, రోమ్ మరియు నెప్లస్ వరకు సరుకు రవాణా పని దొరికింది. ఒకరోజు ట్రక్కులో ప్రయాణిస్తుండగా దారిలో ట్రెసినా అనే ప్రాంతంలో ఒక యువతి ట్రక్కు ఆపమంటూ చేతులు ఊపింది. ట్రక్కు ఆగిన తర్వాత దగ్గిరకంటూ వచ్చి రోమ్ వరకు లిఫ్ట్ అడిగింది. ఈ ట్రక్కులో ఎవరికైనా లిఫ్ట్ ఇవ్వడమనేది స్ట్రిక్ట్‌గా నిషిద్ధం. కానీ ఆమెను చూసింతర్వాత లిఫ్ట్ ఇవ్వాలని మేము నిర్ణయించుకున్నాం. ఆమెకి పొడవాటి మెడ, చిన్నతల, గోధుమవర్ణం జుట్టు, నీలి కళ్లు వున్నాయి. పొడవైన శరీర పరిమాణానికి చిన్నవనిపించే కాళ్లున్నాయి. కొద్దిగా వంగి వున్నాయి. నడుస్తున్నప్పుడు మోకాళ్లు మడిచి నడుస్తున్నట్టుగా వుంటుంది. అందగత్తెకాదు. అయినా ఎందుకో తెలియడంలేదుగాని ఆమెలో నాకు అర్థంకాని ఆకర్షణ దాగి ఉన్నట్టనిపించేది. నేనామెను మొట్టమొదట చూసినప్పుడే నాకావిషయం తెలిసిపోయింది.

సిస్టర్‌నా ప్రదేశం దాటిన తర్వాత పలోంబి ట్రక్కు నడుపుతున్న సమయంలో ఆమె నా చేతిని తన చేతితో గట్టిగా నొక్కింది. వెలెట్రీ ప్రాంతంలో నేను పలోంబి నుంచి స్టీరింగ్ తీసుకునేంతవరకూ ఆమె నా చేతిని వదల్లేదు. ఎండాకాలపు రోజులు. మా ఇద్దరి చేతులు చెమటతో తడిసిపోయాయి. మధ్యమధ్యలో నీలిరంగు కళ్లతో నావైపు చూస్తూ చిరునవ్వులు నవ్వేది. నా జీవితంలో అకస్మాత్తుగా ఉత్తేజం వచ్చినట్లనిపించింది.

ఇప్పటివరకు నా జీవితం గట్టి పల్చని కంకరరోడ్డులా తప్ప మరోలా ఉండేది కాదు.

సిస్టర్‌నా, వెలెట్రీ మధ్యలో ఒకచోట టైర్లు చెక్ చేసేందుకు పలోంబి కిందకి దిగాడు. వచ్చిన ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని నేను ఆ యువతిని ముద్దుపెట్టుకున్నాను. ఆమె చేతి వెచ్చదనం ఆ ముద్దూ ఆ రోజుకి చాలనిపించాయి. రోమ్ రాగానే ట్రక్కు దిగుతూ ఆ యువతి ఎంతో ప్రేమగా "మీ ఇద్దరికీ నా ధన్యవాదాలు. మీరు నిజంగా దయగలవారు. నా పేరు ఇటాలియా" అంది.

ఆ తర్వాత ఇటాలియా వారంలో ఒకసారి విధిగాను అప్పుడప్పుడు ఓ రెండుసార్లు రోమ్ నుంచి ట్రెసినాకి రానుపోను లిఫ్ట్ అడిగి మరీ ప్రయాణించేది. ఉదయం చేతిలో పార్శిల్ గాని సూట్‌కేస్ గాని పట్టు



## నో వేకెన్సీ



రవి: రాధా! నీ మనసులో నాక్కొంచం చోటివ్వవా?
రాధ: కుదరదు రవీ! ఇప్పటికే చాలా మందితో ఫుల్లయింది. నా రూమ్మేట్ నిషది ఖాళీగా ఉండొచ్చు ట్రై చెయ్..

కుని గోడవారగా మా గురించి వేచి వుండేది. పలోంబి ట్రక్కు నడిపే సమయంలో దారిపొడవునా ఇటాలియా నా చేయి పట్టుకునే వుండేది. పలోంబి చూపుల్ని తప్పించుకుంటూ అతనికిష్టం లేకపోయినా అప్పుడప్పుడు ఆమెని ముద్దుపెట్టుకునేవాణ్ణి.

నిజం చెప్పాలంటే నేనామెను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. ఎన్నోఏళ్ల తర్వాత నేను ఒక యువతిని ప్రేమిస్తున్నాను. పలోంబి నిద్రిస్తున్నపుడు అదే అవకాశంగా ట్రక్కునడుపుతున్న నేను ఆమెతో నెమ్మ

**అనువాదం : పాలకోడేటి కృష్ణమూర్తి**

దిగా మాట్లాడేవాణ్ణి. కానీ ఏం మాట్లాడానో నాకిప్పుడు గుర్తులేదు. కాలం మరింతగా ముందుకు కదిలిపోతూనే వుంది. నాకు అంతవరకే గుర్తుంది. నిశ్శబ్దంగా వుండే ట్రెసినా మార్గంలో ఏవిధమైన అడ్డంకి లేకుండా ట్రక్కు సాగిపోతూనే వుంటుంది ఏదో అద్భుతం జరిగితే తప్ప. ఆమెతోమరింతసేపు గడపడం కోసం నేను ట్రక్కు వేగాన్ని తగ్గిస్తాను. అయినప్పటికి ప్రయాణంలో ఆఖరి మజిలీ రానే వస్తుంది, ఇటాలియా వెళ్లిపోతుంది.

రాత్రిపూట ప్రయాణించేటప్పుడు ఆమె సమక్షం ఎంతో ఆనందం కలిగించేది. ఒక చెయ్యి స్టీరింగ్‌మీదుంటే రెండోది ఇటాలియా నడుము దగ్గిరుండేది. ఎదురుగా వచ్చే వాహనాల హెడ్‌లైట్లు ఆరివెలుగుతున్నప్పుడు నేను ఇటాలియాని ప్రేమిస్తున్నానని నిరూపించటానికా అన్నట్టు నా ట్రక్కు హెడ్‌లైట్స్‌ని వెలిగించి వుంచేవాడిని.

మా ప్రేమ విషయం ఏమీ తెలియనట్టు, చూసీ చూడనట్లుండాలని అనుకునేవాడు పలోంబి.

ఒకరోజు ప్రేమావేశంలో నేను ట్రక్కు విండ్‌స్క్రీన్ గాజుమీద 'వాయివా-లా-ఇటాలియా' (ఇటాలియాకి దీర్ఘాయువు) అని తెల్లని పెయింట్‌తో రాశాను.

పలోంబి ముఖాన చిరునవ్వు కదలాడింది. 'వహ్వా! ఎంత సమ్మోహనంగా ఉన్న దేవకన్య దొరికింది నీక్కూడా' అన్నట్టుగా ఉందా చిరునవ్వు.

ఎన్నో నెలల వరకు ఇలాగే నడిచింది. ఎప్పటిలాగే ఒకరోజు ఇటాలియాని ట్రెసినాలో దింపి నెప్లస్ చేరుకోగానే సామాను అన్‌లోడ్ చేసిన తర్వాత వెంటనే రోమ్‌కి తిరిగి వచ్చేయాలని ఆదేశాలు అందాయి. నాకు చాలా కోపం వచ్చింది. ఎందుకంటే మర్నాడు ఉదయం మేము తప్పక కలుస్తామని ఇటాలియాకి మాటిచ్చాం. ఏం చేయగలం, నిస్సహాయులం. యజమానుల ఆజ్ఞల్ని కాదనలేం. నెప్లస్‌లో సామానంతటిని అన్‌లోడ్ చేసి నేను రెండోసారి స్టీరింగ్ అందుకున్నాను. బాగా అలసిపోయి వున్నందువల్ల పలోంబి ట్రక్కులో కూర్చునే నిద్రలోకి జారాడు.

కొంతదూరం వరకు ప్రయాణం సవ్యంగానే సాగింది. ఆ తర్వాత నాక్కూడా కళ్లు మూతలు పడసాగాయి. నిద్ర రాకుండా వుండటానికి ఇటాలియా ఆలోచనల్లో పడిపోయాను. ఆమె గురించి ఆలోచిస్తున్న కొద్దీ ప్రీతికరంగా ప్రేమగా ఆమె మాట్లాడిన మాటలు నా మస్తిష్కంలో అడవిలోని చెట్ల కొమ్మల్లా దట్టంగా వ్యాపించాయి. చివరికి ఎంత దట్టంగా మారాయంటే ఒక్కసారిగా చీకటి కమ్మింది.

ట్రక్కు రోడ్డు పక్కన వున్న ఒక పెద్ద గుంటలోకి దొర్లిపోయింది. ఒక్క కుదుపుతో ఆగిపోయింది. నాకు మెలకువ వచ్చింది. ట్రక్కు వేగం తక్కువగా వుండడంతో మాలో ఏ ఒక్కరికీ కూడా దెబ్బలు తగలలేదు. చీకటి దట్టంగా ఉంది. నిశ్శబ్దం ఆవరించి ఉంది. ఆకాశంలో నక్షత్రాలు మిణుకు మిణుకు మంటున్నాయి. టైమ్ బాగుంది. మేము ట్రెసినా నుంచి ఎక్కువ దూరంలో లేము.

పలోంబి ట్రక్కు కుదుపుకి ఒక్కసారిగా లేస్తూ "మళ్లీ ఏమైంది? " అంటూ చుట్టూ చూసిన తర్వాత "మనకి సహాయపడ్డానికి ట్రెసినా నుంచి ఎవరినైనా పిలిపించాలి. కానీ అక్కణ్ణించి రావాలంటే ఎవరికైనా సమయం పడుతుంది. నాకు బాగా ఆకలిగా వుంది. దగ్గర్లో ఏదైనా దాబా వుంటే ముందు భోంచేద్దాం" అన్నాడు.

మేమిద్దరం దాబా ఏవన్నా కనబడ్తుందేమోనని నడుచుకుంటూ బయలుదేరాం. దూరం నుంచి దీపాల వెలుతురు కనబడుతోంది. మాలో ఆశ చిగురించింది. వేగంగా నడుచుకుంటూ అటువైపు వెళ్లాం. మేము ఊహించింది నిజమే అయ్యింది. అక్కడున్నది దాబాయే. తలుపులు మూస్తున్నట్టున్నారు. మేము దగ్గరకెళ్లేసరికి దాబా తలుపులు మూసేశారు. నేను తలుపు సందులోంచి తొంగిచూశాను. లోపలి దృశ్యం చూసి ఉలిక్కిపడ్డాను! ఏప్రాన్ (బట్టలు మురికి కాకుండా ముందరి తట్టుపైన కట్టుకునే గుడ్డ) కట్టుకుని చీపురుతో ఊడుస్తోంది ఇటాలియా. గది చివరి కొసన కౌంటర్ వెనకాల అందవిహీనంగా వున్న ఒక గూనివాడు నిలబడి వున్నాడు. అతను ఇటాలియాని బాగా ఆశగా చూస్తున్నాడు. ఇటాలియాతో ఏదో అన్నాడు. చేస్తున్న పనిని వదిలిపెట్టి ఇటాలియా అతని వద్దకు వచ్చింది. తన రెండు చేతుల్నీ ఆ గూనివాడి మెడచుట్టూ వేసి ముద్దుపెట్టుకుంది.

## జనవరి - 2014
### విపుల వినోదిని విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **మండ వెంకట జోగేశ్వరశర్మ**
   - అరసవిల్లి, శ్రీకాకుళం
2. **వంగూరి పాండు**
   - కొప్పోల్, నల్గొండ జిల్లా
3. **యన్. శేషఫణి శర్మ**
   - శ్రీలక్ష్మీనగర్, కర్నూలు
4. **యం. తిరుపాలమ్మ**
   - గుంతకల్లు, అనంతపురం జిల్లా
5. **వనమా వెంకటేశ్వరరావు**
   - వేపలగడ్డ, కొత్తగూడెం

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. ఉడుతపిల్ల | 6. శాండీ |
| 2. గంగాయమ్మ | 7. స్కూల్లో |
| 3. బండి నడపడం | 8. శివదాసు |
| 4. అమెరికాకి.. | 9. 1907 |
| 5. సంధ్యని | 10. ఐదు గంటలకు |

ఆ తర్వాత ఆమె సంతోషంతో నాట్యం చేస్తున్నట్లుగా ఆ గదిలో తిరగసాగింది. అది చూసి నాకు వేస్తున్న ఆకలి చచ్చిపోయింది. గొంతు పొడారిపోయింది. నాలో చెలరేగిన పిచ్చికోపాన్ని బలవంతాన అణుచుకోవడానికి 'ఎవరుమటుకు ఇలా వూహించగలరు? ' అన్నాను కసిగా.

పలోంబి మొహంలో విచిత్రమైన భావాలు కదలాడాయి. అవి నాకర్థం కాలేదు. ఏమీ తిని, తాగకుండానే మెకానిక్‌ని తీసుకుని నిస్సత్తువతో ట్రక్కు దగ్గరికి చేరు



## పిట్టలెగిరి పోయాయి

**యస్.ఐ:** కానిస్టేబుల్! అమ్మాయిల్ని ట్రాప్ చేసి మోసం చేస్తున్న ఆ రోమియోగాడ్ని తీసుకురా!
**కానిస్టేబుల్:** వాడు లాకప్‌లో లేడు సార్..
**యస్.ఐ:** ఆс..ఏమయ్యాడు.. పారిపోయాడా? రాత్రి డ్యూటీ ఎవరిది? (కోపంతో గట్టిగా అరిచాడు)
**కానిస్టేబుల్:** కొత్తగా చేరిన లేడీ కానిస్టేబుల్ ది సార్! ఆమెకూడా కనిపించడం లేదు.

కున్నాం మేమిద్దరం. ఆ రాత్రంతా ట్రక్కు రిపేరుతోనే గడిచిపోయింది. ఉదయం కాగానే మేము రోమ్‌వైపు సాగిపోయాం.

"చూశావా, ఆ ఇటాలియా, కృతఘ్నురాలు నాతో ఎలా ప్రవర్తించిందో? " ఒక్కసారిగా నోరు విప్పాడు పలోంబి.

నేను విస్మయంగా "నువ్వు ఏం చెప్పాలనుకుంటున్నావు? " అని అడిగాను.

పలోంబి నెమ్మదిగా విచారవదనంతో చెప్పసాగాడు-

"ప్రయాణ సమయంలో పూర్తిగా నా చేయిపట్టుకునే ఉండేది. ఆమెని వివాహం చేసుకోవాలనుకుంటున్నానని కూడా ఆమెతో చెప్పాను. ఒక పక్క నిశ్చితార్థం కూడా చేసేసుకున్నాం... ఇప్పుడు చూశావుగా ఏం జరిగిందో, ఆ గూనివాడు..."

అతని మాటలు వినగానే నాకు ఒక్కసారి ఊపిరి ఆగినట్లయింది. మాట రాలేదు. పలోంబి తన మనస్సులోనిదంతా వెళ్లగక్కుతున్నాడు- "నేను ఆమెకి అందమైన కానుకలెన్నో ఇచ్చాను. నెక్లెస్, స్కార్ఫ్, శ్రేష్ఠమైన చెప్పులు, ఒకటేంటి ఇలా ఎన్నెన్నో.. నీకు నా మనస్సులో ఉన్న విషయాన్ని చెబుతున్నాను. నేనామెని నిజంగానే ప్రేమించాను. నాకు సరైన జోడీ ఆమెనే. కానీ ఆ కృతఘ్నురాలు..."

నేను కూడా ఇటాలియా గురించే ఆలోచిస్తున్నాను. రైలు టిక్కెట్ల డబ్బులు మిగుల్చుకోటానికి మా ఇద్దరినీ మూర్ఖుల్ని చేసింది. పలోంబి చెబుతున్న మాటలు వింటూంటే నా రక్తం ఉడికిపోతోంది. ఆ విషయాలన్నీ నేను చెబుతామనుకున్నవే. అతనికి మాట్లాడ్డంలో మర్యాద, నైపుణ్యం తెలియవు. అందుకే అతను మాట్లాడే మాటలన్నీ మోటుగా అనిపించాయి.

నాకేమయిందో తెలీదు. నేను కటువుగా "చాలు ఆపెయ్యి. ఏంటి పిచ్చిపిచ్చిగా వాగుతున్నావ్? చచ్చిన పాముని ఇంకా చంపకు. నాకు నిద్రవస్తోంది" అన్నాను.

పలోంబి నిస్సహాయంగా నా వంక చూస్తూ "నిజమే కొన్ని కొన్ని మాటలు ఇతరులకి కష్టం కలిగిస్తాయి" అన్నాడు. ఆ తర్వాత ప్రయాణిస్తున్నంత సేపూ అతనేమీ మాట్లాడలేదు.

ఎన్నో నెలలవరకు పలోంబి దిగులుగా ఉదాశీనంగా ఉన్నాడు. నాక్కూడాదిగులుగా ఉండేది. మా ప్రయాణం అదే కంకర రోడ్డులో సాగిపోయేది. దానికి అంతమంటూ లేదు. ప్రాణంలేని, భావశూన్యమైన రాళ్లతో నిర్మించిన రోడ్డుమీద రోజుకి రెండుసార్లు మింగి తుపుక్కున ఉమ్మేయాల్సి వచ్చేది.

నెప్లస్‌కి వెళ్లే దారిలో బీర్‌బార్ తెరిచింది ఇటాలియా. దానిపేరు 'ట్రక్ డ్రైవర్ బీర్ బార్' నిజంగా అందమైన ప్రదేశం అది. దాన్ని చూసేందుకు వందమైళ్ల ప్రయాణం ఏ మాత్రం చెడుకాదు. మేము అక్కడ ఎప్పుడూ ఆగని విషయం బహిరంగమే! కౌంటర్ వెనకాల నిలబడి ఇటాలియా ఆ గూనివాడి చేతికి మద్యం సీసాలు, గ్లాసులు అందివ్వడం చూసి నాకు బాధకలిగేది. చివరాఖరికి నేనా ఉద్యోగాన్ని వదిలేశాను. పలోంబి మాత్రం ఇప్పటికీ విండ్ స్క్రీన్ గ్లాసుమీద 'వాయిలా-లా-ఇటాలియా' అని రాసివున్న ఆ ట్రక్కుని అదే రోడ్డుమీద పరుగెత్తిస్తూనే ఉన్నాడు. V

సింధీ కథ - వాస్‌దేవ్ మోహీ

# అందం

గదిలోకి హాయిగా నడిచొచ్చాను. అద్దం ముందు నుంచుని నన్ను నేను చూసుకుంటున్నాను. జుట్టు చిందరవంద రైంది. సవరించుకున్నా లాభంలేదు. ముడతలు బారిన కత్తిరింపుల స్కర్టు మోకాళ్లకింద పిక్కల్ని తాకుతోంది. గల్లా లోపలి కత్తిరింపు బయటి కొచ్చింది. అందులోంచి ఎత్తులు తొంగి చూస్తు న్నాయి. వాటిని చూసి పెదాలమీద చిరు నవ్వు చిందులేసింది. సడెన్‌గా నా చూపులు కింది పెదవి మీదికి చేరాయి. దుర్మార్గుడు... ఇదంతా ఆ ఫలీ కారణం గానే. అల్లరి పిల్లాడు... ఎంత పనిజేశాడు! రాను రాను మొరటు జంతువైపోతున్నా డు. విచిత్రంగా అప్పుడప్పుడు చెప్పాపెట్ట కుండా తుంటరిగా ప్రవర్తిస్తుంటాడు. ఒ క్కోసారి గుండెపై నా చెవిని ఆనించుకుని "వింటున్నావా నా గుండె చప్పుళ్ళు? " అడుగుతాడు. వెర్రిబాగులోడు... వద్దన్నా వినడు ఇంకేం చెయ్యాలి?

"అవునవును. నీ గుండె చప్పుళ్ళు పిండి మర శబ్దాల్లా అల్లరి పెడుతున్నాయి" అని జవాబిస్తాను. అతడు విరగబడి నవ్వుతూ "మేడమ్! అందరి గుండెలా నా గుండె సామాన్యమైనది గాదు. చాలా గట్టిది" అనేస్తాడు.

నాక్కూడా నవ్వాగదు. ఇద్దరి నవ్వులు జుగల్ బందీలైపోతాయి. ఒక్కోసారి తన ముక్కుకు నా ముక్కును జతజేసి "ఇప్పుడే మంటోంది అల్లరి మనస్సు? " అంటూ చిలిపి చేష్టలు చేస్తాడు.

"సిగ్గు లేదూ? "

మళ్లీ నవ్వుల జుగల్‌బందీ సాగుతుంది. అతడలా అడగడం సబబేనన్పిస్తుంది. ఆ మొరటోడి తుంటరి గిలిగింతలు గమ్మ త్తుగా వుంటాయి.

మేమిద్దరం కలిసి ఈ మహాబలేశ్వర్ కొచ్చి రెండ్రోజులైంది. ఫలీతో స్నేహం కుదిరి సంవత్సరమైంది. డేటింగ్ మాత్రం ఓ నెలక్రితం మొదలైంది. హోటల్లో వేర్వేరు గదులు తీసుకున్నాం గానీ చాలాసేపు ఒకే గదిలో ఉంటున్నాం. మొదట... రెండు గదులెందుకని అడి గాడు ఫలీ... కానీ నేను ఒప్పుకోలేదు. నా అభ్యంతరానికడ్డు చెప్పలేక నా దారికొ చ్చాడు.

"పెళ్లయ్యేదాకా మనం ఒకే గదిలో ఉండకూడదు. శారీరక సాన్నిహిత్యానికి హద్దులుంటేనే అందం, చందం. ఆ హద్దుల్ని దాటరాదనేది మౌఖిక ఒప్పం దం. అలాగైతేనే ఒకరినొకరం అర్థం చేసు కుంటాం. ఆనందాన్ననుభవిస్తాం"

ఫలీ మాత్రం ఇప్పటికిప్పుడే పెళ్లిచేసు కుందామంటాడు. కానీ అది బాగుండదు. నాన్నగారొప్పుకోవాలి. పార్సీ కుర్రాడే కావా లంటాడు నాన్న. నాకు ముప్ఫయిరెండేళ్ల వయసొచ్చింది. ఫలీ ఇప్పుడు దొరికాడు. ముంబైనుండి కంపెనీ పనిమీద మా పూనా ఆఫీసుకొచ్చాడు. పరిచయమైంది. మామూలు పరిచయం మహాస్నేహంగా

మారింది. ఇహ ఇప్పుడు... నాన్న ఫలీని చూడాలి. త్వరలోనే నాన్న ఇరాన్ నుండి తిరిగి వస్తున్నాడు. నాన్నకు ఇరాన్ అంటే చాలా యిష్టం.

"మనం హిందుస్థానీలమే కానీ పూర్వీకుల జన్మభూమి మట్టివాసనతో ఒళ్ళు పులకించిపోతుంది. ఉచ్ఛ్వాసనిశ్వాసల్లో మాధుర్యం చోటుచేసుకుంటుంది" అంటాడు.

నీడిల్ ఐ పాయింట్‌కి చేరగానే ఫలీకి పిచ్చెక్కలేదు గదా!... లోయవైపు వెల్తున్నాడు. నేనడ్డుకుంటానని అతనికి తెలుసు. గబగబా నీడిల్ ఐ పాయింట్ చేరుకుని "ఫొటో తియ్" అన్నాడు.

నాకు శ్వాస ఆగినట్టయింది. "లేదు నేను ఫొటో తియ్యను. నువు వెంటనే తిరిగొచ్చెయ్" అన్నాను. నా పక్కనున్న జనాలు గూడా "పడిపోతావు. వెంటనే రావాలి" అంటూ సైగలు చేస్తున్నారు.

ఫలీ సరేనన్నాడు. కొద్దిగా కాలు జారిందేమో ఊగిసలాడాడు. అందరూ అరుస్తున్నారు. నాకు చెప్పరానంత టెన్షన్. చిన్న కొమ్మను అందుకుని ఫలీ పల్లపురాయి మీద ఒరిగాడు. నా స్కార్ఫ్ తీసి వేళ్లాడేశాను. అది చిన్నగావుంది. ఇద్దరాడపిల్లలు తమ చున్నీలను నా స్కార్ఫ్‌కు ముడేశారు. దాన్ని వేళ్లాడదీశారు. గట్టిగా పట్టుకుని ఫలీ పైకి ఎక్కుతున్నాడు. చుట్టు పక్కల వాళ్లంతా సహాయం చేస్తున్నారు. నేను బొమ్మలాగయ్యాను. నోటమాట రాలేదు. కళ్లల్లో నీళ్లు నిండాయి.

"మేడమ్! మనదంతా అసాధారణం. మృత్యుముఖంలోకెళ్లి ప్రాణాలతో బయటికి రావడం గూడా..!" అంటూ పగలబడి నవ్వుతున్నాడు.

నా కంటి ధారలు అతని ఛాతీని తడిపేస్తున్నాయి. నా పాపిటలో అతని గోరు గీతలు గీస్తోంది.

"ఏం చేస్తున్నావ్?" ఛాతీనుండి తలపైకెత్తాను.

"హిందూ ఆచారం ప్రకారం పాపిటలో సిందూరం అద్దడం అభ్యాసం చేస్తున్నా"

"మిస్టర్ ఫలీవాడియా! మానాన్న పక్కా పార్సీ. ఆయనకిష్టమైతే అగియార్ (పార్సీల పెళ్లి పందిరి)లోకి తీసుకెళ్లి పురోహితుడు జొరాస్టర్ పవిత్ర అగ్నిజ్వాలలు సాక్షిగా పెళ్లిచేస్తారు. మా పూనా అగియార్ చాలా పవిత్రమైంది. మీ ముంబై అగియార్ గూడా పాతదేకాని పూనాలో 1844లో మొదలైన అగ్నిజ్వాల ఒక్కక్షణం గూడా చల్లారలేదు. నిరంతరం జ్వలిస్తూనే వుంది"

"నాన్న ఎప్పుడొస్తారు?"

"బహుశా ఓ వారంలో"



"అలాగా! వచ్చేవారమంతా నేను కంపెనీ పనిమీద మిడిలీస్టులో వుండాలి. కలవడం కుదరక పోవచ్చు"

"ఎందుకా తొందర? నీ వీలు ప్రకారం నాన్నను ఎప్పుడంటే అప్పుడు కలుసుకో వచ్చు. పూనాకు వచ్చిపోతుంటావు గదా!"

"లేదు అబన్ మేడమ్! మా ఎస్టేట్ వ్యవహారాలు చూసేందుకొస్తుంటాను" గబుక్కున లోపలి కట్‌టాప్‌ను కిందికి లాగాడు. అక్కడ చేతివేళ్లతో నిమిరి గోళ్లతో గిల్లాడు.

"అయ్యో!" అన్నాను.

చుట్టుపక్కలవారి దృష్టి మావైపు మళ్లింది. అతడు ముసిముసిగా నవ్వుతు న్నాడు.

"తుంటరీ! నువ్వు మనిషెప్పుడవు తావు? "

"ఎప్పుడూ కాను. ఎందుకంటే మనిషి లవ్‌యూ, లవ్‌యూ అంటాడు కానీ ఎప్పుడూ లవ్ చెయ్యడు"

"ఇలా గోళ్లతో గిల్లడం, రక్తం కళ్లచూడా లనుకోవడం ప్రేమించడమంటావా? "

"కాదు. నాకు సొంతమైన ఆస్తినిండా నా దంతాలతో సంతకాలు చేస్తాను"

ఛాతీ మీద స్కార్ఫ్ కప్పేశాను. సమయం గడుస్తోంది. వాతావరణం చల్ల బడుతోంది. మేము జాకెట్లు వేసుకుని హోటల్‌వైపు నడుస్తున్నాం. నా చెయ్యి అతని జాకెట్ జేబులో.. అతని చెయ్యి నా జాకెట్ జేబులో.. రేపు తిరిగి వెళ్లాలి. ఇంకో రెండ్రోజులుందామని ఫలీ పట్టుబ డ్తున్నాడు. నాకు సెలవు లెక్కువ లేవు. వెళ్లిపోవాలి. గదిలో... నా ఒడిలో తలా నించి అదే పట్టుపడ్తున్నాడు. మళ్లీ నిస్సహా యురాలినయ్యాను. అతడు నా లిప్‌స్టిక్ పెదాలను వేలితో నిమిరాడు. తర్వాత నా టాప్‌ను కిందికిలాగి అక్కడ వేలితో ఏదో రాస్తున్నాడు. తనివి తీరలేదేమో... వేలితో మళ్లీ పెదాల మీద రాసి, మళ్లీ అక్కడ రాస్తున్నాడు.

నాకు నవ్వొచ్చింది. "నీ సొంత ఆస్తి రాతకోతల పనా అది? "

"అధికారం అలాగే ఉండాలంటే ఇలా చెయ్యాలి అబన్ మేడమ్!"

"నువ్వు... ఎప్పుడూ అక్కడే దాడి చేస్తు న్నావెందుకూ? "

"శరీరంలో అందమైన భాగం అది!"

"మరి... ముఖమో? "

"అది... కేవలం గుర్తింపు కోసమే"

"అలాగా! అయితే నీ గదిలోకెళ్లు. రేప్పొ ద్దున్నే లేచి వెళ్లాలి" అతని మొహాన్ని నా చేతుల్లోకి తీసుకుని చెంపల్ని పళ్లతో నిము రుతూ అన్నాను.

"ఆహా... హాయి... హాయి...!"

"ఇదే మంచిదనుకో. మెత్తగా స్పృశిస్తూ న్నాను. లేకపోతే కుయ్యో మొర్రో అనేవా డిని"

కౌగిట్లో బంధించి సొంత ఆస్తిని ముద్దాడి వెళ్లాడు. నేను డ్రెస్సు మార్చు కుంటూ అద్దంలో చూసుకున్నాను. లిప్‌స్టిక్‌తో ఎదమీది రాత చదివాను. 'దిసీజ్ ఫలీస్ లైఫ్' అనుంది. నా పెదాలు విచ్చుకున్నాయి. అదో పిచ్చి! నిపిల్స్ ఎర్ర గున్నాయి. వాటి చుట్టూ ఎర్రదనమే, వెచ్చగా ఉందనిపిస్తోంది.

★ ★ ★

నాన్న మూడ్ ఏమీ బాగా లేదు. ఇరా న్‌నుండి రాగానే పార్సీ మండల్ సమావే శాల్లో లీనమయ్యాడు. అక్కడ చర్చలు బాగా సాగుతున్నాయట. టవరాఫ్ సైలెన్స్ గురించి ఇంకా వివాదముంది. పార్సీలు శవాన్ని బావిలోకి వేళ్లాడదీస్తారు. మొదట రాబందులు చాలా వుండేవి. శవాన్ని పొడుచుకు తినేవి. ఇప్పుడు నగర జనాభా పెరిగిపోయింది. రాబందులు కనబడ్డం లేదు. ఇలా శవాన్ని వేలాడదీయడానికి స్థానికులు అభ్యంతరాలు వ్యక్తం చేస్తు న్నారు. మండలి సభ్యులు కొందరు

శవాన్ని పూడ్చిపెట్టాలి లేదా కాల్చెయ్యాలంటున్నారు. నాన్నకా సలహాలు నచ్చవు. అగ్ని, నీరు, భూమి పవిత్రమైనవి. వాటిని కలుషితం చెయ్యడమంటే దేవదూత జొరాస్టర్‌ను అవమానించడమే. పర్షియన్ వీక్లీలో నాన్న ఈ విషయమ్మీద బాగా రాశాడు. నాన్న సలహా ప్రకారం కొద్దిరోజుల క్రితం టవరాఫ్ సైలెన్స్‌లో సోలార్ పానెల్ అమర్చారు. దాని వేడితో శవం తొందరగా కరిగిపోవాలి. కానీ ప్రయోజనం కనబడలేదు. అభ్యంతరాలలాగే వున్నాయి. అందుకే నాన్న మూడ్ చెడిపోయింది.

నాన్న మట్టిపాత్రలో నిప్పులు రాజేసి అగ్నిజ్వాలలకు సాష్టాంగ నమస్కారం



చేశాడు. పెదాలతో ఏదో వల్లించాడు. సాష్టాంగ ప్రణామం ముద్రలో ఉండిపో యాడు. మళ్లీ లేచి టేబుల్ వద్దకొచ్చాడు. సీసా మూత తీశాడు. రవే (గోధుమ రవ్వ, పాలు, పంచదారతో తయారైన పాయసం)ను చెంచాలోకి తీసుకుని నోట్లో వేసుకుని చప్పరించాడు. "బాగుంది అబన్ బేటీ! స్వీట్ చేశావు. నువ్వేమన్నా నాతో చెప్పదలుచుకున్నావా? "

"నాన్నా! ఫలీవాడియా ముంబైలో ఉద్యోగం చేస్తున్నాడు. మంచి ఉద్యోగం. నాకు దగ్గరి స్నేహితుడు. మిమ్మల్ని కల వాలనుకుంటున్నాడు"

"అంటే... నీ ఉద్దేశ్యంలో... స్నేహం కంటే ఎక్కువేనన్నమాట. అతని పూర్వీకు లది ఇరాన్ దేశంలో ఏ పట్టణం..."

"నాన్నా! ప్లీజ్. మీరు శతాబ్దాల వెనకటి

అనువాదం :
**ఐతా చంద్రయ్య**

ఇరాన్ పట్టణాలను గుర్తుచేస్తున్నారు. ప్లీ జ్ నాన్నా! హీ ఈజ్ ఏ గుడ్ మాన్!"

నాన్న నవ్వాడు. "బేటీ! నేనతని కాండక్ట్ సర్టిఫికేట్ అడిగానా? ఎప్పుడొస్తాడటా? "

"మీరు ఏ ఆదివారం రమ్మంటే ఆ ఆది వారం నాడు..."

"మంచిది. ఈ ఆదివారమే రమ్మని చెప్పు. మండల్ మీటింగ్ పన్నెండుకైపో తుంది. భోజనానికి రమ్మను. తినడం, తాగడం అలవాటేగా? "

"తింటాడు. తాగడు" అంటూ నవ్వాను. నాన్న గూడా నవ్వాడు.

★ ★ ★

డాక్టరంకుల్‌కు చూపించుకుని తిరిగి వచ్చేప్పుడు మనసులో గమ్మత్తయిన ఆలో చన. ఈ పరీక్షలకు అవసరమేమొచ్చింది. చిన్నవాపు... కొద్దిగా ఎర్రబడింది. వేరే బాధ ఏమీలేదు...! మరెందుకు...?

రెన్నెళ్లనుండి ఫలీ ఫోన్ చేస్తూనే వున్నాడు. నేను వాయిదా వేస్తున్నాను. "నాన్నకు టైందొరకడం లేదు. కొంచెమా గాలి" అంటూ..

మరో రెన్నెళ్లు గడిచాయి.

"నాన్న ఒప్పుకోవడం లేదు. సారీ!" అని ఫలీకి చెప్పేశాను. అతడేదో మాట్లాడబో యాడు... ఫోన్ కట్‌చేశాను.

నాన్న, డాక్టరంకుల్ స్నేహితులు. ఎప్పుడూ కలుసుకుంటూ ఉంటారు.

"బేబీ! డాక్టర్ సోరాబ్జి మనల్ని రాత్రి భోజనానికి నవరోజ్‌కు ఆహ్వానించాడు. నూతన సంవత్సరం వేడుకలు కలిసి చేసు కుందామన్నాడు"

నాకు ఆపరేషనైన మొదట్లో తప్ప డాక్ట రంకుల్ని మళ్లీ కలువలేదు.

"అంతా బాగుంది. ప్రమాదం లేదు" అని డాక్టరంకుల్ భరోసా యిచ్చాడు.

"మంచిది నాన్నా! వెళ్దాం"

★ ★ ★

డాక్టరంకుల్ ఇంటిని రంగు కాగితాల నక్షత్రాలు, సీతాకోకచిలుకలు, పక్షులు, చేపలతో అలంకరించారు. హాలు మధ్యలో పెద్ద కుండం. కుండంలో అగ్నిజ్వాలలు ఎగసిపడుతున్నాయి. చుట్టూ ప్లేట్లలో కొవ్వొత్తులు వెలుగుతున్నాయి. డైనింగ్ టేబుల్ మీద అక్వేరియంలో ఓ చేప ఈదులాడుతోంది. దాని ముందో కొవ్వొత్తి వెలుగుతోంది.

డాక్టరంకుల్ సంతోషంగా నాన్నను అక్కున చేర్చుకున్నాడు. "వెల్‌కం... వెల్‌కం హోమ్! నూతన సంవత్సర శుభా కాంక్షలు"

"నీక్కూడా నూతన సంవత్సర శుభాభి నందనలు"

"మిత్రమా! నువ్వు ఇంట్లోనే యజ్ఞం చేస్తున్నావు. సమిధలు గూడా వేస్తు న్నావు!"

"నీలాంటి అసలైన పార్శీల కోసం చె య్యాల్సి వస్తోంది" అంటూ నవ్వారిద్దరూ.
"నువ్వు కూచోమ్మా! టేబుల్ మీద కోలా వుంది. తాగెయ్. మేం మరో పానీయం తాగొస్తాం"
'నాన్న నా ముందు గూడా తాగుతాడు. పక్కకెళ్లడం ఎందుకో? ' అని మనసులో అనుకుంటూ సాఫ్ట్‌డ్రింక్‌తో గ్లాసు నింపు కుంటున్నాను. నా వీపు మీదెవరో చెయ్యే శారు. గ్లాసు కదిలింది. డ్రింక్ కొంచెం కింద పడింది.
"చెప్పండి మేడమ్, అబన్ దస్తూర్! నన్నెందుకిలా చేశారు? " అన్నాడు.
అతడు ఫలీ. ఆశ్చర్యంతో నాకు నోట మాటరాలేదు.
"నేను నీ జవాబు కోసం ఎదురు చూస్తు న్నాను" అని మళ్లీ అడిగాడు.
నేనేమీ జవాబు చెప్పలేకపోయాను.
"మేడమ్! అబన్ దస్తూర్!" అని పిలి చాడు.
"అదీ... అది... ఏంటంటే... నాన్న కచ్చితమైన పార్శీ"
"నేను పార్శీకానా? "
"కాని... తమరిక్కడికెలా వచ్చారు? "
"మాట మార్చవద్దు"
"అదే... అదేమిటంటే... నా మనసు గూడా ఒప్పుకోలేదు. పెళ్లిచేసుకోవద్దని నిర్ణ యించుకున్నాను"
"కారణం? "
"ఏదో... అదంతే!"
"మేడమ్! నాకంతా తెలుసు"
"ఏం తెలుసు? "
"అంతా...!"
"అంతా అంటే... ఏమిటీ? "
"అవును మేడమ్. నీ దోబూచులాట తర్వాత నేను నీ సమాచారమంతా సేకరిం చాను. అంతా తెలిసింది"
"కానీ... అదేమిటో? "
"నీ మమోగ్రఫీ (కేన్సర్ దశ రిపోర్టు), పాజిటివ్ రిపోర్టు తర్వాత... మైసక్టమీ (కేన్సర్ విస్తరణ నాపేందుకు ఆపరేషన్తో స్తనము తొలగించడం) వరకు"
"అమ్మో! మాంచి గూఢచారివే. పోలీస్ డిపార్ట్‌మెంటులో ప్రయత్నించు. మంచి ఉద్యోగం దొరుకుతుంది"
"డాక్టర్ సొరాబ్జిసేఠ్ నాకు మామగారు. నీ గురించి ఫోన్‌లో అడిగాను. మీ నాన్న అతనికి ప్రాణస్నేహితుడట. నీ గురించి అంతా చెప్పేశాడు"
"అయితే నీకింకేమీ చెప్పాల్సిన అవసరం లేదు. నీక్కావాల్సిన, నీకు సొంతమను కున్న ఆస్తిని నీకప్పగించకుండా నిన్నెలా పెళ్లాడగలను? "
ఫలీ భళ్లున నవ్వాడు.
"నాక్కావాల్సిన ఆస్తంతా నా ముందు నుంచుంది. దానికి లెక్కేలేదు"
"కానీ...!? "
నాన్న, డాక్టరంకుల్ నవ్వుతూ హాల్లోకొ చ్చారు. ఇద్దరి చేతుల్లో గ్లాసులున్నాయి..
"హాల్లో బాబూ!" ఫలీ భుజమ్మీద ఆప్యా యంగా చెయ్యేశాడు నాన్న.
"నాన్నా!" ఆశ్చర్యంతో అయోమయంలో మునుగుతూ అన్నాను.
"అవునమ్మా! నువు మాకు ఫలీని చూ పించలేదు. సొరాబ్జి సహాయం చేశాడు, ఫలీని చూపించాడు. కలిసి మాట్లాడించా డు. మీ డేటింగ్ గురించి చెప్పాడు. నిన్ను పెళ్లాడాలనే కోరుకుంటున్నాడు ఫలీ"
"అబన్ బేటీ! నీకు తెల్సుగదా! నేను పార్శీని. పక్కా వ్యాపారస్తుడిని" అంటూ డాక్టరంకుల్ గట్టిగా నవ్వేశాడు.
"ఏ కారణం లేకుండా ఇలా విందు ఏర్పాటు చేస్తానా? ఈ విందు మిమ్మల్ని కలిపేందుకే"
నాన్నతో పాటు ఫలీగూడా నవ్వుతున్నా డు. నేనింకా ఆశ్చర్యంలోంచి బయట పడ లేదు. V

ఇంగ్లండ్ కథ

- టాల్‌మేజ్ పావెల్

# ఉత్తరం

**లం**డన్‌లోని ప్రధాన దినపత్రికల్లోని ఓ పత్రికా కార్యాలయంలోని మేనేజింగ్ ఎడిటర్ గదిలో ఫోన్ మోగింది. ఆ రోజు వార్తల్లో వేటిని ఏ పేజీలో వేయాలో తన కింది సిబ్బందితో చర్చిస్తున్న రొనాల్డ్ క్లారీకి అది ముఖ్యమైన ఫోన్‌కాల్ అని అర్థమైంది. లేకపోతే అతని సెక్రటరీ ఆ కనెక్షన్ ఇవ్వదు.

"ఎక్స్‌క్యూజ్ మీ జెంటిల్‌మెన్" చెప్తూ రొనాల్డ్ రిసీవర్ అందుకున్నాడు.

"రొనాల్డ్! మేలరీని. అంతా అయిపోయింది" వినిపించింది.

"ఓ! నిక్ ఇక లేడా? " రొనాల్డ్ వణికే కంఠంతో అడిగాడు.

"ఐదు నిమిషాల క్రితమే పోయాడు"

"నేను వెంటనే వస్తున్నాను"

రిసీవర్ పెట్టేసి రొనాల్డ్ కుర్చీ లోంచి లేస్తూ తన సిబ్బందితో చెప్పాడు.

"ఓ ప్రాణమిత్రుడు పోయాడు. నేను అర్జెంట్‌గా వెళ్ళాలి"

బయటి గదిలోని సెక్రటరీ వెళ్తున్న రొనాల్డ్‌కి గుర్తు చేసింది.

"సర్! మీ భార్యతో మీరు మిడిల్‌ఈస్ట్ వెళ్ళి గడిపి రావడానికి విమానం టిక్కెట్లు..."

"...టిక్కెట్లు బుక్ చేయాలని మా ఆవిడ నీకు ఫోన్ చేసి చెప్పిందా? " విసుగ్గా అడిగాడు.

"అవును సర్"

"ఆలోచిస్తానని చెప్పు"

అదే సమయంలో అక్కడికి ఆరుమైళ్ళ దూరంలోని తన ఆఫీస్ గదిలో మోగిన ఫోన్ రిసీవర్ లాయర్ హాడ్లీ లారెన్స్ అందుకున్నాడు.

"హలో హాడ్లీ? " ఓ కంఠం వినిపించింది.

"ఏమిటి మెలరీ? " హాడ్లీ ప్రశ్నించాడు.

"మన నలుగురు గాఢమిత్రుల క్లబ్ లోంచి నిక్ నిష్క్రమించాడు. ముగ్గురమే మిగిలాం" డాక్టర్ మేలరీ చెప్పాడు.

"అరెరె! ఇంత త్వరగా జరుగుతుందని అనుకోలేదు. నిక్ ఎక్కడ ఉన్నాడు? " హాడ్లీ అడిగాడు.

"హాస్పిటల్‌లోనే. నేనూ అక్కడే ఉన్నాను"

"వెంటనే వస్తున్నాను. రొనాల్డ్‌కి కూడా ఈ విషయం చెప్పావా? "

"చెప్పాను. అతనూ బయలుదేరాడు"

రిసీవర్ పెట్టేసి హాడ్లీ తన ముందు కూర్చున్న అత్యంత ఖరీదైన సూట్‌లోని క్లయింట్‌తో చెప్పాడు.

"సారీ! ఓ ప్రాణమిత్రుడు పోయాడని ఇప్పుడే వార్త వచ్చింది. మళ్ళీ ఎప్పుడు కలవాలో ఫోన్ చేసి చెప్తాను"

అతని టేబిల్ మీది స్క్రిబ్లింగ్ పేడ్ మీద తన భార్యకి ఫోన్ చేయాలని గుర్తుకి రాసుకున్న వాక్యాన్ని చూసి కూడా ఫోన్ చేయలేదు. ఆమె ప్రేమించే రోజ్

గార్డెన్ గురించి మాట్లాడటం అతను సమయం వృథా చేయడంగా భావిస్తాడు.

★ ★ ★

"ఆ వ్యాధికి గల మెడికల్ పేరు అందరికీ నోరు తిరగదు. సాధారణంగా చెప్పాలంటే నికీ కోల్‌గ్రెన్ లివర్ ఫెయిలై మరణించాడు" మేలరీ వారితో చెప్పాడు.

ఇద్దరూ నికీ శవాన్ని చూసి వెళ్ళి డాక్టర్ మేలరీ కన్సల్టింగ్ గదిలో కూర్చున్నాక రొనాల్డ్ ప్రశ్నించాడు.

"చివరి దాకా నువ్వు నికీతోనే ఉన్నావా? "

"అవును. కానీ నేనేం చేయలేకపోయాను. గుండెని రిపేర్ చేయచ్చు. కిడ్నీని మార్చొచ్చు. కానీ పూర్తిగా పాడైన లివర్ శరీరంలో ఉంటే ఆ దుకాణానికి ఇకమూత పడినట్లే" మేలరీ విచారంగా చెప్పాడు.

"ఎప్పుడూ హుషారుగా ఉండే మన నికీ ఇక లేడన్న సంగతి నమ్మబుద్ధి కావడం లేదు" హాడ్లీ కంఠంలో కూడా బాధ తొణికిసలాడింది.

"నిజమే. అతను ఇంకా ఐదారు నెలలు తక్కువ కాకుండా జీవిస్తాడని అనుకున్నాను. నికీకి వ్యాధి మొదటి లక్షణం కనిపించినప్పటినించి నికీ డెత్ సర్టిఫికెట్ మీద సంతకం చేసేదాకా నేను వాడితో టచ్‌లోనే ఉంటున్నాను"

"ఇక మీదట నికీతో మనం పేకాట ఆడలేమని, గోల్ఫ్ కోర్స్‌లో అతను మనకిక కనబడడని, బీర్ తాగే పోటీలో పాల్గొనడని... జీవితం విలువ లేనిదని నాకు అనిపిస్తోంది" రొనాల్డ్ బాధగా చెప్పాడు.

"నికీ తన యాభై ఏళ్ళ జీవితాన్ని చక్కగా అనుభవించాడు. విశృంఖలంగా, చట్ట విరుద్ధంగా" హాడ్లీ చెప్పాడు.

"అందుకు నికీ ఎన్నడూ బాధపడలేదు. ఇవాళ కూడా తన మీసానికి రంగేయించుకున్నాడు" డాక్టర్ మేలరీ చెప్పాడు.

"మద్యం, మగువ. ఈ రెంటినీ అతని నించి విడదీస్తే నికీ జీవించి ప్రయోజనం ఉండదు. అతను వాటి కోసమే జీవించాడు. అనారోగ్యం వల్ల అవి అందుబాటులో లేనప్పుడు జీవించడం నికీకి నరకమే"

రొనాల్డ్ చెప్పింది విని అది నిజమన్నట్లుగా హాడ్లీ తల ఊపాడు.

డాక్టర్ మేలరీ నిశ్శబ్దంగా తన టేబిల్ డ్రాయర్‌ని తెరిచి అందులోంచి ఓ పొడుగాటి తెల్లటి కవర్‌ని తీసి ఆ ఇద్దరూ చూసేలా టేబుల్ మీద పడేసాడు. వారి దృష్టి దాని మీద పడింది.

'నా ముగ్గురు మిత్రులు డాక్టర్ మేలరీ, రొనాల్డ్, హాడ్లీలకి' అని దాని మీద రాసి ఉంది. అది నికీ చేతి రాతని ఆ ఇద్దరూ గుర్తు పట్టారు.

హాడ్లీ అనాలోచితంగా దాన్ని అందుకున్నాడు.

"నికీ వారం క్రితం ఈ కవర్ని నాకు ఇచ్చి తను మరణించాక మన ముగ్గురం దీన్ని ఒకేసారి చదవాలని కోరాడు" మేలరీ చెప్పాడు.

మిత్రులిద్దరి మొహాల్లో ఆశ్చర్యం తొంగి చూసింది.

"ఏం రాసాడు? " రొనాల్డ్ ఆశ్చర్యంగా అడిగాడు.

"నికీ కోరికని గౌరవించాలని దాన్ని నేనింతదాకా తెరవలేదు. చదువుతా. వినండి"

డాక్టర్ మేలరీ సన్నటి బంగారు లెటర్ ఓపెనర్ కత్తి అందుకుని శబ్దం వచ్చేలా ఆ కవర్‌ని తెరిచాడు. అందులోంచి రెండు మడతలు పెట్టిన ఓ కాగితాన్ని బయటకి తీసి ఓసారి మనసులో చదువుకోగానే డాక్టర్ మేలరీ ముఖం వివర్ణమవడం ఇద్దరూ గమనించారు.

"ఇది మీరు వినాలనుకోరు" చెప్తూ దాన్ని మళ్ళీ కవర్‌లో ఉంచబోయాడు.

"వింటాను, చదువు" హాడ్లీ అతడి చేతిని పట్టుకుని ఆపి అన్నాడు.

"అవును, చదువు" రొనాల్డ్ ఆసక్తిగా అడిగాడు.

"విన్నాక మీరు బాధపడతారు" డాక్టర్ మేలరీ హెచ్చరించాడు.

"వినకపోతేనే రెట్టింపు బాధ పడతాను. కాబట్టి బయటికి చదువు" హాడ్లీ కోరాడు.

చిన్నగా నిట్టూర్చి మేలరీ మళ్ళీ మడతలు విప్పి ఓసారి వాళ్ళిద్దరి మొహాల వంక నిశితంగా చూసి అక్కడక్కడ తడబడుతూ ఆ ఉత్తరం చదివాడు.

ప్రియమైన ముగ్గురు మిత్రులారా!

డాక్టర్ మాల్ ప్రవర్తనని బట్టి నా లివర్ వ్యాధి నన్ను త్వరలో అంతం చేస్తుంది అనిపిస్తోంది. అందుకు నాకు బాధ లేదు. లిక్కర్ ద్వారా నేను అనుభవించిన ఆనందానికి ఇది మూల్యం కాబట్టి చింతలేదు. నన్ను మీరు 'ప్లే బోయ్ నికీ' అని నా వెనక మాట్లాడుకోవడం నాకు తెలుసు.

జీవించి ఉండగా నేను మిమ్మల్ని ఏ విషయంలోనూ ప్రభావితం చెయ్యలేదు. కాని మరణం తర్వాత చేస్తున్నాను. మీ ముగ్గురూ గౌరవనీయమైన, మర్యాదస్తులైన స్త్రీలని వివాహం చేసుకున్నామని నమ్ముతున్నారు. కాని మీలో ఒకరి నమ్మకం తప్పు. మీ ముగ్గురి భార్యల్లోని ఒకరి చేత నేను మానసికంగా, శారీరకంగా ప్రేమించబడ్డాను. మీరు కలలో కూడ ఊహించలేని తీవ్రమైన ప్రేమని ఆమె నా మీద కురిపించింది. నేను కోరినప్పుడల్లా ఆమె నా దగ్గరికి వచ్చి వెళ్తూండేది. ఎందుకంటే చక్కటి భర్తలా ఎలా మసలుకోవాలో చాలా మందిలా మీకూ తెలీదు. చాలా మంది ఆడవాళ్ళు నాకు దగ్గరవడానికి కారణం ఇదే.

పెళ్ళి కాక మునుపు తన భార్య మీద ప్రేమికుడు చూపించే శ్రద్ధ, ప్రేమలని పెళ్ళయ్యాక కొనసాగించకపోవడం వల్లే వారు ఆ ప్రేమ కోసం పక్కదారులు పడుతూంటారు. ఖరీదైన కార్లు కొనిచ్చి, వారి క్రెడిట్ కార్డ్ బిల్లులని ప్రశ్నించకుండా కట్టడం ప్రేమని చూపించడంగా మీరు పొరబడుతున్నారు. కాని వారితో కొంత సమయం గడపడం, ప్రేమగా ప్రవర్తించడం, లాలిత్యంతో మీరు వారిని ప్రేమిస్తున్నారనే భావనని కలిగించడం లాంటి విషయాల్లో మీ లోపం కారణంగా నేను ఆమెకి దగ్గరయ్యాను. ఇది అక్షర సత్యం.

కాబట్టి నేను మీ ముగ్గురికీ మీరు అనుకున్నంత గాఢ మిత్రుడ్నికాదు. మీ జీవితాల్లో నేనో ముఖ్యమైన జ్ఞాపకంగా నిలిచిపోవడానికి, జరిగింది మీ ముందు ఉంచడం ద్వారా ఇకనైనా మీరు మీ పరిస్థితుల్ని చక్క దిద్దుకుంటారని ఈ నిజాన్ని మీకు తెలియచేస్తున్నాను. ఆమె మీది ప్రేమతో ఆ పేరు వెల్లడించడంలేదు.

మోస్ట్ సిన్సియర్లీ,

నికీ.

డాక్టర్ మేలరీ ఆ ఉత్తరాన్ని మడిచి కవర్‌లో పెట్టాడు. ఆ గదిలో గుండుసూది పడితే వినపడేంత నిశ్శబ్దం అలుముకుంది. రొనాల్డ్, హాడ్లీ మొహాలు కందగడ్డల్లా అయ్యాయి. అనాలోచితంగా హాడ్లీ జేబులోంచి తన సిగార్‌ని తీసి వెలిగించాడు.

"అది లూసిలీ అయి ఉండదు" హాడ్లీ నెమ్మదిగా చెప్పాడు.

తక్షణం రొనాల్డ్ హాడ్లీ వంక కోపంగా

## ఎంతకీ తియ్యదే!



"మా పక్కింటి మేడ మీద ఒక అందమైన అమ్మాయి ఈ మధ్య టవల్ చుట్టుకుని ఎండలో నిలబడుతోంది రోజూ. అందుకని వారం రోజులుగా నేను ఏ పనీ చెయ్యలేకపోతున్నాను"

"ఏం? ఎందుకని? "

"ఎంతకీ ఆ టవల్ ఆరెయ్యటంలేదు మరి"

చూస్తూ అరిచాడు.
"నా భార్య డోరిస్‌కు నికీతో సంబంధం ఉందని ఆరోపిస్తున్నావా? "
"లేక మౌరీన్‌తో ఉందనా? " డాక్టర్ మేలరీ కంఠంలో కూడా కోపం ధ్వనిం చింది.
నేను ఏదీ ఆరోపించడంలేదు. లూసిలీ గురించి నికీ రాయలేదని చెప్తున్నాను. అంతే"
"నా భార్యని ఋజువు లేకుండా నిందిం చడం..." రొనాల్డ్ బల్ల మీద గుద్ది అరి చాడు.
ఊరుకోమన్నట్లుగా అతని చేతిమీద తట్టి మేలరీ చెప్పాడు.
"ఓ ప్రముఖ దినపత్రికని నడిపే వ్యక్తికి సెల్ఫ్ కంట్రోల్ ఉండాలి. అలాగే ఓ ప్రముఖ లాయర్‌కి కూడా. అదీకాక నికీ అనేకసార్లు ఊహించి నవ్వుకున్న దృశ్యం లోలా మనం ఇప్పుడు ప్రవర్తించకూడదు"

అనువాదం :
**మల్లాది వెంకట కృష్ణమూర్తి**

ఆ మాటలకి కొద్దిగా తేలికబడ్డ హాడ్లీ చెప్పాడు.
"మాల్. నువ్వు చెప్పింది నిజమే. మనం సరిగ్గా ఇలాగే స్పందిస్తామని నికీ ఊహించి ఉంటాడు"
"నిజమే. మన ప్రవర్తనని నికీ ఊహించి తప్పక తృప్తి పడి ఉంటాడు" రొనాల్డ్ కూడా చెప్పాడు.
"నికీ ఇంతటి నీచుడని నేననుకోలేదు. దుర్మార్గులతో స్నేహం వద్దని పెద్దలు ఎందుకు చెప్తారో ఇప్పుడు నాకు అర్థ మైంది" మేలరీ చెప్పాడు.
"ఈ విషయంలో మనం ఇప్పుడేం చేయాలి? " రొనాల్డ్ ప్రశ్నించాడు.

"ఆ ఉత్తరాన్ని తగలపెట్టాలి" హాడ్లీ సూచించాడు.
"అది తేలిక. కానీ ఆ ఉత్తరంలోని విష యాన్ని మనం తగలపెట్టలేం. దాన్నించి మనం పారిపోలేం. అది శాశ్వతంగా మన మనసుల్లో ఉంటుంది" మేలరీ చెప్పాడు.
"మనం నికీని ఏమీ చేయలేని పరిస్థితి లోకి వెళ్ళాకే వాడు ఈ ఉత్తరం మనకి అందేలా చేసాడు. పరమ దుర్మార్గుడు. వాడు జీవించి ఉంటే కోర్టుకి ఈడ్చేవాడ్ని" హాడ్లీ ఉగ్రంగా చెప్పాడు.
"అవును. నేనైతే వాడి ప్లేబాయ్ వేషా లన్నీ పేపర్‌లోకి ఎక్కించేవాడిని. పిరికి పంద" రొనాల్డ్ కూడా అదే స్వరంతో చెప్పాడు.
"ఇది ముందే తెలిసినా నేను మాత్రం డాక్టర్‌గా వాడ్ని చంపేవాడ్ని కాదు" డాక్టర్ మేలరీ చెప్పాడు.
"మన నలుగురిలోకి నువ్వే అమాయకు డివి, మంచివాడివి" హాడ్లీ ఎగతాళిగా నవ్వుతూ చెప్పాడు.
"అందుకే ఆ ఉత్తరాన్ని నీకు ఇచ్చాడు. మా ఇద్దరిలో ఎవరికి ఇచ్చినా వెంటనే చింపి చదివేవాళ్ళం" రొనాల్డ్ కూడా చెప్పాడు.
"ఇక మీదట నా భార్యని నేను పూర్వంలా చూడలేను" హాడ్లీ బాధగా చెప్పాడు.
"మన నలుగురిలోకీ నికీనే అందగాడు. ఆడవాళ్ళని మాయ మాటలతో ఆకర్షించగ లడు. ఆ విషయంలో అతనికి ఎంతో అనుభవం ఉంది. కాబట్టి మన భార్యల్లో ఒకర్ని అతను... అది అబద్ధం అని నేను అనుకోను" డాక్టర్ మేలరీ చెప్పాడు.
"ఆమె ఎవరో నేను తెలుసుకుని తీరాలి. లేదా..." హాడ్లీ చెప్తూంటే అతని గొంతు రుద్ధమైంది.
"నన్ను తప్పుగా అర్థం చేసుకోకు. ఆమె ఖచ్చితంగా నా భార్య కాదు. ఎందుకంటే నేను ఆమెని చక్కగా చూసుకుంటున్నాను.

ఆ విషయంలో మీరు ఎన్నోసార్లు నా మీద జోకులు కూడా వేసారు” డాక్టర్ మేలరీ చెప్పాడు.

“నీ భార్య మీద నీకు ఉన్న నమ్మకం నా భార్య మీద నాకూ ఉంటే ఎంత బావుం డేది? ” హాడ్లీ విచారంగా చెప్పాడు.

“ఆమె నాకు బ్రేక్‌ఫాస్ట్ వడ్డిస్తున్నా, పడ కగదిలో అద్దంలోంచి జుట్టు దువ్వు కుంటూ కనిపిస్తున్నా ఇక నేను ఆమెని ఎలా భరించగలను? ” రొనాల్డ్ దీనంగా చెప్పాడు.

“బయట ఎన్ని వెర్రి వేషాలు వేసినా భార్యని మాత్రం ప్రేమగా చూసుకోవాలి అని నేను మీకు ఎన్నోసార్లు చెప్పాను”

“నిజమే. నికీ కూడా తన భార్యని ఎంతో ప్రేమగా చూసుకునేవాడు” రొనాల్డ్ చెప్పాడు.

హాడ్లీ లారెన్స్ కొద్ది క్షణాలాగి లేచి నిల బడి చెప్పాడు.

“ఇది మన ముగ్గురికీ చెందిన రహస్యం. దీన్ని బయటపెట్టడం అంటే మనం మరింత మూర్ఖులం అవడమే అని గుర్తుంచుకోండి. ఈ వీకెండ్‌కి నేను గోల్ఫ్ ఆటకి రాను. ఆదివారం రోజ్ గార్డెన్‌కి వెళ్దాం రమ్మని నా భార్య కోరింది. నేనిక వెళ్తాను”

హాడ్లీ ఎవరితోనూ కరచాలనం చేయ కుండా విసురుగా వెళ్ళిపోయాడు. రొనాల్డ్ కూడా లేచి నిలబడి చెప్పాడు.

“మంచి భర్త గల ఎందరో భార్యలు ఈ ప్రపంచంలో అక్రమ సంబంధాలు పెట్టు కుంటున్నారు. కాబట్టి డోరిస్ లేదా లూసి లీలలో ఒక్కరు మాత్రమే అపరాధి అను కోకు. మౌరిన్ కూడా చెడ్డదేనేమో? ఆలో చించు”

డాక్టర్ మేలరీ బదులుగా నవ్వాడు తప్ప మాట్లాడలేదు. ఆ నవ్వుని రొనాల్డ్ అర్థం చేసుకోలేకపోయాడు.

“నేనూ వెళ్తున్నాను. ఈ వీకెండ్‌కి నేను కూడా గోల్ఫ్ ఆటకి రాలేను. డోరిస్‌తో మిడిల్ ఈస్ట్‌కి వెళ్తున్నాను”

రొనాల్డ్ బూట్ల చప్పుడు కూడా దూరమై పూర్తిగా నిశ్శబ్దం అలముకున్నాక డాక్టర్ మేలరీ రిసీవర్ అందుకుని ఓ నెంబర్‌కి డయల్ చేసాడు.

“మౌరీన్! ఇంటికి వస్తున్నాను. డిన్నర్‌కి వెళ్దాం. సిద్ధంగా ఉండు” చెప్పాడు.

ఫోన్ పెట్టేసాక మౌరీన్ తన భర్త ఇద్దరు మిత్రుల భార్యలు డోరిస్, లూసిలీ లకి ఫోన్ చేసి వారితో మాట్లాడింది.

“ఇక మీదట మీ విషయంలో మీ భ ర్తల ప్రవర్తన ఇంకాస్త మెరుగు అవచ్చు”

“ఎలా చెప్పగలరు? ” ఇద్దరూ ఒకే ప్రశ్నని వేసారు.

వారికి మౌరీన్ ఒకే జవాబు చెప్పింది.

“నికీ మరణానికి సిద్ధంగా ఉన్నాడని తెలిసాక అతన్ని నేను ఓ సహాయం కోరాను. ఓ ఉత్తరం రాయమన్నాను. అందుకు అతను సమ్మతించాడు...” అని ఆ ఉత్తరంలోని విషయాలని వివరిం చింది.

“ఇది అబద్ధం అని మీ భర్తలకి తెలీదు. నిజం అనుకుని మరణించిన నికీ సలహాని పాటించి ఇక మీదట మిమ్మల్ని నిర్లక్ష్యంగా చూడక ప్రేమగా చూస్తారని నేను నమ్ము తున్నాను”

రెండువారాల తర్వాత డోరిస్, మూడు వారాల తర్వాత లూసిలీ మౌరీన్‌కి ఫోన్ చేసి చెప్పారు.

“థాంక్స్. మీ ఉత్తరం మంత్రం పని చేసింది. మా వారిలో చాలా మార్పు వచ్చి ంది. నేను మీకు ఋణపడి ఉన్నాను”

“నాకు కాదు. ఓ మంచి పని చేయడా నికి ఈ విషయంలో తనకి చెడ్డ పేరు వచ్చినా సరే అందుకు అంగీకరించిన నికీకి మీరు ఋణపడి ఉన్నారు” మౌరీన్ వారికి చిరునవ్వుతో చెప్పింది. V

తెలుగు కథ - మంత్రవాది మహేశ్వర్

# అనూహ్య

సెల్‌ఫోన్ రింగైంది.

మనసులో ముద్రపడిపోయిన ఆ నంబరు చూశాడు. దాన్ని పేరుతో సేవ్ చేయడం ఇష్టం లేదు.

"హలో.."

"హాయ్! నేను.. అనూహ్యని.."

"తెలుసు.. నీ కాల్ కోసమే వెయిట్ చేస్తున్నా!"

"వెయిట్ చేసే బదులు ఫోన్ చేయొచ్చుగా.."

"చేస్తే నీకు ఇబ్బంది అన్నావుగా... గుర్తులేదా!"

"ఓс సారీ.."

"ఫ్రీగా వున్నావా? "

"చాలా.. బోరుకొడుతోందా!"

"నీ కాల్ వచ్చేవరకు.."

"మరి ఇప్పుడు.."

"నువ్వు తీయతీయగా మాట్లాడటం మొదలుపెట్టావుగా.."

"నేను మాట్లాడితే అంత తీయగా అని పిస్తోందా!"

"ఊс మాటలు తీయతీయగా వుంటే ఏమవుతుంతో నీకు తెలియదు..!"

"ఏమవుతుంది? "

"చెప్పాలా.."

"ఊс"

"బాడీ హాట్ హాట్‌గా మారిపోతుంటుంది.."

నవ్వు... "ఆ కనెక్షన్ ఏమిటో.."

"తెలియకే అడుగుతున్నావా..? "

"ఊс"

"ఏమిటి మాట్లాడవు? "

"మాటల్లో మంచి చతురత వుంది మీకు!"

"కేవలం మాటల్లోనే కాదు.."

"మరి..? "

"..."

కాసేపు తెరలు తెరలుగా ఆమె నవ్వు... "అమ్మోс దొంగ!!"

"అలా అనడం తప్పుకాదూ..!"

"ఎలా? "

"దొంగ అని"

"మరి మీరన్నమాటేమిటి..? "

"ఏమిటి? "

"మళ్ళీ నాతో చెప్పించాలనా.."

"అంతేగా మరి. తీయతీయగా చిలిపి మాటలు చెవుల్లోంచి జారి గుండెకు తాకి, బాడీ అంతా పాకి.. మత్తెక్కి.."

"ఆపేశారేం... మత్తా..!" మళ్ళీ నవ్వు..

"హాట్ హాట్ విషయాలు చెప్పొచ్చా? అని.."

"మొదలుపెట్టారు మరి... నాకు సస్పెన్సా.."

"సస్పెన్స్ ఇష్టముండదా..? "

"..." మాట్లాడలేదు. నవ్వింది.

"సస్పెన్స్ పెరిగిన కొద్దీ ఏమవుతుందో నాకు తెలుసు..!"

"ఏమవుతుంది? "

"అమ్మ దొంగా..! అదీ నాతో చెప్పించాలనే..!"

"ఊс" నవ్వు.
"నీకూ తెలుసు.."
"నాకూ తెలిస్తే అది సస్పెన్స్ ఎలా అవుతుంది? "
"అదే గమ్మత్తు... ఇద్దరికీ తెలిసినా 'అది' ప్రతిసారీ సస్పెన్సే"
"ఎలాగమ్మా..? " గారం..
"నేను ఇంతకంటే అర్థమయ్యేలా ఎలా చెప్పాలి? ఆс... నీపైట చాటున, నీ చీర కుచ్చిళ్ళ మాటున జరిగేదేమిటో నేను చెప్పాలా..? "
"ఛీ"
"సిగ్గా.."
"ఎక్కడో మొదలుపెట్టి, ఎక్కడికో తీసికెళ్ళిపోయి, ఏవేవో చెప్పేసి చివరికి సిగ్గుపడే విషయాల దగ్గరికే తీసుకొస్తారుగా.."
"నేనింకా ఏం చెప్పందే..? "
"ఇంకా ఏం చెప్పాలి? "
"అదీ వినాలనివుంది కదూ..! నాకు తెలుసు. పూర్తిగా విప్పేస్తేగానీ..." గొంతులో చిన్నపాటి కసి.
"ఏమిటి విప్పడం? "
"ఏమిటనుకుని సిగ్గుపడుతున్నావు... నేననేది అదే విషయాన్ని"
"మీ ఉద్దేశ్యం అదే అయితే నేనెందుకు అలా ఫీలౌతాను. అంటే మీరే ద్వంద్వార్థాలతో మాట్లాడుతున్నారు"
"ద్వంద్వార్థమా..? అంత తెలుగు నాకు తెలియదండీ.."
"మరేం వర్రీ అయిపోకండి. ఈ వచ్చిన తెలుగులోనే చాలా తెలివిగా ఎక్స్‌ప్రెస్ చేస్తున్నారు. ఇప్పుడు టైమెంతైందో తెలుసా..!"
"ఎంతైతే నాకేమిటి"
"మీరలాగే అంటారు"
"ఊс"
"నాకు బోలెడు పనులున్నాయి"
"ఏమిటో.."
"స్నానం చేయాలి"
"నాకు చెబితే నేనూ వచ్చి చేయిస్తానుగా"
"ఛీ... ఏమిటా మాటలు"
"నీతో మాట్లాడుతుంటే ఇద్దరం పసివాళ్ళం అయిపోవాలనిపిస్తుంది"
"మీరు పసివాళ్ళలా ఉంటారేమిటి? "
"ఉండక"
"పసివాళ్ళలా ఫేసుపెడుతూ"
"ఊс"
"పెద్దవాళ్ళలా చిలిపిపనులు మొదలుపెడతారు"
"అవి నీకూ ఇష్టమైనవేగా..! కాదా!? "
"ఇంక నేను లైను కట్ చేసేస్తున్నాను"
"ప్లీజ్... ప్లీజ్..."
"ఏమిటి? "
"నువ్వులైను కట్ చేస్తే నా హార్ట్‌వెయిట్ పెరిగినట్లవుతుంది"
"ఇలా మాట్లాడుతూపోతే ఇంకా పెరిగిపోతుంది. అది మహాడేంజర్ అబ్బాయిగారికి. నేను లైన్ కట్ చేస్తే ముందు మీ బాడీ హీట్ తగ్గుతుంది. ఆ తరువాత గుండె వెయిట్ తగ్గుతుంది. మీరూ స్నానానికి వెళ్ళి ఫ్రెష్ అయిపోయి ఆఫీసుకు వెళ్ళిపోండి లేకపోతే పెద్దబాసు చేత అక్షింతలు"

★ ★ ★

## ఎందుకో చెప్పుకో



పోస్టాఫీసులో ఒక మధ్యవయస్కుడు హృదయాకారం ముద్రించిన గులాబీరంగు కవర్లమీద 'లవ్' అని రాస్తున్నాడు. తర్వాత అన్నిటికీ సెంటు పూశాడు.

ఒక యువకుడు, అతన్ని ఏం చేస్తున్నారని ఆసక్తిగా అడిగాడు.

"'ఎవరో చెప్పుకో' అని వెయ్యి వాలెంటైన్ కార్డులు పంపిస్తున్నాను"

"ఎందుకు? "

"నేను డైవోర్స్ లాయర్ని"



సెల్ రింగైంది.

"ఏమిటి ఈ వేళపుడు చేశారు"

"నిద్రపట్టడం లేదు"

"కళ్ళుమూసుకోండి గట్టిగా"

"అలా చేశాను"

"మరి"

"నువ్వు గుర్తొస్తున్నావు.."

"నన్ను చూడలేదుగా... ఎలా గుర్తొస్తాను? "

"నీ మాటలతో.."

"మాటలు గుర్తొస్తున్నాయి అనాలి అలాంటప్పుడు.."

"ఎలా అనాలో? అనుకోవాలో? నువ్వే చెప్పాలి"

"నా పైన అంత బాధ్యతా..!"

"మరి నిన్న ఆ మాటలేమిటి..? "

"నేనేమన్నాను? "

"చేతులు చేతులూ కలపాలి. పెదవులు పెదవులూ కలపాలి. కళ్ళు కళ్ళూ మైకంతో తేలిపోవాలి. ఒక శరీరంలోంచి మరో శరీ

రంలోకి వేడి పంపించాలి. ఒకరి కాలివే ళ్ళతో మరొకరి అరికాళ్ళలో శృంగార చేష్టలు ఎలా ఉండాలో రాసుకోవాలి..."

"ఆపండి... ఆపండి... అవన్నీ నేనే అన్నాను అంటారు"

"మరి కాదా.."

"ఏం కాదు.. మీరు చెబుతూ ఉంటే నేను ఊఁ కొట్టాను"

"ఊఁ కొట్టడమంటే రెచ్చగొట్టడం కాదా"

"ఊఁ అనకపోతే మీరు ఊరుకుం టారా? "

"ఊరుకోక... ఫోనులో ఏం చేయగ లను? "

"మీరు చాలా గట్టివారు- ఫోనులో ఎన్నైనా చేయగలరు. ఏమైనా చేయగ లరు"

"అంతనమ్మకమా!? "

"ఊఁ మీ మగతనంమీద... 'గట్టి' నమ్మకం"

"ఎంత గట్టి"

"ఇదిగో ఈ ముద్దంత" గట్టిగా ఓ ముద్దిచ్చి ఫోను పెట్టేసింది.

★ ★ ★

సెల్ రింగైంది

"మనం కలిస్తే బావుంటుంది"

"కుదరదు"

"ఏం..? "

"చాలా ఇబ్బందులొస్తాయి. మీరు అలా పదేపదే కలవాలని ఉంది అంటే నేను ఫోన్ చేయను..."

"ఇలా ఫోనులో కనబడకుండా రెచ్చగొట్టి వదిలేస్తే నేనేం అయిపోవాలి"

"సరే అయితే. ఈ రోజునుంచీ మీరనే మాటలకు నేను సమాధానం చెప్పను..."

"అమ్మో అంత శిక్షవేయొద్దు"

"అసలు నాకు తెలియకడుగుతాను 'ఆ' - విషయాలు మాట్లాడుతున్నది ఎవరు? "

"ఏ విషయాలు..? "

"దొంగా... నాతో చెప్పిద్దామనా.."

"చెప్పాలి- 'ఆ' విషయాలు అంటే? "

"చెప్పనా"

"ఊఁ"

"ఆగలేకుండా వుండేందుకు గురిచేసే



విషయాలు"

"ఇంకా స్పష్టంగా"

"తెలియక అడిగేవా ళ్ళకు చెప్పొచ్చు తెలిసి అడిగేవాళ్ళకు చెప్ప లేను"

"తప్పించుకుందా మనా? "

"చెప్పించుకుందా మని"

నవ్వులు... ముద్దు లతో సంభాషణ ముగి సింది.

★ ★ ★

ఇదంతా అనూహ్య, మురళీధర్‌ల మధ్య సెల్ సంభాషణలు. పదేపదే మాట్లాడాల నిపించటం ముదిరి ఇప్పుడు ఆమెను చూడాలని, కలుసుకోవాలనే ఆరాటం ఎక్కువైంది మురళీధర్‌లో. ఎప్పుడూ కల వటం గురించి మాటెత్తినా అనూహ్య తప్పించుకునే ధోరణిని ప్రదర్శిసోంది. అనూహ్యకు ఎందుకు కలవాలనిపించటం లేదు? తనకి ఆమె సెల్‌ఫోన్ కబుర్లు రా త్రిళ్ళు నిద్రపట్టకుండా చేస్తున్నాయి.

అనూహ్యలో ఎటువంటి స్పందనలు కలగటంలేదా..? ఆలోచనల్లో పడ్డాడు మురళీధర్.

అనూహ్యను ఎలాగైనా కలవాలన్న పట్టుదల ఆమె చిరునామా గురించి అన్వే షించింది. ఈ విషయం అనూహ్యకు తెలి యాలని ఏముంది? సెల్‌నెంబరు ఆధా రంతో బీఎస్ఎన్ఎల్ ఫ్రెండు ద్వారా అడ్రసు కనుక్కున్నాడు.

మెహిదీపట్నంలో-

ప్రియా అపార్ట్‌మెంట్స్... నాలుగు ఫ్లోర్లు. పదహారు దాకా ఫ్లాట్లు లోపలికి వెళితే- సందేహించాడు.

ఆ అపార్ట్‌మెంట్స్ ఎదురుగ్గావున్న టీ కొట్టుదగ్గర నిలబడ్డాడు. ఆఫీసులకెళ్ళే సమయం... ఆ అపార్ట్‌మెంట్స్ నుంచి ఆ సమయంలో ఆడవాళ్ళెవరు బయటికొ చ్చినా తన అనూహ్య కావచ్చుననే అను మానం. అనూహ్య నంబరుకు మరో నంబరుగల సెల్‌తో కాల్ చేయడం... కట్ చేయడం... ప్రతిసారీ నిరాశే ఎదు రైంది.

ఆ రోజున-

అలాగే చేశాడు... ఆమె హ్యాండ్‌బ్యాగ్ లోంచి సెల్ బయటకు తీసి 'హలో' అంది.

అదే కంఠస్వరం.

తనను ఊహాలోకాల్లో విహరింపజేసి ంది.. యవ్వనాన్ని కొత్తపుంతలు తొక్కిం చింది... అదే గొంతు.

అదిరిపడ్డాడు...

షాక్ అయ్యాడు.

ఆమె అనూహ్య అని తెలుసుకోగానే బదులివ్వలేదు. ఇవ్వాలనిపించలేదు.

ఈమె తన ఊహాసుందరా? ఇన్నాళ్ళూ- సెల్‌ఫోన్ సుందరి కంఠం మాత్రమే మధురం. పైగా అమ్మాయి కాదు... ఓ యాభైఏళ్ళుంటాయి. లావుగా, నల్లగా వుంది. జుత్తు తెల్లగా...

పెదాలు- గులాబీ రంగులో..

శరీరం- నాజూకుదనంతో మగతనాన్ని రెచ్చగెట్టేలా..

నడుము- పలుచని నడుముపై గీత లాంటి మడత..



కళ్ళు- మైకం చిందిస్తూ, చిలిపితనంతో..

చేతులు- కోరికలకు ఆహ్వానం పలుకుతున్నట్లు..

చేతివేళ్ళు- సున్నితమైన ప్రదేశాలను స్పృశించేందుకు సన్నద్ధమవుతున్నట్లు.

ఊహ.. వాస్తవం..

సుఖాల తీరాలను చేరాలనే తపన మాయమైంది. కనిపిస్తే కసితో ఏదో చేసేయాలన్న నరాల ఉద్వేగం ఎటో వెళ్ళిపోయింది. అయితే ఆ అనుభూతి గొప్పది. శృంగార కోరికలు పతాకస్థాయిని చేరుకోడానికి అనూహ్య పరోక్షకారణం.

మురళీధర్ ఆలోచనల్లో పడ్డాడు. అంత అందమైన భార్యను సొంతం చేసుకుని తను ఎందుకిలా మాయలో పడ్డాడు.

కోరికలు పుట్టించే తత్వం భార్యలో లేక పోవడమా? దానికి తనేం ప్రయత్నం చేశాడు? ఏం చేయలేదు. అదే అసలు పాయింటు.

భార్యలో మైనస్సులు, బయట ఆడవాళ్ళలో ప్లస్సులు మాత్రమే చూసే మనస్తత్వాన్ని ముందు పోగొట్టుకోవాలి. భార్యలో ఒకటి, రెండు మైనస్సులున్నా, తన తెలివితేటల్ని ఉపయోగించి ప్లస్సులుగా మార్చుకుంటే లైఫ్ స్వర్గమే. ప్రతి రాత్రి తొలిరాత్రే...

తనను దూరం నుంచే మురళీధర్ చూసినా చూడనట్లు, తెలియనట్లుగా వెళ్ళిపోయినట్లు గ్రహించిన అనూహ్య ముకుందరావుకు విషయం చెప్పింది. ఇక ముకుందరావు ఆ డ్రామాకు తెరదించాడు. తను చెప్పినట్లు చేసినందుకు అనూహ్యకు పదివేలు యిచ్చాడు. సంతోషంతో పుచ్చుకుని వెళ్ళిపోయిందామె.

ముకుందరావు ఎవరు? ఆ విషయానికే వద్దాం.

మురళీధర్ ముప్పైలోనే చెప్పే ఫిలాసఫీ, ఓ రకమైన నిరుత్సాహం గమనించిన- ఆఫీసులో ఎ.ఎ.ఓ. ముకుందరావు సీనియర్ అసిస్టెంట్ సుబ్బరాజుతో పందెం కాశాడు.

నెలరోజుల్లో మురళీధర్‌లో ఓ గొప్ప మార్పు తీసుకొస్తానని- అది పాతికవేల పందెం.

ముకుందం అనూహ్యను ప్రయోగించాడు. ఆమె మురళీధర్‌కు ఫోన్లు చేస్తుంది. మొదట్లో రెస్పాన్స్ కోల్డ్‌గా వున్నప్పటికీ ఓ వారానికి బాడీలో వేడి మొదలైంది. ఖాళీ దొరికితే చాలు ఫోనులో ఆమెతో గంటలు గంటలు...

ఇప్పుడు మురళి ముఖంలో ఓ తేజస్సు. ఉత్సాహం... నిద్రావస్థకు చేరుకున్న కోరికలు నెలరోజుల్లో బుసలు కొట్టడం ప్రారంభించాయి.

మనసులో మార్పు... మనిషిలో మార్పు..

ముకుందం గెలిచాడు. సుబ్బరాజు పాతికవేలు ఓడాడు.

అది అసలు విషయం కానేకాదు.

ఏ రోజుకారోజు ఆర్థిక పరిస్థితులతో సతమతమయ్యే అనూహ్యకు పదివేలు అందాయి.

మురళీధర్ కాపురంలో మల్లెలు విరిశాయి. గెలిచిన డబ్బుతో ముకుందం, సుబ్బరాజు 'మూన్‌లైట్'లో రోజూ పార్టీ చేసుకుంటున్నారు.

మురళీధర్ ఇంట్లో మరో మార్పు జరిగింది. మురళీధర్ ఆఫీసుకు దగ్గరలోకి ఇల్లు మారాడు. లంచ్‌కు మధ్యాహ్నం ఇంటికి వెడుతున్నాడు.

సాయంకాలం అయిదవడం కోసం వెయిట్ చేస్తున్నాడు. ఇంటికెళ్ళేటప్పుడు మల్లెపూలు కూడా పట్టుకుని వెళుతున్నాడు. ఆఫీసు వేళల్లోనూ మురళీధర్ సెల్ వదలడంలేదు. మాట్లాడుతునే వున్నాడు. అవతల పక్క ఫోనులో మంజుల.

ఆమె అతని భార్య.

V

తెలుగు కథ

- నామని సుజనాదేవి

# సంసారంలో సరిగమలు

రెండు ఇంద్రధనుస్సుల్లా వంగిన కనుబొమ్మల మధ్య ఎర్రగా మెరిసే సిందూరం, తీర్చిదిద్దిన నాసిక, దొండపండులాంటి పెదాలు. శంఖంలాంటి మెడలో నల్లపూసలదండ, ఎత్తయిన వక్షస్థలంపై గర్వంగా మెరుస్తూ వింత శోభనిస్తుంటే, మృదుమధురమైన అందెల రవళితో, మోముపై అల్లరిగా కదులుతున్న ముంగురులు చెమటకు అతుక్కుపోగా, తుడుచుకుంటూ పడకగదిలో కొచ్చి అలసటగా మంచంపై వాలిపోయిన నెచ్చెలినే చూస్తున్నాడు శరత్‌చంద్ర. అలా వాలిపోయినపుడు తొలిగిన పైట, స్థానభ్రంశం చెందిన కొంగుచాటు అందాలు, లోతైన నాభి, పిడికిట్లో ఇమిడిపోయే సన్నని నడుము... అసలే మదనతాపంతో రేగిపోతున్న అతన్ని ఇంక ఆపలేకపోయాయి. తానూ పడకపై పడుకుని ఆమెపై చేయివేసాడు.

ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు పైకి కిందికి కదులుతోన్న ఆమె ఎద, అతని చేయి పడటంతో ఇంకా వేగం పుంజుకుంది. అయితే చారడేసి కాటుక కళ్ళను అతనివైపు



తిప్పుతూ "అబ్బా... ఓపికలేదు... విసిగిం చకండి" అంటూ చేయితీసి అటు తిరిగిం దామె.

కానీ వదల్లేదతను.. "పొద్దున్నుంచి... ఎప్పుడెప్పుడాని ఎదురుచూస్తుంటే.. నిప్పు లపై నీళ్ళు చల్లినట్లు ఓపికలేందటావేం..? నే తెప్పిస్తాగా..." అంటూ వెనకనుండి చేయివేసి తనవైపు తిప్పుకోవడానికి ప్రయ త్నించాడు శరత్‌చంద్ర.

"అబ్బా... ఓపికలేదన్నానా... మీకేం మగమహారాజులు.. బలాదూర్ తిరిగి వస్తారు... పనిమనిషి లక్ష్మి వారం రోజులు రానంది. ఇంటి పని, ఆఫీసులో పని.. క్షణం తీరిక ఉండట్లేదు.. ఒళ్ళు హూనం అయిపోతోంది. నిద్రొస్తోంది... నన్ను విసిగించకండి..."

"అంతేనంటావా..? "

"అంతే..!"

కోపంగా అటు తిరిగి పడుకున్నాడు శర త్‌చంద్ర.

★ ★ ★

తెల్లవారి సెల్‌లో ఉన్న మెసేజ్ చూసాడు శరత్‌చంద్ర. ఇంగ్లీషులో ఉన్న దాని సారాంశం-

"నీకు పుష్పం ఇవ్వడానికి ఎన్నో పూలతో టలు వెదికాను. కానీ నీ 'చిరునవ్వు' కన్నా అందమైన పుష్పం ఎన్ని తోటలు తిరిగినా కనబడలేదు... శుభోదయం..! -నీ ప్రియ సఖి" అని ఉంది.

ఆ సెల్‌నెంబరు తనకు తెలిసిన వారెవ రిదీ కాదు రాంగ్‌నెంబర్ అయి ఉంటుంది. అయినా ఆ మెసేజ్ మనస్సుకి ఆహ్లాదంగా అనిపించింది.

ఆఫీసులో అందరికీ వేతన సవరణ ద్వారా జీతం పెరిగి 'అరియర్స్' రావడంతో అంతా తలా కొంచెం వేసుకుని భారీగా పార్టీ చేసుకుందామనుకున్నారు. అయితే శరత్‌చంద్ర అలాకాకుండా ఇంకొంత కలు పుకుని, తనకు తెలిసిన అనాథాశ్రమంలో

పిల్లలకి చాలా కష్టమవుతున్నందుకు బాత్‌రూమ్‌లు కట్టిద్దామన్నాడు. అందరూ ఒప్పుకున్నారు. అలా అందరి దగ్గర వసూలు చేసిన మొత్తం దాదాపు ముప్పైవేలయ్యింది. ఆ రోజు అలా వసూలు చేసిన మొత్తాన్ని, ఫ్రెండ్, కొలీగ్ అయిన శ్రీనివాస్‌లతో పాటు బ్రాంచిమేనేజర్, యూనియన్ సెక్రెటరీలతో కలిసి అనాథాశ్రమంలో ఇచ్చివచ్చాడు. ఆ పని పూర్తయిన తర్వాత సెల్‌ని చూసుకున్నాడు. ఏదో మెసేజ్ వచ్చింది. దాన్ని యథాలాపంగా చదివాడు.

"పరుల కోసం పాటు పడని నరుని బతుకు దేనికని...

మూగనేలకు నీరందివ్వని వాగు పయనం దేనికని..?

కైండ్‌నెస్ కెనాట్ బి 'హియర్', ఓన్లీ కాన్ బీసీన్..

హా- ట్సాఫ్ టు యువర్ కైండ్‌నెస్ టువర్డ్స్ ఆర్ఫనేజ్

- నీ ప్రియసఖి" అని ఉంది.

అప్పుడనుకున్నాడు అది రాంగ్‌నెంబర్ కాదని.. కానీ ఆశ్చర్యపోయాడు. ఎవరీమె తను చేసిన పని ఆమెకెలా తెలిసింది? ఆఫీసులో ఉన్న ముగ్గురు ఆడవాళ్ళూ పెళ్ళయినవాళ్ళు, తనకన్నా పెద్దవాళ్ళు. వాళ్ళతో అంత చనువు లేదు. మరి కొలీగ్స్ ఎవరైనా తనను ఆటపట్టిస్తున్నారా? అంత పనికట్టుకుని చేసే చిలిపితనం ఎవరికీ లేదు... అలాగే రోజుకో మెసేజ్ వస్తోంద తనికి. 'పొద్దున్న తను వేసుకున్న డ్రెస్ బావుందని, మెసేజ్‌తో పాటు 'గ్రీకువీరుడు... నా రాకుమారుడు...', 'ధీర... మగధీర...' అంటూ కవ్వించే పాటలూ ఉన్నాయందులో. అసలే ఇంట్లో భార్యతో ముభావంగా ఉంటున్నందుకు ఈ ఎస్సెమ్మెస్‌లు అదోరకమైన ఆనందాన్ని, థ్రిల్‌ను కలుగజేస్తున్నాయతనిలో. అయినా ఆ వేళ డబ్బులు అనాథాశ్రమానికి ఇచ్చేసంగతి, తనకి, శ్రీనివాస్‌కి, బ్రాంచిమేనేజర్‌కి తప్ప ఎవరికీ తెలీదు. బ్రాంచిమేనేజర్ చాలా పెద్దవయస్సాయన, ఆయనతో ఛాన్సే లేదు. ఇక శ్రీనివాస్ చాలా క్లోజ్. ఇటీవలే పెళ్లయింది. ఏ విషయమైనా తనతో చెబుతాడు. తనతో ఆటాడే అవకాశమేలేదు... మరి నిజంగానే బయటివాళ్ళెవరైనా తన కదలికలను గమనిస్తున్నారా.. లేకపోతే తను వేసుకున్న డ్రెస్‌తో సహా ఎలా తెలుస్తుంది..? మరి ఆ సెల్‌కి ఫోన్ చేస్తే... ఆలోచన రావడం ఆలస్యం చేసాడు. స్విచ్‌డ్ ఆఫ్ అని వస్తోంది.

ఎస్సెమ్మెస్‌లు గుర్తొచ్చి, ముసిముసిగా నవ్వుకుంటున్న అతన్ని కోపంగా చూసింది శైలజ. ఆకలి కడుపు ముందు పంచభక్ష్యపరమాణ్ణాలు పెట్టి, తినకుండా నోరు కుట్టేసినట్లుంది అతని పరిస్థితి. అందాలరాశిని ఎదురుగా ఉంచుకుని, తెచ్చిపెట్టుకున్న బింకంతో ఎంతోకాలం అలక కొనసాగించలేనని తెలుస్తోంది. శైలజ కూడా పంతానికి పోయినట్లు ముభావంగానే మాట్లాడుతోంది.

★ ★ ★

సాయంత్రం వచ్చేసరికి పడుకుని ఉంది. మైగ్రేన్ తలనొప్పి బాగా వచ్చినపుడు ఆమె అలా పడుకోవడం అలవాటే. అందుకే, "ఏంటీ... తలనొప్పేనా..? టాబ్లెట్ వేసుకోకపోయావా..?" అంటూ ఫ్రెష్‌ప్ అయి టీవీ పెట్టుకుని కూర్చున్నాడు.

"ఎన్నిసార్లు చెప్పినా పాలు తాగవు. పండ్లు తినవు. వద్దంటే ఉపవాసాలు.. తలనొప్పి రమ్మంటే ఎందుకు రాదు. రోజూ తలంటుపోసుకోకపోయావా..? సర్లే ... ఫ్రిజ్‌లో టాబ్లెట్ ఉండొచ్చు.. వేసుకోకపోయావూ.." అన్నాడు.

శైలజ పడుకుని ఏడుస్తూ ఉండిపోయింది. తప్పనిసరై లేచి ఫ్రిజ్ అంతా వెదికాడు టాబ్లెట్ కోసం... లేదు. "అయిపోయాయా..?" అతని మాటకు బదులుగా

# కారుకూతలు

కార్డు కథలు

పనిమనిషి వెంకమ్మ మాధవి ఇంట్లో పని ముగించి అదే ఊళ్లో ఉంటున్న మాధవి అమ్మ గారింటికి పనికి వచ్చింది. ఆ ఇంట్లో కూడా పని పూర్తిచేసి వెళ్లిపోతూ "అమ్మగారూ! మాధవమ్మ గారింటికి పొద్దున్నే బుచ్చిబాబు గారొచ్చారు. అమ్మగారి దగ్గర కారు కూతలు కూసిండు! నాకు భలే ఆశ్చర్యమేసింది!" అంది.



మాధవి తల్లి భృకుటి ముడి పడింది. భర్త పరమేశంతో వెంకమ్మ చెప్పిన విషయం వర్ణించి చెప్పింది. భార్యాభర్తలిద్దరూ బుచ్చిబాబు మీద ఆగ్రహం చెందారు. "చిన్నాన్న కొడుకైనా సొంత తమ్ముడిలా మాధవి వాణ్ణి ప్రేమించింది. అక్కా, అక్కా అని తిరిగేవాడు. వాడికేం పోయేకాలం? కారుకూతలు కూసేడట!" అంది భార్య.

"వాడికి నాలుగు రాళ్లు కనబడుతున్నాయి. అక్క ఇల్లు, ఆర్థికస్థితి వెక్కిరింపుగా తోచి ఉంటుంది" అన్నాడు పరమేశం.

"బుచ్చిబాబు గతం మరచిపోయి ప్రవర్తిస్తాడనుకోలేదు" అంది మాధవి తల్లి.

"నడమంత్రపు సిరి ఏదైనా చేస్తుందే! మాధవి అక్కదీ, నాదీ ఒకటే ప్రాణం అనేవాడు. ఎలా మారిపోయాడో చూసావా!" పరమేశం అందుకున్నాడు.

"సెలవు దొరికినప్పుడల్లా ఆ ఇంట వాలిపోడం ఎందుకు? ఈ కూతలెందుకు? వాళ్లింటికి పోవచ్చుగా?" పరమేశం భార్య ఆవేశంగా అంది.

"అసలు ఏ విషయమై వాగాడంటావ్?" అన్నాడు పరమేశం.

"మన మాధవిని గూర్చి ప్రేలాపన పేలడానికి ఏం కారణం ఉంది? మీరన్నట్టు డబ్బు మదంతోనే అయ్యుంటుంది"

"మనం ఇలా సందేహపడే బదులు మాధవికి ఫోన్ చేస్తే పోలా?" అప్పుడు తెలివి తెచ్చుకుని అన్నాడు పరమేశం.

కూతురికి ఫోన్ చేసి విషయం అడిగాడు. అట్నుంచి మాధవి నవ్వుతూ చెప్పిన విషయం విని పగలబడి నవ్వాడు పరమేశం! సంగతి బోధపడక పరమేశం భార్య అయోమయంగా మొహం పెట్టింది. భార్యకి అసలు సంగతి వివరించాడు పరమేశం. "బుచ్చిబాబు మిమిక్రీ నేర్చుకున్నాడట. కారు హారన్ని నోటితో కూసి చూపించాడట!" అని చెప్పాడు. విషయం తెలుసుకుని ఇక్కడ భార్యాభర్తలు, అక్కడ మాధవి విరగబడి నవ్వుకున్నారు.

*– కాండూరి వెంకట సన్యాసిరావ్,*

జామి, విజయనగరం జిల్లా

ఏడుపు ఉద్ధృతమైంది.

"ఆగు.. టాబ్లెట్లు లేవు. షాప్‌కెళ్ళి తెస్తాను!" షర్ట్‌వేసుకుంటూ అన్నాడు.

"నాకేమొద్దు.. ఛీ! ఈ మగాళ్ళకి ఆడవాళ్ళ మనస్సెప్పుడర్థమవుతోందో..? నాకే టాబ్లెట్లు వద్దు.. తెచ్చినా వేసుకోను.." శైలజ వెక్కుతోంది.

"ఈ నీళ్ళు తాగు.. ఎందుకో ఉపవాసాలు..." అంటూ గ్లాసందిస్తే విసిరికొట్టింది.

"అరె... నీళ్ళు తాగు.. కొంచెం తగ్గుతుంది..." వద్దంటున్న ఆమెను ఒడిసి పట్టుకుని తాగించడానికి ప్రయత్నిస్తే, బలంగా నెట్టింది అతన్ని.

"పోనీ.. జెండూబామ్ రాయనా..." సీసాపట్టుకుని దగ్గరకు చేరాడు.

విసిరికొట్టింది. సీసా ఎక్కడ పడిందో జాడ తెలీకుండా పోయింది.

"ఏంటే మొండిపట్టు... కనీసం నీళ్ళు తాగు.. ప్లీజ్..."

"ఛీ! నాకేం వద్దు.. మీ మగాళ్ళ బుర్రలు ఆఫీస్‌లో తప్ప ఇంట్లో పనిచేయవు"

"ఏంటే... సంబంధలేని మాటలు.. నేనేం చేసాను..?"

"ఏం చెయ్యలేదనే బాధ... ఆడదానికి ఏ బాధయినా మగవాడి సాంగత్యంతో,

స్వాంతనతోనే తగ్గుతుంది... నేను బాధపడుతుంటే కనీసం దగ్గరుకు రాకుండా, చెయ్యయినా వేసి తెలుసుకోకుండా టాబ్లెట్ కోసం వెదుకుతున్నారు. మీరు దగ్గరకొచ్చి లాలనగా లాలిస్తే ఎలాంటి బాధ అయినా ఇట్టే తేలిపోదూ... ఎప్పుడర్థం చేసుకుంటారో? ఏమో..!"

"ఆc... దగ్గరికొస్తే విసిరికొడ్తావు... రాకపోతే రాలేదంటావు. ఎగిరే పక్షులను లెక్కపెట్టొచ్చు. నీటిలో ఈదే చేప అడుగులు లెక్కపెట్టొచ్చు. కాని, ఆడవారి మనసు లోతు మాత్రం తెలుసుకోలేం.. అని అందుకే అన్నారు..."

"ఆc.. మీ అవసరం ఉంటే దగ్గరకొస్తారు. పెళ్ళయ్యాక, మీ సొత్తే కదాని నిర్లక్ష్యం చేస్తారు. పెళ్ళికి ముందు 'ఎవరెస్ట్ ఎంత ఎత్తయినా ఎక్కేస్తానే నీ కోసం.. పసిఫిక్‌లో దూకెయ్‌మన్నా దూకేస్తానే నీ కోసం.. కొండ మీది కోతినైనా తెచ్చిస్తానే నీ కోసం...' అంటూ వెంటపడతారు..."

"నువ్వు మాత్రం... పెళ్లికి ముందు 'నిను చూడకనేనుండలేను... ఈ జన్మలో మరి ఆ జన్మలో..' అంటూ పాడలేదూ.."

"అయితే మాత్రం... ఇప్పటికీ నా ప్రేమ మీపై అలాగే ఉంది..."

"ఏం లేదు... దగ్గరకొస్తే కస్సుమంటున్నావు..."

"నా పని మీరు చేస్తే తెలిసేది, ఎందుకన్నానో..."

"ఎందుకు చెయ్యలేను..? భేషుగ్గా చేస్తా..."

"అయితే రేపటికి ఒక్కరోజు మీ పని నేను, నా పని మీరు చేయండి రాత్రికి ఎంత హుషారుగా ఉంటారో చూద్దాం..!"

"ఓకే... బెట్..!"

★ ★ ★

పొద్దున్న శైలజ లేచాక, అతను కాఫీ అందిస్తుంటేగాని, అతను దానిని అంత సీరియస్‌గా తీసుకున్నాడని తెలియలేదు ఆమెకు. 'సర్లే' అని నవ్వుకుంది.

అతను గిన్నెలు తోమి, ఇల్లు ఊడుస్తుంటే బాధనిపించింది. ఇల్లు తుడిచినా ఎక్కడి మట్టి అక్కడ అలాగే కాళ్లకి అంటుతూ ఉంది. కూర మాడింది. రసం కారమైంది. అప్పటికే ఆలస్యం అవడంతో టిఫిన్ చేయకుండా, ఆ అన్నం, మాడిన కూర పైపైది, పెరుగు పెట్టుకుని హడావుడిగా ఎవరి ఆఫీస్‌లకి వారు వెళ్ళారు. ఆఫీస్‌కి వెళ్లగానే ఎస్సెమ్మెస్ చూసుకున్నాడు.

"ట్రావెల్ ఈజ్ వేస్ట్ విత్ అవుట్ లవర్; కాఫీ ఈజ్ వేస్ట్ విత్ అవుట్ షుగర్; సండే ఈజ్ వేస్ట్ వితవుట్ పార్టీ; కాలేజ్ ఈస్ వేస్ట్ విత్ అవుట్ రూమర్; మై లైఫ్ ఈజ్ వేస్ట్ విత్ అవుట్ యు... గుడ్‌మార్నింగ్ - ప్రియసఖి..." అని ఉంది. నవ్వుకున్నాడు... పిచ్చి ముదురుతోంది... కట్ చేయాలి, అనుకుంటూ ఫోన్ చేసాడు... స్విచ్‌డ్ ఆఫ్.

ఇంతలో 'ఐ డొనేషన్' కోసం అప్లికేషన్లు తీసుకునేవాళ్ళని ఈ రోజు రమ్మని చెప్పింది గుర్తొచ్చింది. వాళ్ళు వెయిటింగ్ రూంలో ఉన్నారు. అందరినీ రమ్మని టీ బ్రేక్‌లో 'నేత్రదానం' ప్రాముఖ్యత చెబుతూ, తనది, తన భార్యది మరణాంతరం డొనేట్ చేస్తామని రాసిచ్చాడు. దాదాపు ఆఫీసులోని వాళ్ళంతా నేత్రదానానికి రాసిచ్చారు.

తెల్లవారి వచ్చిన మెసేజ్ ఆత్రంగా చదివాడు "ఆనందం చెప్పలేనిది; సంతోషం పట్టరానిది; కోపం పనికిరానిది; ప్రేమ చెరిగిపోనిది; నీ నేత్రదానం... అందరినీ ప్రోత్సహించిన విధానం చిరకాలం మరువలేనిది.. ఐ లవ్ యూ ప్రియసఖి" అని ఉంది.

అమ్మో... ఏం నెట్‌వర్క్ ఈమెది... అసలు ప్రతీ విషయం ఆవిడకు ఎలా తెలుస్తోంది? కోపంగానే ఉంటోంది కాబట్టి, కనీసం భార్యతో కూడా పంచుకోవడం లేదు ఆఫీసు విషయాలు.. మరి ఆవిడ

ఎవరు? తనకి పెళ్ళయిందని తెలీక ఆశలు పెంచుకుంటుందేమో..? ఇప్పటికే తనంటే పడి చచ్చేవారు ఉన్నారని భార్యకి చూపిస్తేనో... అయ్యా బాబోయ్... ఇకేమైనా ఉందా..? అసలే కోపంగా ఉంది... ఇవి చూస్తే... 'ఎవరిది?'.. అని తన పీక పట్టుకుంటే? తనకే తెలియని ఆ సుందరిని ఎలా చూపిస్తాడు? అవునూ... తనూ... ఆవిడలా ఎస్సెమ్మెస్ పెడితేనో... గుడ్ ఐడియా... ఆలోచన తట్టిన మరుక్షణం-

"మీ ఎస్సెమ్మెస్‌లు చాలా బాగుంటున్నాయి. మీరు లోకలయితే రేపు సాయంత్రం ఆరుగంటలకి ఊరవతలి వెంకటేశ్వరస్వామి కోవెలకి ఏదైనా పచ్చచీర కట్టుకుని రండి. గుర్తుపట్టడానికి... ఒకవేళ దూరంగా ఉండే వాళ్ళయితే ఒక్కసారి ఫోన్ చేయండి మాట్లాడాలి" అంటూ మెస్సేజ్ పెట్టాడు.

తర్వాత ఎప్పటిలా క్లబ్‌కి వెళ్ళబోయి, ఆ రోజు వంట తనే అని గుర్తురావడంతో ఇంటికెళ్ళాడు.

పొద్దున్న హడావుడిలో పాలు ఫ్రిజ్‌లో పెట్టలేదు కాబట్టి విరిగిపోయాయి. టీ లేదు. పొద్దున్న పెరుగు తోడు పెట్టలేదు కాబట్టి పెరుగులేదు. బయట నుండే పెరుగు తెచ్చాడు. ఏదో తిన్నా ననిపించగానే, టీవీ చూసే ఓపికలేదు. మంచానికి అడ్డం పడి నిద్రపోయాడు.

★ ★ ★

తెల్లవారి లేచేసరికి ఒళ్ళంతా నొప్పులు... భార్య ఇచ్చిన కాఫీ మౌనంగా అందుకున్నాడు. ఆత్రంగా మెసేజ్ చూసాడు.

"మెసేజెస్ ఆర్ నాట్ ఫర్ టైమ్‌పాస్.. దె సింప్లీ సే దట్ ఐ యామ్ థింకింగ్ ఆఫ్ యు రైట్ నౌ; అండ్ మేకింగ్ యు టు థింక్ ఆఫ్ మి... మీట్‌యు ఈవినింగ్.. ప్రియసఖి" అని ఉంది.

"యురేకా" అని అరవాలనిపించిందతనికి.. ఆ రెస్పాన్స్‌కి హుషారుగా తయారై కొత్త డ్రెస్ వేసుకున్నాడు. ఆఫీస్‌లో కూడా సాయంత్రం కోసం ఎదురుచూపే. ఈ లోగా మరో ఎస్సెమ్మెస్.

"అలల ప్రయాణం తీరం వరకే; కలల ప్రయాణం మెలకువ వరకే; మేఘం ప్రయాణం జల్లు కురిసే వరకే; నా ప్రయాణం నీతో జీవితాంతం వరకు... నిరీక్షణ మధురంగా ఉందా వెయిట్... నీ ప్రియ సఖి..." అని ఉంది.

ఆగలేకపోయాడు. ఎవరామె... ఉత్సుకత దాచుకోలేకపోతున్నాడు. పర్మిషన్ తీసుకుని బయల్దేరాడు. గుడికెళ్ళి టెంకాయ కొట్టి, దేవుని దర్శనం చేసుకుని, కోనేటి మెట్ల మీద నీళ్ళను చూస్తూ కూర్చున్నాడు. ఎవరై ఉంటారు... ఎవరీమె? ... మృదుమధురమైన అందెల రవళికి, చేతి గాజుల శబ్దానికి ఉలిక్కిపడి వెనుదిరిగాడు. మరో గంట దాటితే గాని, రద్దీ మొదలవదు. అందుకే చిన్న శబ్దమైనా స్పష్టంగా వినబడుతోంది. ఆకుపచ్చ చీర, జాకెట్‌తో వనదేవతలా, పాలరాతి బొమ్మకి ప్రాణమొచ్చినట్లుగా నడిచి వచ్చిందామె. ఎంతందంగా ఉందో తన భార్యలాగా అనుకోకుండా ఉండలేకపోయాడు.

"మీరు..." సంశయంగా ఆగాడు.

"యస్.. ప్రియసఖి.. ఇంకా మీరనడమెందుకు..." ఎంతో పరిచయమున్నట్లుందామె.

"నీకు తెలుసా..! నాకు పెళ్ళయింది..."

"మీ గురించి అన్ని కనుక్కున్నదాన్ని ఆ విషయం తెలీకుండా ఎలా ఉంటుంది.."

"అంటే..?" ఆశ్చర్యపోవడం అతని వంతయింది.

"పెళ్ళయిన వారికే మంచి అనుభవం ఉంటుంది... పురుషుడు సముద్రం లాంటి వాడు... ఎన్ని నదులు వచ్చినా వద్దనకుండా తనలో కలిపేసుకుంటాడు..."

"క్షమించండి... నేనలాంటివాడ్ని కాదు. ఈ మూర్ఖత్వం పనికిరాదు. ఆడవాళ్ళు,

మగవాళ్ళకి వేరే సంబంధాలున్నాయని తెలిసినా, గొర్రె కసాయిని నమ్మినట్లు అతన్నే నమ్ముతారు. అందుకే తీయని నదులు, సముద్రంలో కలవగానే తమ తీపిని కోల్పోయి, ఉప్పుగా మారతాయి. నేను నా భార్యని తప్ప ఎవరినీ ఆ ఉద్దేశంతో చూడలేను. అయినా నేను మిమ్మల్నెందుకు కలవాలనుకున్నానంటే మీలో మంచి భావుకత ఉంది. మీరు మీతో, నాకు పెళ్ళయిన విషయం చెప్పే అవకాశం ఇవ్వలేదు. అది చెప్పి, ఎవరో అదృష్టవంతుడు మీకోసం ఎదురుచూస్తుంటాడని అభినందిద్దామని.. నా గురించి మీకెలా తెలిసిందో కనుక్కుందామని వచ్చాను... ఇంతకీ నా ప్రతి పనీ మీకెలా..”

“ఎలాగంటే ఇలా...” ఆమె నవ్వుతూ వెనక్కి తిరగ్గానే, దగ్గర్లోని స్తంభం చాటు నుండి శ్రీనివాస్, శైలజ వచ్చారు. అంతా అయోమయంగా అన్పించింది.

“ఏమండీ... తన పేరు ప్రియాంక... నా బెస్ట్ ఫ్రెండ్... ఈ మధ్య బజారులో కలిసి, శ్రీనివాస్‌ని పెళ్ళి చేసుకుని ఇక్కడే ఉంటున్నట్టు చెప్పింది. మాటల మధ్యలో శ్రీనివాస్ మీ కొలీగ్ అని తెల్సింది. కాలేజీ రోజుల్లోని బెట్ గురించి అడిగింది. “మీ ఆయన ప్రవరాఖ్యునిలా ఉండాలన్నావు కదా... నిజంగా అలానే ఉంటాడా!” అని కవ్విస్తే “కావాలంటే టెస్ట్ చేసుకో” అన్నాను. ఇద్దరం శ్రీనివాస్‌గారిని సహాయమడిగాం. ఆఫీస్‌లోని విషయాలు ఎప్పటికప్పుడు ఫోన్‌లో చెబుతానన్నాడు. మా అన్నయ్య నాకు గిఫ్ట్‌గా ఇచ్చిన సెల్‌లోని 'సిమ్'తో 'ప్రియసఖి' పేరుతో నేనే, మీకు రోజూ ఎస్సెమ్మెస్‌లు ఇస్తూ వచ్చాను. మీరు హఠాత్తుగా కోవెలకి రమ్మంటే శ్రీనివాస్ గారితో చెప్పి ప్రియాంకను తీసుకురమ్మన్నాను. మొత్తానికి బెట్‌లో నన్ను గెలిపించారు...” నవ్వుతూ చెప్పింది శైలజ.

“సారీ రా... ఏమనుకోకురా... సరదాగా ఉంటే సరేనన్నాను” శ్రీనివాసన్నాడు.

“ఏమండీ... ఆ భావుకత అంతా మీ ఆవిడ సొంతం... ఆ అదృష్టవంతులు మీరే... బెస్టాఫ్ లక్...” ఆత్మీయంగా అంది ప్రియాంక.

ఇబ్బందిగా నవ్వాడు శరత్‌చంద్ర. అందరూ సరదాగా అలా హోటల్‌కి వెళ్ళి, కాస్సేపు దీని గురించి చర్చించుకుని, మరోసారి పిక్నిక్ ప్రోగ్రామ్ వేసుకోవాలని నిర్ణయించుకుని విడిపోయారు.

రాత్రి ఇద్దరికీ నిద్ర పట్టలేదు. ఉన్నట్లుండి 'అమ్మా!' అంటూ కడుపు పట్టుకుని మెలికలు తిరిగిపోసాగింది శైలజ.

“ఏమైంది శైలూ...” అంటూ బింకం మరచి తనవైపు తిప్పుకుంటూ అడిగాడు

“కడుపు నొప్పి” అంటూ మెలికలు తిరుగుతూ ఒడిసి పట్టుకున్న అతన్ని కరుచుకుపోయింది. చాలా రోజుల తర్వాత 'ఆ సాన్నిహిత్యం' హాయిగా ఉంది ఇద్దరికీ.

“కడుపునొప్పి అన్నావు” అన్నాడు అమాయకంగా..

“మీ చేయి పెట్టారుగా మాయమయ్యింది” అంటూ కిలకిలా నవ్వింది శైలజ. ఇద్దరూ శృంగారంలో తడిసి ముద్దయ్యారు.

తరువాత “కడుపు నొప్పి అన్నావుగా డాక్టర్ దగ్గరికెళదాం” అన్న శరత్ మాటలకు “మరోసారి వచ్చినప్పుడు చూద్దాంలే” అంటూ దాట వేసింది.

అతను తనను దగ్గరకు తీయడానికి తాను ఆడిన నాటకంగా అతనికి తెలియడం ఆమెకిష్టం లేదు. ఆమె నటించిందని గ్రహించిన విషయం ఆమెకు తెలియడం అతనికిష్టం లేదు. ఇంటిపని అంటే అమ్మో! మామూలు కాదు, రోజూ భార్యకి సహాయం చేస్తేనే రాత్రికి తనకు సహకారం అందుతుంది అని తెలుసుకున్నాడతను. ఇద్దరి సయ్యాటలు చూసిన చంద్రుడు, మంచి వినోదాన్ని చూసినందుకు ముసిముసిగా నవ్వుకున్నాడు. V

తెలుగు కథ

- పి. లక్ష్మీప్రసన్న

# మిత్ర

**ఏం** ఉద్యోగాలో ఏం పాడో..! మనిషికీ మనిషికీ మధ్య మమతలల్లుకునే టైం లేకుండా చేస్తున్నాయి. రోజుకి పదిగంటలు నుంచొని నుంచొని రెండు గంటలు బైక్ నడిపి కాళ్ళూ, నడుమూ పీక్కుపోతుంటాయి నీకు. నేనేమో హాయిగా ఏసీ క్యాబ్ లో వస్తే నువ్వేమో ట్రాఫిక్ టైంలో బైక్ స్వారీ.

అంతకు ముందు ఇలా ఉండేదా? ఇద్దరమూ ఒకే ఆఫీసులో నైట్ షిఫ్ట్ ఉద్యోగం. ఎంత మధురం ఆ రాత్రులు? గుర్తుందా మొదటిసారి నీ బైక్ ఎక్కినప్పుడు అడిగాను "ఇంటికి ఆఫీసుకి దూరమెంత? " అని, "23 కిలోమీటర్లు" అన్నావు. "నా వయస్సంత" అన్నాను టక్కున. తప్పదు మన ప్రణయ బంధానికి, ప్రయాణ సమయాన్ని కలపాలి. నా క్రియేటివిటీ అంతా అక్కడే చూపించాలి.

'నిన్ను నేను ప్రేమిస్తున్నాను' అని చెప్పటం గుర్తుందా? దానికోసం ఎంత తర్జన భర్జన పడ్డానో.. ఎలా చెప్పాలి? కొత్తగా చెప్పాలి.. అని!

అదే ఎలా? బైక్ మీద చెప్తే? కానీ ఎలా? కాలెండర్లో మంచి రోజు చూసి ఆవేళ చెప్పేద్దాం అనుకున్నా. ఆ రోజు మెరూన్ కలర్ షర్ట్ వేసుకొచ్చావ్ ఆఫీసుకి. చిరాకొచ్చింది. ఎంత మీ అమ్మగారు సెలెక్ట్ చేసినా అది నీకు సూట్ కాదు శశీ. ఐ లవ్ యు చెప్పటం వాయిదా వేసేశాను.

తరువాతి రోజు నాకిష్టమైన స్కైబ్లూ మీద పెద్ద పెద్ద డార్క్ బ్లూచెక్స్ షర్ట్ వేసుకున్నావు. ఆ షర్ట్ వేసుకుంటే నిన్ను నేను పలకరించలేను. సిగ్గు ముంచుకొస్తుంది. గుండె ఎలానో కొట్టుకుంటుంది. స్లీవ్స్ మోచేతివరకు మడిచి ముంజేతిమీద చర్మం కళ్లు చెదిరేంత కాంట్రాస్ట్‌లో కనపడుతుంటే.. హెల్మెట్ తియ్యగానే నుదిటి మీద అలా అలవోకగా ముంగురులు పడుతుంటే.. నీ కళ్ళలోకి చూడటం కూడా అసాధ్యం నాకు. ఇంత అందాన్ని ఇంత దగ్గరగా చూస్తుంటే నోరు తడారిపోతుంది. ఇక ప్రేమిస్తున్నానని ఎలా చెప్పటం?

రోజులాగే బైక్ మన ఇద్దర్నీ మోసుకొని రివ్వున వెళుతోంది. చల్లగాలి ఎదురుగా వీస్తుంటే నేనేం మాట్లాడినా నీకు వినపడటం లేదన్నావు... ఇప్పుడెలా... ఇంత మంచి అవకాశం వదులుకోవాల్సిందేనా... నిశీ థింక్.. థింక్...

"శశీ, నీ వీపు మీద ఒకటి రాస్తాను, అదేంటో కరెక్ట్‌గా చెప్పాలి.." అని నీ చెవిలో అరిచాను.

"చెప్తే నాకేంటి? "

"రూ. 500/- పందెం"

"ఓకే"

తటపటాయిస్తూనే వేలితో ఐ రాశాను. హెచ్ అన్నావు. మొదటిదే తప్పు చెప్తాడా? ఇలా అయితే ఎలా? ఒక్క గుద్దు గుద్దాను.

"చచ్చాన్రా దేవుడోయ్. ఏంటంత కోపం? "

"కరెక్ట్ చెప్పకపోతే అంతే.."

"దుర్మార్గురాలా! సరే కానీ.."

మళ్లీ రాశాను. ఐ.. ఎల్.. ఓ.. వీ.. ఈ.. ఇలా ఒక్కో అక్షరమే నీతో చెప్పిస్తూ, చివరికి నేను చెప్పాలనుకున్న 143 మాటని నీ నోటిద్వారా చెప్పించేశాను... విజయం నాదే అని గర్వపడుతుండగా...

"తియ్యి 500.."

"500 ఏంటి? "

"పందెం కట్టావుగా.."

"షిట్! ఈ అబ్బాయిలు ఇంత ట్యూబ్ లైట్లని తెలీదే! ప్యూర్ మనీ మైండెడ్" దుఃఖం కట్టలు తెంచుకుంటుంటే బ్యాగ్‌లోంచి రూ. 500/- ఇచ్చేశాను.

ఆ తర్వాత కనీసం 500 సార్లు బతిమాలించుకొని నా ప్రపోజల్ని ఒప్పుకున్నావుగా మొత్తానికి!

ఒకరోజు (నా 24వ పుట్టినరోజున) నీకిష్టమని చికెన్ బిర్యానీ ఎలా చేయాలో.. మా ఓనరు ఆంటీ దగ్గర నేర్చుకొని వండి నీ ఫ్లాట్‌కి తీసుకువచ్చాను. ఆ రోజుని నేనెప్పుడూ మరవలేను. ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ మూడు గంటలసేపు తిన్నాం. నేను కిచెన్ గట్టుమీద కూర్చుని ఆపిల్ తింటుంటే నువ్వు ఆ గిన్నెలు కడిగేశావు. కాసేపు రెస్ట్ తీసుకుందాం అని బెడ్‌రూమ్‌లోకి నడిచావు. అంత వరకు బానే ఉన్నా టెన్షన్ వచ్చేసింది నాకు.

దర్జాగా పడుకొని చాలా నడుమునొప్పిగా ఉంది, మూవ్ రాయమన్నావు. నీ చేతులతో నా చేతులు పట్టుకొని మరీ ఎలా మసాజ్ చెయ్యాలో నేర్పించావు. రుద్దీ రుద్దీ నా చేతులు నొప్పి పుట్టాయి కానీ నువ్వు చాలనట్లేదు. నాకేమో వేడి ఎక్కువై అంత చలికాలంలో కూడా నుదిటిపై చెమట పట్టేసింది. ఫ్యాన్‌వేస్తే చలి అన్నావు. నాకేమో ఆవిర్లొచ్చేంత వేడి. బట్టలు విప్పి మూలకి విసిరి కొడదామనిపించింది. నీ మీద చచ్చేంత కోపమొచ్చింది. మరుసటి రోజు బైక్‌మీద చేతులు పిసుక్కుంటూ కూర్చున్నాను. "ఏంటి" అన్నావు. ఎప్పుడు అడుగుతావా? అని చూస్తున్న నేను ఆత్రంగా విషయం చెప్పాను.

"చేతుల నొప్పులు పోవాలంటే పెద్దలొక చిట్కా చెప్పారు" అన్నావు.

"నీకు చిట్కా వైద్యం తెలుసా? " అన్నాను నేను.

"ఆ"

"ఏం చెప్పారు పెద్దలు? "

"ఆ చేతుల నొప్పికి కారణమేదైనా గట్టిగా కౌగిలించుకుంటే తగ్గిపోతుందిట!"

నిద్రమత్తులో ముందు అర్థం కాలేదు నాకు. అర్థమయ్యాక అనిపించింది, నావాడు చిలిపి కృష్ణుడే అని. నిన్న ఒంటరిగా ఉన్నప్పుడు కూడా గీత దాటలేదు నువ్వు. నేనెంత అదృష్టవంతురాల్నో అనిపించింది. ఇప్పుడు ఈ కొంటెతనం..

వ్యూ మిర్రర్‌లో చూస్తూ "నవ్వుతావేంటి చిట్కా నచ్చలేదా? " అన్నావు. కొంటెతనంతో నీ కళ్లు మెరుస్తున్నాయి. అద్దంలో నా కళ్లలోకే చూస్తున్నావు. ఓ కిలోమీటరు గడిచాక నా సిగ్గుని కోరిక జయించింది. నాకిష్టమైన స్కైబ్లూ మీద పెద్ద పెద్ద డార్క్ బ్లూ చెక్స్ షర్ట్ వేసుకున్నావు. ఎంత ముద్దొస్తున్నావో! రెండు చేతులు నీ పొట్ట మీదకు పోనిచ్చి బిగియారా హత్తుకున్నాను. సైడ్ ఏంగిల్‌లో చూస్తే నా ముందు భాగం ఎంత ఫ్లాట్ అయిపోయిందో తెలిసిపోయేది. 70లో వెళ్తున్న బైక్ ఒక్కసారి 20కి పడిపోయిందంటే నీలో నా కౌగిలి రేపిన సంచలనం ఎంతో అర్థమైపోయింది. నిన్ను అంతలా రెచ్చగొట్టానా... అని నాలో నాకే ఆశ్చర్యం! అదే మొదటిసారి బైక్ మీద నిన్ను హత్తుకోవటం! కాలం ఆగిపోయింది. అది నిద్ర కాదు, మత్తు కాదు, మోహం- నన్ను

ముంచేసిన మోహం. నువ్వూ, నేను తప్ప ఈ ప్రపంచంలో ఇంకెవ్వరూ లేరనిపించిన మైకం. "శశీ.. శశీ.." అని నీ వీపు కాను కున్న నా గుండె కొట్టుకోవటం స్పష్టంగా తెలిసిన క్షణం.

కార్పొరేషన్ వాళ్ల పుణ్యం వల్లా, రాత్రి కురిసిన వర్షం వల్లా, స్ట్రీట్ లైట్లు వెలగడం లేదు. మబ్బుల్లోంచి అప్పుడప్పుడూ సన్న గా సోకే వెన్నల కిరణం తప్ప బైక్ లైట్ కూడా తీసేశావు నువ్వు. సన్నటి చలితో కూడిన గాలి నీకు ఇంకా దగ్గరగా వచ్చేలా చేసింది నన్ను. నా ముక్కుతో నీ క్రాఫ్‌లో చక్కలిగిలి పెట్టాను. నీ షాంపూ వాసన ఆఘ్రాణిస్తూ అలా అలా నిద్రలోకి జారిపో యాను. నీ పొట్ట మీంచి నా కుడి చెయ్యి కూడా అలా అలా కిందికి జారిపోయింది. నువ్వు చటుక్కున నీ ఎడమ చేత్తో నా కుడి చేతిని బంధించి మళ్లీ పొట్ట మీదకు లాక్కున్నావు. అలానే ఉంచి నా చేతి మీద నీచేత్తో నిమిరావు. "ఊ" అని మత్తుగా మూలిగాను. నా ఎడమ చెయ్యి నీ తొడ మీద వేసి వీపుకు తలానించి ఎక్కడికో...

... ఎప్పటికో మెలకువ వస్తే కళ్లు తెరి చాను. మా ఇంటి ముందు బైక్ ఆగింది.



ఆపి పది నిముషాలైందని, పలకరించినా నేను లేవలేదనీ నువ్వంటే నాకాశ్చర్యం వేసింది. మౌనంగా దిగాను. నువ్వు వెంటనే వెళ్లిపోయావు. నీ వాలకం చిత్రంగా అనిపించింది. గుడ్‌నైట్ కూడా చెప్పకుండా.. వెనక్కి తిరిగి నావంక ఒక్క సారైనా చూడకుండా.. అలా బైక్‌ని దూకించి మరు నిముషంలో మాయమైపో యావేమిటబ్బా! ఇంటిముందే గట్టుమీద కూర్చుండిపోయాను. నీ సాన్నిహిత్యంలోని మధురిమను ఆస్వాదించి ఆ అనుభవమం తా ముత్యాలసరాలుగా పోగు చేసుకుం టూ... దేహాన్నంతటినీ ఆ ఆలింగన స్పర్శ ను మరవద్దని బతిమిలాడుకుంటూ... ఉండిపోయాను. ఇంకో అరగంటలో తెల్ల వారిపోతుందని గుర్తొచ్చి ఇష్టం లేకున్నా చాలా బలవంతంగా లోపలకి నడిచాను. నా కాళ్ల మధ్య తడి లేకపోవటం చిత్రమ నిపించింది. మరి ఈ పరవశమంతా ఏమిటి? ఇదేనా ప్రేమంటే?

ఆ స్కైబ్లూ షర్టు విత్ డార్క్ బ్లూ చెక్స్ నా ఫేవరెట్. ఆ షర్టులో నువ్వెంత బాగుంటావో తెలుసా! మన్మథుడు ఎవ రు? అని అడిగితే నిన్నే చూపించేసేంత! కానీ మళ్లీ ఎప్పుడూ నువ్వా షర్టు ఆఫీసుకి వేసుకురాలేదు. ఒకటి రెండు సార్లు అడి గితే.. నవ్వావు. మూడోసారి అడిగితే 'నీకెందుకు? ' అని కసురుకున్నావు. నాకు ఒళ్లుమండి అడగటం మానేశాను.

"మన పెళ్లయ్యాక అంత దూరం ఎందుకూ.. కొంచెం దగ్గర్లో ఇల్లు తీసు కుందాం" అంటే.. "అంత దూరం ఉండ బట్టే బైక్ మీద కలిసి ఇంటికొచ్చే ఛాన్స్ ఉంది" అన్నావు. క్రమక్రమంగా బైక్ మీద నాకు దగ్గరితనం పెరిగాక ఇంటికి ఆఫీ సుకి ఎక్కువ దూరమున్నట్టు అనిపించటం లేదు. ఆఫ్టర్ త్రీ ఇయర్స్ నిశీ వెడ్స్ శశీ..

బైక్ మీద మొదటి కౌగిలింతకీ, బెడ్ మీద మొదటి కౌగిలింతకీ డేట్ ఒకటే అని నేను గుర్తు చేస్తే.. "కలిసొచ్చిందని" ఇంక నన్ను మాట్లాడనివ్వలేదు. ఆ షర్టు గురించి అడిగే లోపల.. నా బ్లౌజ్ గురించి మర్చిపోయేలా చేశావు.

పెళ్లయిన ఆర్నెల్లకి అంటే ఇవాళ- నేను వంట్లో బాలేదని సెలవు పెట్టి మరీ నీ బాచిలర్ సామాను సర్దాలని దీక్ష పూనా ను. నువ్వు ఇన్నాళ్లూ ముట్టుకోనివ్వని కబోర్డు తెరిచాను. అడుగున ఏదో గిఫ్ట్ ప్యాకెట్. ఎవరన్నా అమ్మాయి ఇచ్చిం దేమో! అని నా మనసు భగ్గున మండిం ది. వెంటనే ప్యాకెట్ విప్పాను. దానిలో నీ స్కై బ్లూ షర్టు.. అపురూపంగా తెరిచి చూశాను. షర్టు వీపు భాగం మీద నా లిప్‌స్టిక్ పెదవుల ముద్ర! V



- యర్రంశెట్టి శాయి

# లక్ జెమో

వినీల్ ఉలిక్కిపడి నిద్రలేచాడు.

'ఏంటిలాంటి కలవచ్చింది? తనూ, శంతని ఎక్కడో ఫామ్‌హౌస్‌లాంటి చోట లవ్‌మేకింగ్‌లో ఉన్నట్లు.. ఎంత దారుణం? అసలు శంతని మీద తనకెప్పుడూ అలాంటి అభిప్రాయమే కలుగలేదు ఇద్దరూ జస్ట్‌ఫ్రెండ్స్- అంతే! శ్రీరామ్, శంకర్, రోహిణి, విద్యలాగా జస్ట్‌ఫ్రెండ్- అంతే! మరి ఇలాంటి కల...'

హారిబుల్.. ఓ పక్క తను కవితను ప్రేమిస్తున్నాడు. కవిత కూడా తనను ప్రేమిస్తోంది. అన్నీకుదుర్తే- ఇద్దరూ మారేజ్ కూడా చేసుకుంటారు. కథ ఇంత దూరం వెళ్ళాక ఇప్పుడు సడెన్‌గా ఈ కలేమిటి? అని ఆలోచిస్తూ ఈ కల గురించి రోహిత్‌కు చెప్పాడు వినీల్. వాడు విరగబడి నవ్వుతూ..

"ఎంజాయ్ చేయరా భయ్! పరేషానవుతావేంది? "

"నీకేమయినా దిమాకున్నాదిరా? నేనూ, కవిత.."

"మొత్తం దునియాకి తెల్సురా భయ్!"

"మరి..."

"నీకో సంగతి తెలుసా? "

"ఏందది? "

"లవ్ అనేది ఎంతమంది మీదయినా కలగవచ్చు.. ఎన్నిసార్లయినా కలగవచ్చు.."

"అలాగైతే దాన్ని లవ్ అనరు"

"పేరులో ఏముందిరా? పాగల్ లెక్కున్నావ్!"

"అయామ్ సారీ.. అది నా స్కూల్ కాదు"

ఇద్దరూ మాట్లాడుకుంటూ కాంటీన్ దగ్గర కొచ్చేసరికి శంతని, రజిత్ కూల్‌డ్రింక్ తాగుతూ కనిపించారు.

"హాయ్!" పలుకరించింది శంతని..

"హాయ్!" ఇద్దర్నీ విష్ చేశాడు వినీల్.

"నీక్కూడా తీసుకోనా? " అడిగింది శంతని.

"థాంక్‌యూ.. జస్ట్ హాడ్!"

"క్లాస్‌లేదా? "

"ఇంకేం క్లాస్? లాస్ట్‌వీక్ కదా... మనం దరం ఇక్కడ.."

"అవును! అందర్నీ మిస్సవుతానని నాకూ చాలా బాధగా ఉంది"

"ఓకే- సీయూ" రజిత్ వెళ్ళిపోయాడు.

శంతని వచ్చి వినీల్ పక్కన కూర్చుంది.

"కవితేదీ? "

"క్లాస్‌కి వెళ్ళిపోయింది"

"మరి నువ్వెళ్ళలేదేం? ఇద్దరూ ఒకర్ని వదలి ఒకరు ఉండలేరుగా.."

వినీల్ నవ్వాడు. 'నిజంగా అంత సీనుందా? ' తనకి అనుకుంటూ... వెంటనే తనమీద తనకే చిరాకు పుట్టింది. 'ఇలాంటి ఆలోచనలేంటి? కవిత తన హార్ట్! తన హార్ట్‌లో క్వీన్ ఆమె. తను పక్కన లేకపోతే తన లైఫ్ వేస్టేమో...'

"మనవాళ్ళు లాస్ట్ వర్కింగ్‌డే పార్టీ

ఎరేంజ్ చేస్తున్నారు తెలుసా నీకు? " అడిగింది శంతని.

"యా! అందరం కంట్రిబ్యూట్ చేస్తున్నాం కదా! అదిసరేగానీ.. నీ పార్ట్నర్ సందీప్ రెండ్రోజుల్నుంచీ కనబడటం లేదేంటి? "

"బెంగుళూరు వెళ్ళాడు"

"ఎందుకు? "

"తెలీనట్లు పోజ్ కొట్టకు"

"ఓ అర్థమయింది వాళ్ళ సీనియర్ ఫోమా కోసమా? "

"అవును"

"వాళ్ళిద్దరి మధ్య ఇప్పుడు ఎఫైర్ లేదుగా? "

"నేనూ అదే అనుకుని ఇన్వాల్వ్ అయ్యా కానీ.."

"ఫోమాకి పెళ్ళవలేదా? "

"అయింది"

"ఓ గాడ్..!"

"పదిసార్లు ఓ గాడ్..! అనుకోవచ్చు!"

అంతలో కవిత, విమల్‌తో బైక్‌మీద వచ్చింది.

"హాయ్ వినీల్.."

"హాయ్ బ్యూటీ"

"ఏంటిద్దరూ.. లవ్‌బర్డ్స్‌లాగా మాట్లాడుకుంటున్నారు" కవిత టీజ్ చేసింది. శంతని నవ్వేసింది.

"నువ్వు చుట్టుపక్కలుండగా అంత ధైర్యమా మాకు!"

అందరూ కాసేపు మాట్లాడుకుని ఇళ్ళకు బయల్దేరారు. కవిత వినీల్ బైక్ మీద మరీ హత్తుకుని కూర్చునేసరికి వినీల్ బాడీ అంతా వయొలెంట్‌గా ఉంది.

ఎన్నోసార్లు ఆమెతో ఒక రోజంతా గడపాలని ప్రయత్నించాడు వినీల్. కానీ తీరా ఆ టాపిక్ వచ్చేసరికి భయం- సీన్ రివర్సయితే లేనిపోని సమస్యలు-

"మనకు ఫ్రైడే లాస్ట్ వర్కింగ్ డే. పార్టీలో మనం చాలా బాగా ఎంజాయ్ చేయాలి" కవిత కవ్విస్తూ అంటోంది.

వినీల్‌లో ఎగ్జయిట్‌మెంట్-

"ఆ రోజు నిజంగా ఎంజాయ్ చేయవచ్చా? " డౌటుగా అడిగాడు.

"యా- ఆ రోజుని మనం లైఫ్‌లాంగ్ గుర్తుపెట్టుకోవాలి-"

"అవును"

ఆమె ఇల్లు వచ్చేసింది.

ఆమె తండ్రి బయటే గార్డెన్‌లో కూర్చుని ఉన్నాడు. అతను తనని చూసే చూపు వినీల్‌కి నచ్చదు. కవితను తను రేప్ చేసినంత ద్వేషంగా తనవైపు చూస్తూంటాడు.

"హాయ్ అంకుల్-"

"ఈ వీక్‌తో మీ కాలేజ్ లాస్ట్ అనుకుంటా.."

"యా- వుయ్ ఆల్ ఆర్ ఎగ్జయిటెడ్-"

"బి కేర్‌ఫుల్"

వినీల్ డౌటుగా చూశాడు.

"సాధారణంగా పార్టీల్లో బాగా మందుకొడుతూంటారు- అప్పుడే అనర్థాలన్నీ జరిగేది-"

'ఏంటతని మాటల అర్థం- కవితను తను వాడేసుకుంటాడనా? ' మనసులో అనుకుంటూ- "పార్డన్"

"అదే- చాలామంది మందుతో బండి నడిపి ఛస్తూంటారు- తెల్సుగా? "

"యా.. యా.. బట్.. నేను.."

"అందరూ అనేదేలే.. నేను ఎక్సెప్షన్.. అంటారు"

"బై" అన్నాడు వినీల్ ఆ సంభాషణ నచ్చక.

బై చెప్పింది కవిత.

"బై" అంటూ బండి స్టార్ట్ చేశాడు వినీల్.

ఇల్లు చేరుకునేసరికి రోహిత్ ఫోన్ కొట్టాడు.

"అరే.. నేనో ఐడియా ఇస్తా.."

"ఏందది? "

"పార్టీలో కవితను ఎంజాయ్ చేసెయ్..! మళ్ళీ ఛాన్స్ దొరకదు.."

"అంటే నిర్భయ కేసు మీదేసుకుని నేను మిగతా లైఫ్ జైల్లో గడపాలా? "

"కవిత నిన్ను లవ్ చేస్తోంది కదరా- ఆ భయం ఎందుకు? "

"ఓ పక్క తేజ్‌పాల్ కేస్ చూడ టంలా? "

"ఇలా భయపడితే ఫ్యూచర్‌లో లవ్‌మా రేజ్ అనేది ఉండదులే!"

"జైలు కంటే అది నయం కదా-"

"ఛా- నీయవ్వ- నీకు దమ్ము లేకపోతే పోనీ- అందర్నీ బెదరగొట్టకు-" ఫోన్ కట్ చేశాడు.

లాస్ట్ వర్కింగ్ డే పార్టీ స్టార్టయింది.

పెద్ద అడవిలాంటి రిసార్ట్స్ మధ్యలో.. చెట్లకిందే పార్టీ.

ఓ చిన్న స్టేజ్.

అయిటమ్ సాంగ్స్- అబ్బాయిలు, అమ్మాయిల డాన్సులు... అందరూ విస్కీ, బీర్లు తాగుతున్నారు.

వినీల్‌కి కవితతో డాన్స్ చేయాలని ఉంది.

"మనం కూడా చేద్దామా? "

"ఏంటి? " బీర్ తాగుతూ అడిగింది కవిత.

"డాన్స్"

అప్పుడే వచ్చిన నవీన్ శంతని చేయిప ట్టుకుని బలవంతంగా స్టేజ్ దగ్గరకు లాక్కుపోతున్నాడు.

"వద్దు నవీన్! నేను డాన్స్ చేయలేను- నాది మూడో పెగ్"

"మూడో నెల అన్నంత సీన్ చేస్తున్నా వేంటి? పద- అందరూ మందులో ఉన్నోళ్ళే-"

వినీల్‌కి భయంగా ఉంది-

శంతని సెల్‌తీసి పోలీస్‌కి ఫోన్ కొడితే.. నిర్భయ చట్టం కింద అందర్నీ మూసేస్తారు-

"ఒరే.. నవీన్.. అలా ఫోర్స్ చేయకు"

"ఇవన్నీ నకరాల్రా! ఆళ్ళకు చేయాలనే ఉంటుంది గానీ ఫోజు.."

"ఏయ్! నామీద కామెంట్ చేయడాని కెంత ధైర్యంరా నీకు.." ఆమె తూలుతూ చెయ్యి లాక్కుంటోంది.

"అరే నవీన్.. నా మాట విను! నిర్భయ చట్టం కింద అందరం లోపటయి పోతాం.."

"అరే భయపడతావెందుకు? ఆ చెట్టువె నుక చూడు.. రోహిత్‌గాడు శాంతిని బల వంతంగా కిస్ చేస్తున్నాడు.."

"ఓర్నాయనో.."

"షటప్ నీకు చేతకాపోతే.. చేతనయి నోడి జోలికయినా రాకు.."

శంతనిని బలవంతంగా లాక్కెళ్ళాడు నవీన్

శంతని చాలా గొడవ చేస్తుందని ఊహించాడు వినీల్

కానీ ఆమె నిషాతో సెక్సీగా డాన్స్ చేస్తోంది స్టేజ్‌మీద.. విజిల్స్ మోతెక్కిపో తున్నాయ్!

అందరూ ఆమె విరిచే విరుపులకు చప్పట్లు కొడుతున్నారు.

'ఇలాగే కొంపల మీదకు తెచ్చుకునేది...' వినీల్ అనుకుంటుండగా జానీ దగ్గరకొచ్చి చెవిలో గొణిగాడు.

"దమ్ము తెచ్చుకో.. కవితను లాక్కెళ్ళు.. ముందు నకరాలు చేస్తది గానీ తర్వాత ఏమైనా చేస్కో అంటది"

"నిజమేనా? "

"యా.."

"కవితా.."

"యా"

"పద మనం కూడా డాన్స్ చేద్దాం"

"నో వే"

చటుక్కున ఆమె చేయిపట్టుకుని లాగాడు వినీల్ ధైర్యం తెచ్చుకుని -

"కమాన్ యార్"

✍ ఒడిశా కథ : **క్రెడిట్‌కార్డు**
మూల రచయిత : **ప్రతిభారాయ్**
అనువాదం : డా. రాజ్యలక్ష్మి

✍ మలయాళ కథ : **గూళ్లు**
మూల రచయిత : **కమలాదాస్**
అనువాదం : రంగనాథ రామచంద్రరావు

✍ ఇంగ్లండ్ కథ : **నీటిలో చేపలా..**
మూల రచయిత : **డోరిస్ లెస్సింగ్**
అనువాదం : మానేపల్లి మురళి

మార్చి **విపుల** లో..

తూలి అతని మీద పడిపోయింది కవిత.

ఆ స్పర్శతో వినీల్ వళ్ళంతా ఎలక్ట్రిసిటీ..

"నో.. వినీల్.. ప్లీజ్ లీవ్ మీ.."

గట్టిగా అరుస్తోందిగానీ- తను గట్టిగా లాగకుండానే తనతో వచ్చేస్తోంది. జానీ చెప్పింది నిజమే!

వినీల్‌లో ఒక్కసారిగా ఎక్కడలేని ఆనందం... నవీన్ చెప్పింది కరెక్టే..

నకరాలు- అంతే- సో- నో నిర్భయ చట్టం.

స్టేజ్ మీద ఇద్దరూ డాన్స్ చేస్తోంటే ఆమె కావాలనే తన మీద పడుతుండటం గమనించాడు వినీల్. 'ఇంక ఫరవాలేదు. నో నిర్భయ చట్టం' అనుకున్నాడు మనసులో.. కానీ ఇంకొంచెం ఎడ్వాన్సయితే- సెక్సువల్ హెరాస్‌మెంట్ అంటుందేమో..

అయిదారు నెలల క్రితమే కాలేజ్‌లో ఓ కేస్ రిజిష్టర్ అయింది. లెక్చరర్ వినోద్, ఫైనలియర్ తారా- చాలా క్లోజ్. చాలాసార్లు డిన్నర్‌లకూ, మల్టీప్లెక్స్‌లకూ వెళ్ళారు. వినోద్ ఇంక సెక్సువల్‌గా ప్రొసీడయిపోవచ్చు అనుకున్నాడు కాన్ఫిడెంట్‌గా...

పిక్నిక్‌లకెళ్ళినప్పుడు రూమ్‌లోకి తీసుకెళ్ళి ఎంజాయ్ చేశాడు. ఆ రోజు ఏమీ అనలేదుగానీ మర్నాడు పోలీస్ కంప్లయింట్ ఇచ్చింది తార. ఇప్పుడతను జైల్లో ఉన్నాడు. వినీల్‌కి చెమటలు పట్టేసినయ్! 'ఈ నిర్భయ చట్టం వల్ల కవితకు ఐలవ్‌యూ అని చెప్పడానికే మూడు నెలలు పట్టింది' అని వినీల్ మనసులో అనుకుంటుండగా సడెన్‌గా కరెంట్‌పోయింది.

అంతే కేకలు, అరుపులు... అంధకారంలో సెల్‌టార్చ్‌లు స్టేజ్‌మీదకు ఫోకస్ అవుతున్నాయ్‌గానీ- చీకటిని ఛేదించలేకపోతున్నాయి.



## అర్థం ఇదే..

ఓ మధ్యాహ్నం కునుకు తీసి లేచాక రంగతో మంగ ఏమండీ! వాలెంటైన్స్ డేకి నాకు మీరు ముత్యాలహారం కొన్నట్టు కల వచ్చింది. దానర్థం ఏమయ్యుంటుంది?

**రంగ:** ఈ రాత్రికల్లా తెలుస్తుందిలే...

రాత్రికి ఓ చిన్నపెట్టెని మంగకి కానుకగా ఇచ్చాడు. ఉబ్బితబ్బిబ్బైపోతూ తెరిచి చూసింది. అందులో 'కలలకు అర్థం' అనే పుస్తకం ఉంది!

"వినీల్- వెళ్ళి కూర్చుందాం. నాకు తల తిరుగుతున్నట్లుంది తీసుకెళ్ళు-" పూర్తిగా అతనిమీద వాలిపోతూ అంది కవిత.

ఆమెను తన మీదకు లాక్కుని ఆమె నడుము చుట్టూ చేయివేసి నడిపిస్తున్నాడు వినీల్.

ఆమె పెదాలు తన బుగ్గలమీద వేడిగా గాలి వదులుతుంటే ఆమెను కిస్ చేయా లన్న కోరిక రగిలింది.

కానీ జైల్లో ఉన్న లెక్చరర్ వినోద్ గుర్తు కొచ్చాడు. ఆఖరి 'రో'లో కూలబడ్డారిద్దరూ.

"వినీల్- ఐ వాంట్ వాటర్-" అంది కవిత.

వినీల్ చీకట్లోనే ఫుడ్ అయిటమ్స్ ఉన్న టేబుల్ దగ్గరకు నడుస్తున్నాడు. చేతిలో వెలుగుతున్న సెల్ లైట్.. ఆ చెట్ల గుబుర్ల మధ్యలో హఠాత్తుగా ఎవరో బలంగా లాగారు తనని!బాలెన్స్ తప్పి అటువైపు పడిపోయాడు. మెత్తని, వెచ్చని శరీరం తనను ఛాతీకి హత్తుకుంటోంది.

"ప్లీజ్ కిస్‌మీ-" అంటూ తనే ముద్దు పెట్టుకుంటోంది.

ఆ పెదాలకు ఓనరెవరో తెలీదు. కానీ అద్భుతమయిన ఎంజాయ్‌మెంట్.

ఇప్పుడు నిర్భయ చట్టం గుర్తురాలేదు- పావుగంట తర్వాత జనరేటర్ ఆన్ అయింది.

అప్పుడు చూశాడామెను..

శంతని! షాకయ్యాడు వినీల్.

"నువ్వా? "

"యా- డిడ్‌యూ ఎంజాయ్"

"యా-"

"నేనూ మాక్సిమమ్ ఎంజాయ్ చేశా-" హాపీగా అంది.

★ ★ ★

పదేళ్ళ తర్వాత ఓల్డ్ స్టూడెంట్స్ డే ఫంక్షన్ అదే రిసార్ట్స్‌లో ప్రారంభమైంది.

"డియర్ ఫ్రెండ్స్! పదేళ్ళ తరువాత తిరిగి ఇక్కడ కలుసుకోవటం చాలా థ్రిల్లింగ్‌గా ఉంది- ఈ అవకాశాన్ని మనకు కల్పించింది నర్మదా ఇండస్ట్రీస్ మానేజింగ్ డైరెక్టర్ వెంకట్, మిసెస్ వెంకట్. ఇద్దరూ వేదిక మీదకు రావాలి-"

వెంకట్, అతని వెనుక లావుగా, పొడుగ్గా.. ఎవరామె? షాకయ్యాడు వినీల్.

కవిత!?

రోహిత్ ఎక్కడినుంచో వచ్చి తన పక్కన కూర్చున్నాడు.

"అదేందిరా! కవితను నువ్వు చేసుకో లేదా? "

"లేదు-"

"ఎందుకని? "

"ఇటీజ్ లాంగ్ స్టోరి"

"ఏందది? "

ఆ రాత్రి జరిగింది చెప్పాడు వినీల్.

"అది ఓకే గానీ కవితనెందుకు చేసు కోలే? "

"నిర్భయ చట్టం వల్ల"

"అదేంటి? "

"తనను మారేజ్ చేసుకోపోతే నిర్భయ కేస్ పెడతానని శంతని బెదిరించింది"

"ఓ-గాడ్"

కవిత మైక్‌లో మాట్లాడుతోంది..

"ఇన్‌ఫాక్ట్ - నేనూ, వెంకట్ కాలేజ్ డేస్‌లోనే ప్రేమించుకున్నాం. కానీ అమెరికాలో మారేజ్ చేసుకున్నాం-"

చప్పట్లు- వినీల్‌తో సహా...




**ఒ**కవేళ తనకు శక్తుంటూ ఉంటే, మోహినీ మగాళ్ళందర్నీ మట్టి కరిపించాలనుకుంటోంది. ఆమెకు మగాళ్ళంటే కోపం, ద్వేషం, అసహ్యం. ఆసుపత్రిలో పనిచేసే సిబ్బంది అందరూ ఆమెతో మాట్లాడాలంటే భయపడతారు. నర్సులు, దాయలు కూడా

ఆమెకు దూర దూరంగానే మెదులుతారు. మగవారితో సన్నిహితంగా మెదిలే ఆడవాళ్ళని సైతం దుమ్ముదులిపేస్తుంది.

మగ కంపౌండర్లనే కాదు, డాక్టర్లని కూడా దరిచేరనివ్వదు. మగ పేషెంట్లు ఆమెను పిలవాలంటేనే భయపడతారు. ఆమె మామూలు ఆడది కాదు. సాక్షాత్తు రాక్షసి, అందులోనూ అందమైన రాక్షసి. ఎవరి మీదనైన మండిపడ్డదంటే, వాడు మసయ్యే వరకు వదిలిపెట్టదు.

'అందగత్తెనన్న మిడిసిపాటు కాబోలు, చనువిస్తే చంకనెక్కుతారని ఎవరికి అందకుండా ఉంటుంది... అయినా ఎప్పుడో ఏదో తుమ్మెద వాలకపోతుందా, మనం చూడకపోతామా...' అని ఆమె వెనకాల తోటి నర్సులు గొణుక్కుంటూ ఉంటారు.

అది నిజమే. మోహినీని చూస్తే క్షయ రోగికైనా ముఖం ఎఱ్ఱగా కందిపోతుంది. ఆసుపత్రిలో ఆమెను చూసిన వాళ్ళల్లా, "అబ్బా! ఎంత అందగత్తె! పాలరాతి బొమ్మలా ఉంది" అని అనుకోకుండా ఉండలేరు.

వాస్తవానికి ఆమె అందమే ఆమెకు పెద్ద శత్రువులా పరిణమించింది. ఆమె అందాన్ని చూసి పండు ముసలాళ్లు కూడా చొంగ కార్చుకోవడం చూసి మోహినీకి ఒళ్లు మండిపోతుంది. ఆమె చీర కడితేచాలు, కంటబడ్డ ప్రతి మగాడు, ముడతపడ్డ ఆమె నడుమునో, పైట చాటు పొంగునో ఓరకంట చూస్తూనే ఉంటారు. నాభీ దర్శనం కోసం ఆబగా తొంగి తొంగి చూస్తారు. డ్యూటీలో ఉండగా ఎలాగో ఒంటినిండా నర్సుడ్రెస్సు కప్పే ఉంటుంది. కనీసం ఇంటి దగ్గరయినా, ఒంటికి ఉక్కబోత లేకుండా ఉల్లాసంగా ఉందామంటే, అడుగడుగునా, అంగుళంగుళం చూపుల్తో గుచ్చే మగ మృగాల ధాటికి తట్టుకోలేక విలవిల్లాడిపోతుంది. అందుకే ఎక్కువ మట్టుకు ఆమె కాశ్మీరీ సాంప్రదాయ దుస్తులు 'ఫిరాన్'లే ధరిస్తుంది. అరుదుగానే చీర కడుతుంది. ఆ చీరకట్టులో, కోలముఖం, కోటేరు ముక్కు, గులాబీ రేకుల్లా నునుపుదేరిన లేతబుగ్గలు, దొండపండు లాంటి పెదిమలు, చెవులదాకా చేరడేసి కళ్లతో ఆమె సౌందర్యానికి మచ్చుతునకలా ఉంటుంది. కాశ్మీరీ అందమంతా ఆమెలోనే ఉట్టిపడుతుంది.

అయితే, ఇంతటి అందం అడవిగాచిన వెన్నెల అవడానికి కారణం లేకపోలేదు. మోహినీ జూనియర్ కాలేజీలో చదువుతుండగానే తోటి విద్యార్థి ప్రేమలో పడింది. చెట్టాపట్టాలేసుకుని తిరిగింది. ఆ ప్రియుడు పెద్ద కీడేమీ చేయపోయినా, ఏ కారణం చేతనో ఈమెను కాక, వేరే అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడు. అంతేకాదు, ఆమె చిన్నతనంలోనే ఆమె తండ్రి ఆమెనీ, ఆమె తల్లినీ వదిలేసి వేరే కాపురం పెట్టాడు. అందుకే మోహినీకి మగాళ్ళంటే ఏవగింపు. 'మగాళ్లు దుర్మార్గులు. పెళ్లాలని కాలి చెప్పు కంటే అధ్వాన్నంగా భావిస్తారు. అందుకే వాళ్లని నమ్మరాదు' అంటుంది.

మోహినీ గురించి ఆమె వెనకాల ఎన్ని అవాకులు, చెవాకులు పేలినా, ఎదురుగా మాత్రం ఎవరూ తేడాగా మాట్లాడరు. తోటి సిబ్బందే కాదు, డాక్టర్లు కూడా ఆమెతో దురుసుగా మాట్లాడ్డానికి సాహసించరు. ఎప్పుడయినా ఆమె ఏదో మంచిమూడ్‌లో ఉన్నప్పుడు ఎవరితోనైనా నవ్వుతూ మాట్లాడితే, ఎదుటివాడు తానేదో పెద్ద కొండెక్కినంతగా సంబరపడిపోతాడు. ఆ చనువులో ఆమెకు ఏదైనా తేడా కనబడితే, వాడి డొక్క చింపి డోలు కట్టేస్తుంది. ఆమెను కదల్చడమంటే తేనెతుట్టెను కదిపినట్టే. అందుకే ఆమెను అందరూ తేనెటీగ అంటారు.

మోహిని తేనెటీగలా వేగంగా, చురుగ్గా ఉంటుంది. ఆమె ఎంత కసురుకున్నా, విసుక్కున్నా, ఆమె కంటబడగానే ప్రతి మగాడు ఆబగా చూడకుండా ఉండరు. ఆ చూపుల్ని తట్టుకోలేక అప్పుడప్పుడు, ఈ మగాళ్ళంతా నాకేసి ఇంత పిచ్చిగా ఎందుకు చూస్తారు?

ఎప్పుడూ ఆడదాన్నే చూడనట్టుగా చూస్తారు! నన్నేనా, ప్రతి ఆడదాన్నీ ఇలాగే చూస్తారా? అనుకుంటుంది.

అందుకే ఇతర నర్సులతో అంటుంది- "ఈ మగాళ్ళని చూస్తే మీకెందుకు కోపం రాదు? ఎందుకు చనువిస్తారు? "

"పిచ్చిదానా! అందరు మగాళ్ళు చెడ్డవాళ్ళు కాదు. నువ్వెంత విసుక్కుంటే, వాళ్ళంత వేధిస్తున్నట్టుగా అనిపిస్తుంది. నచ్చనప్పుడు నువ్వు వాళ్ళకేసి చూడకు. ఎవరి పాపాన వారే పోతారు" అని సర్దిచెప్పగానే ఆమెకు మరింత మండుతుంది.

"ఆ పాపభీతి ఎవరికుంది? అందమైన ఆడది కంటబడితే చాలు, గుడ్లప్పగించి చూసేయడమే. ఆమె ఒంపుసొంపుల్ని బేరీజు వేయడమే. దూరంగా ఉంటే వెకిలి చూపులు చూడ్డామో, పెదాలు తడుపుకోవడమో చేస్తారు. ఎక్కడైనా గుంపులోనో, రద్దీగా ఉన్నచోట అవకాశం దొరికితే చాలు, ఎక్కడో ఒకచోట తగలడమో, తడమడమో చేస్తారు. ఎదురుతిరిగితే తేలుకుట్టిన దొంగల్లా జారుకుంటారు"

"ఎవరో పోకిరి వెధవలు అలా చేస్తుండొచ్చు. అంతమాత్రాన మగాళ్లందర్ని నిందించడం సబబు కాదు. మన జీవిత భాగస్వామిని ఎంచుకోవడంలో జాగ్రత్తవహిస్తే చాలు. ఎవరికో ఒకరికి ఈ అందాన్ని అర్పించక తప్పదు"

"ఆc! అర్పించావుగా నువ్వు... ఏం బావుకున్నావు? పెళ్లికి ముందు ఎంత అందంగా ఉండేదానివి. విరామం లేకుండా నలుగుర్ని కని వట్టిపోయిన గొడ్డులా తయారయ్యావు..." అంది వెటకారంగా.

"ఓసి, పిచ్చిమొద్దు! అలా పిల్లల్ని కనడంలో ఉన్న మాతృత్వం విలువ, దాంపత్య సుఖం గురించి నీకు ఇప్పుడు అర్థం కాదు. ఆ అనుభవం వస్తేనే తెలుస్తుంది పురుష సాన్నిధ్యంలోని సార్థకత. తుమ్మెదవచ్చి

వాలినప్పుడే పువ్వు పరిమళం గుబాళించిన ట్టుగా, ఒక్కసారి పురుషుడి బిగికౌగిట్లో నలిగిపోయావంటే ఆ పారవశ్యంలోని పర వశానికి ఎంతగా పులకించిపోతావో నీకే బోధపడుతుంది" అంటూ చిలిపిగా మోహినీ బుగ్గ నులిమిందామె.

"నీ బొంద బోధపడుతుంది. వెళ్ళవే, వె ళ్లు! నలుగుర్ని కన్నా, నీకింకా మగడి మై కం దిగనట్టుంది" అని కసురుకుని అక్క డ్నుంచి కదిలి తన వార్డుకి వెళ్తూ, తనలో తానే ఆలోచనలో పడింది మోహిని.

'మగాడు లేకుండా ఆడదానికి గడవదా? పురుషుడి తోడు అనివార్యమా?' ఆమె తన ను తాను ప్రశ్నించుకుని, మళ్లీ తనకుతానే జవాబిచ్చుకుంది- 'ఎందుకు గడవదు? మా మేట్రీన్ వయస్సు నలభైదాటినా, ఇంకా అవివాహితగానే ఉంది. ఆమె ఉండగలుగు తున్నప్పుడు, నేనెందుకు ఉండలేను? పురు షుడి ఆధీనంలో ఎందుకు బతకాలి? నాకు ఉద్యోగం ఉంది. నా బతుకు నేను బతగ్గ లను. మరి పెళ్లిచేసుకోవల్సిన అవసరం ఏముంది?' అదే ఆత్మస్థైర్యంతో నిలకడగా ఉండాలనుకుంది. కానీ అదే ఆసుపత్రిలో పనిచేసే బ్రిజ్‌నాథ్ అనే కంపౌండర్ సాహ సం చేసి ఆ తేనెతుట్టెను కదిలించాడు.

మోహిని పేషెంట్లకు రాత్రిపూట సరఫరా చేయాల్సిన మందులు తీసుకురావడానికి స్టోర్‌రూమ్‌కి వెళ్లింది. అక్కడ అప్పుడు బ్రిజ్‌నాథ్ ఒక్కడే ఉన్నాడు. రూములో చుట్టూరా అరల్లో రంగురంగుల మందు సీసాలు, మాత్రల డబ్బాలు పేర్చి ఉన్నా యి. మోహినీని ఒంటరిగా చూడగానే బ్రి జ్‌నాథ్‌కు మైకం కమ్మినట్టయింది. డ్యూటీ లో ఉన్నానన్న విషయం కూడా మరిచాడు.

మోహిని బ్రిజ్‌నాథ్ ముందర ఇండెంట్ నోట్, ఖాళీ సీసాలు బల్లమీద పెట్టింది- బ్రిజ్‌నాథ్‌కు ఏం చేయాలో తోచడం లే దు. అతను ర్యాకుల్లోంచి బాటిళ్లు తీస్తున్నా డు, మళ్లీ అక్కడే పెట్టేస్తున్నాడు. అతను తడబడుతుండడం చూసి తనే ర్యాకుల్లోం చి కావాల్సిన మందు సీసాలు తీసి టేబుల్ మీద పెట్టసాగింది మోహిని. బ్రిజ్‌నాథ్ మందును పెద్ద బాటిళ్లలోంచి, ఆమె తెచ్చిన బాటిళ్ళల్లోకి వంచసాగాడు. మందు వంచు తుంటే అతని చేతులు వణుకుతున్నాయి. ముఖంలో రంగులు మారుతున్నాయి.

"ఏమిటీ, నీకు జ్వరమా?" మోహిని అతని వాలకం చూసి అడిగింది.

"ఆఁ... అవును!" బ్రిజ్‌నాథ్ తలూ పుతూ చెప్పాడు. "నేను ఆరునెల్లుగా ఇదే జ్వరంతో తూలిపోతున్నాను" అంటూ బిత్త ర చూపులు చూసాడు. వెంటనే అతని చె య్యి పట్టుకుని పల్స్ చూసింది మోహిని. సుతిమెత్తని ఆమె చేతివేళ్లు అతని నరానికి తగిలేసరికి, అతడి ఒళ్ళు విద్యుత్తు తరం గాల ప్రకంపనతో వణికిపోయింది. ఊపిరి వేగం పెరిగింది. గుండె దడదడలాడుతోం ది. అప్పుడు తామిద్దరు డ్యూటీలో ఉన్నా మన్న విషయమే కాదు, తన ఎదురుగా ఉన్నది ఓ అగ్గిబరాటా అన్న విషయం కూడా మరిచాడు బ్రిజ్‌నాథ్. తన పల్స్ పరీక్షిస్తున్న మోహినీ చేతిని తన కుడిచేత్తో గట్టిగా పట్టుకుని, గబుక్కున తనవైపుకు లాక్కున్నాడు. ఆమె యవ్వన సిరులు అత ని ఎదని తాకాయి. ఆ దెబ్బకి ఇద్దరి గుం డెలు ఝల్లుమన్నాయి. మోహిని ఉలిక్కి పడి, ఒక్క ఉదుటున వెనక్కి జరిగింది.

"రాస్కెల్!" ఆమె గుడ్లు ఉరుముతూ గర్జించింది. "ఎంత ధైర్యం నీకు? ఉండు, అందరి ముందు నీ దుమ్ము దులుపుతాను. నన్ను నువ్వేం అనుకున్నావ్...? నీ అంతు చూస్తాను"

బ్రిజ్‌నాథ్ గజగజ వణికిపోయాడు. నోరు మెదపలేకపోయాడు. ఒక విధంగా బ్రిజ్‌నాథ్ బతికిపోయాడు ఆ సమయంలో అక్కడ ఇంకెవరూ లేకపోవడంతో. వెంటనే ఏం చేయాలో ఆమెకు తోచలేదు. ఎవరైనా ఉండి ఉంటే అప్పుడే అతని మీద విరుచు



కుపడేది. అయినా ఆమె ఉగ్రరూపం చూసి బ్రజ్‌నాథ్ భయపడిపోయాడు. చేతులు జోడించి మన్నించమని వేడుకోసాగాడు.

"తప్పయిపోయింది. నాకేమయిందో నాకే అర్థం కావడంలేదు. నాకు నీమీద ప్రేమ ఏర్పడింది. ఆర్నెల్లుగా ఇదే ప్రేమాగ్నిలో దహించుకుపోతున్నాను. నీకు ఎన్నో

సార్లు చెప్పాలని, చెప్పలేకపోయాను. నా మీద ఒట్టేసి చెబుతున్నాను. ఇంకెప్పుడూ ఇలా ప్రవర్తించను. నీజోలికి రాను. నిన్ను మరిచిపోయే ప్రయత్నం చేస్తాను. దయ చేసి అల్లరి పెట్టకు"

"మీ మగబుద్ధే ఇంతా! అందితే జుత్తు, అందకపోతే కాళ్లు. ఆడది ఒంటరిగా కనిపిస్తే చాలు, ఆగడాలకు అంతుండదు..." మోహినీ ఇంకా ఎన్నో మాటలు అనేదే, కానీ అంతలోనే మరో కంపౌండర్ స్టోర్ రూంలోకి రావడంతో, కోపాన్ని దిగమింగుతూ బయటికెళ్ళింది. బ్రిజ్ నాథ్ బిక్క మొహంపెట్టి దిగాలుపడిపోయాడు. 'ఆమె ఊరుకునే రకం ఏమికాదు. తప్పకుండా ఆర్.ఎం.ఓకి కంప్లైంట్ చేసి సస్పెండో, ఛార్జీషీటో ఇప్పించేదాక నిద్రపోదు'

బ్రిజ్ నాథ్ భయపడుతున్నట్టుగానే మోహిని ఆవేశంతో చిందులు తొక్కుతూ,

**అనువాదం :**
**కర్నాటి నాగభూషణం**

ఆరెమ్వో ఆఫీసు గదివైపుకి నడిచింది.

వెంటనే ఫిర్యాదు చేసి బ్రిజ్ నాథ్ ని సస్పెండ్ చేయించాలని నిశ్చయించుకుంది. ఆర్.ఎం.ఓ. ఆఫీసు గదిలోనే ఉన్నారు. కిటికీ తెరలగుండా లైట్ వెలుగు కనిపిస్తోంది. ఆర్.ఎం.ఓ.కి చెప్పాలన్న విషయాన్ని లోలోపలే మననం చేసుకుంది. ఆఫీసు గది చేరుకుంటూనే, డ్రెస్సును సరిచేసుకుని, తల వెంట్రుకల్ని సర్దుకుంది. మెల్లిగా వెళ్లి డోర్ కర్టెన్ కొద్దిగా తొలగించి లోపలికి తొంగి చూసింది.

ఆ ఆఫీసు గదిలో కంటబడ్డ దృశ్యానికి ఆమె తలమీద పిడుగు పడ్డట్టు ఒక్కసారిగా బిగుసుకుపోయింది. చెప్పాలనుకున్న విషయం మరిచిపోయింది. తన కాళ్లు చచ్చుబడిపోయినట్టు నిస్తేజమైపోయాయి. గుండె దడదడ కొట్టుకోసాగింది. ఆమె కళ్లు నులుముకుంటూ పదేపదే ఆఫీసు గదిలోకే చూసింది. తను ఆదర్శంగా భావిస్తున్న మేట్రీన్, ఆర్.ఎం.ఓ. ఒళ్ళో వాలిపోయి ఏదో విషయంలో కాకా పడుతోంది. గడ్డం పుచ్చుకొని బతిమాలుతోంది. ఆయన అదే అదునుగా తీసుకుని, ఆమెను మరింత గట్టిగా అదుముకుంటూ, ఎగిసి పడుతున్న ఆమె గుండెల్ని తడమసాగాడు. ఆనక ఒక చేతితో ఆమె తలను పైకెత్తి ఆమె పెదవులపై తన పెదవులానించాడు. ఇహపోతే దొరకదన్నంత ఆత్రంగా ఆయన మేట్రీన్ పెదవుల్ని, చెంపల్ని, మెడని ముద్దెట్టుకుంటుంటే, మోహినీ ఒళ్ళంతా జలదరించింది. ఆమె నరనరాల్లో ఏదో ప్రకంపన మొదలయింది. తనువులోని అణువణువునా చైతన్య స్రవంతి ఉప్పొంగింది.

మోహిని కళ్లు బైర్లు కమ్ముతున్నట్టు అనిపించి, డోర్ కర్టెన్ని వదిలేసింది. భూమిలో కురుకుపోయినట్టు, నిస్తేజమైన కాళ్లల్లోకి శక్తినంతా కూడగట్టుకుని మెల్లిగా వెనుదిరిగింది. ఇంతకు ముందు కంటపడ్డ దృశ్యం ఆమె ఇంకా నమ్మలేకపోతుంది. కానీ అది కలకాదు. వాస్తవం. కళ్లకు కట్టిన నగ్నసత్యం. ఆమె భారంగా అడుగులు వేస్తుండగా అదే దృశ్యం మళ్లీ కళ్లముందు మెదిలింది. ఆరెమ్వో, మేట్రీన్ని గాఢంగా ముద్దాడుతుండగా, ఆ ముద్దుల వర్షం తన మీదనే కురుస్తున్నట్టుగా ఆమె పెదవుల్లో, చెంపల్లో ప్రకంపన మొదలయింది. ఎక్కడో దూరంగా బాజా బజంత్రీలు మోగుతున్నట్టు శ్రావ్యంగా వాయిద్య ధ్వనులు వినిపించాయి. వర్షించే మేఘం కోసం దిక్కులు చూసే మయూరిలా మోహినీ ఆకాశం కేసి చూసింది.

ఏదో మైకం కమ్మిన దానిలా తడబడుతూ అడుగులు వేస్తూ, వచ్చిన దారి గుండానే మళ్లీ స్టోర్ రూంవైపు నడిచింది. వెనకా ముందు ఎటూ తిరిగి చూడకుండా

స్టోర్ రూంలోకి దూరింది.

బ్రజ్‌నాథ్ నెత్తికి చేతులు పెట్టుకుని, ఇంతకు ముందు జరిగిన తన తొందరపాటుకి చింతిస్తున్నాడు. మోహినీ నేరుగా అతన్ని సమీపించి, భుజమ్మీద చెయ్యివేసే సరికి ఉలిక్కి పడ్డాడు. మోహినీని చూసి నిలువునా వణికిపోయాడు. అతనికి ముచ్చెమటలు పోశాయి.

మొట్ట మొదటిసారిగా మోహినీ బ్రజ్‌నాథ్ కళ్లలోకి మత్తుగా చూసింది. నిషా కళ్లతో చూసింది. అతను మాత్రం ఆమె కళ్ళలోకి కళ్లుపెట్టి చూడలేకపోయాడు.

"నన్ను మన్నించు మోహినీ. మళ్లీ ఎప్పుడు అలా ప్రవర్తించను" అతను మళ్లీ చేతులు జోడించి వేడుకున్నాడు.

మోహిని ఫక్కున పగలబడి నవ్వింది.

"ఏమిటి, నామీద ప్రేమాగ్ని అప్పుడే చల్లారిందా? "

బ్రజ్‌నాథ్ ఆమె ప్రశ్నలోని ఉద్దేశం అర్థం చేసుకోలేక పోయాడు. ఏదో గొడవ చేయడానికే వచ్చినట్టుందనుకొని జంకుతున్నాడు. బ్రజ్‌నాథ్ చొక్కా బొత్తం నుంచి గుండీ విడిపోయి, అతని గుండె దడదడకి ఛాతీ మీది వెంట్రుకలు కదులుతూ కనిపించాయి. మోహినీ దృష్టి ఆ వెంట్రుకల మీద పడింది. ఆమె నిస్సంకోచంగా అతనికి మరింత దగ్గరగా వచ్చి చొక్కా బొత్తం పెడుతూ అంది- "ఆరునెల్లుగా నా ప్రేమాగ్నిలో దహించుకుపోతున్నాననే కదూ, నువ్వన్నది...? "

"తప్పయిందన్నానుగా, మళ్లీ అదే మాట దెప్పి పొడుస్తున్నావు? "

"దెప్పిపొడవడం లేదు. కన్ఫాం చేసుకుంటున్నాను. నిజంగా నా మీద ప్రేమ ఉంటే పెళ్లి చేసుకుందామనుకుంటున్నాను"

బ్రజ్‌నాథ్ అవాక్కయిపోయి, ఆలోచిస్తున్నాడు. ఇందులో ఏదో తిరకాసు ఉన్నట్టుంది. నన్ను పరీక్షించడానికి అంటుందేమోనని మిన్నకుండిపోయాడు.

అతని ముఖంలోని భయం చూసి మోహినీ మళ్లీ అదే అభిప్రాయాన్ని వ్యక్తం చేసింది. బ్రజ్‌నాథ్‌కు అప్పుడు ధైర్యం వచ్చి ఒక్కసారిగా ఉలిక్కిపడుతూ అరిచాడు- "నిజమా? నామీదొట్టు? "

మోహినీ సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ అంగీకారంగా తలూపింది- బ్రజ్‌నాథ్ అంతరంగంలో ఎన్నాళ్లుగానో దాగి ఉన్న పశుత్వం ఒక్క పెట్టున విజృంభించింది. అతని అణువణువూ పులకించింది. తన రెండు చేతులతో ఆమె నడుమును చుట్టేసి, గట్టిగా వాటేసుకున్నాడు. ఇంతవరకు ఎవ్వరూ తాకని ఆమె పెదవుల్ని, ఆమె ఎర్ర బుగ్గల్ని, మెడని ఎక్కడబడితే అక్కడ ముద్దాడేస్తున్నాడు. ఆ ఉధృతికి రూంలోని ర్యాకులన్నీ ఊగిపోతున్నాయి. మందు సీసాలు ఒకదానికొకటి తగిలి కొట్టుకుంటున్నాయి.

"సిగ్గుమాలినోళ్లు, బరితెగించి పోయారు..." అప్పుడే పెద్ద పెట్టున అరుపు వినిపించి, చటుక్కున ఆమెను వదిలేసాడు, బ్రజ్‌నాథ్. ఆరెమ్వో స్టోర్ రూంలోకి వస్తూ బండబూతులు తిడుతున్నాడు. ఆయన వెనకాలే మేట్రిన్ కూడా వచ్చింది. ఆమె మోహినీ కేసి చూస్తూ ముఖమంతా జేవురించుకుంటూ గద్దించింది.

"మీరు ఇక్కడికి ఉద్యోగం చేయడానికి వచ్చారా? ప్రేమకలాపాల్లో మునగడానికా? మీలాంటి వాళ్లతోనే ఉద్యోగస్థులు అపఖ్యాతి పాలవుతున్నారు. మంచి వాళ్లక్కూడా అపనిందలు వస్తున్నాయి... సార్, సూపరింటెండెంట్‌గారికి చెప్పి వీళ్ళిద్దర్ని సస్పెండ్ చేయించండి" ఆరెమ్వో వంక చూస్తూ చెప్పింది, మేట్రిన్.

"మేడం, మా గురించే కాదు, మీ గురించి చెప్పుకోండి. ఇంతకు ముందు ఆఫీసు రూంలో మీ ఇద్దరి నిర్వాకం చూసే నేను ప్రభావితం అయ్యాను. ఇదంతా మీ పుణ్యమే!" ... తను కూడా ఎదురు దాడికి సిద్ధంగా ఉన్నట్టు హెచ్చరించింది తేనెటీగ. V

**బీహారీ కథ** **- సోహేల్ అజీమాబాదీ**

# ఆకలి

ఆకలికి రాము కడుపులో పేగులు అరుస్తున్నాయి. ఒంట్లో గడబిడ మొదలైంది. 'ఇప్పుడేం చేయాలి? ' ఇదే అతని ఆలోచన. ఎంతకాలమని ఇలా ఆకలితో నకనకలాడటం. నాల్గురోజులు గడిచాయి. ఇది అయిదో రోజు. మూడురోజులుగా పని కోసం వెతుకుతున్నాడు. కానీ దొరకలేదు. ఇప్పుడు తెల్లార్తూనే పనెక్కడ దొరుకుతుంది? ఒకవేళ దొరికినా ఖాళీ కడుపుతో ఎలా చేయాలి? 'అన్నం ఎక్కడ దొరుకుతుంది? ' ఇదే అతడి బుర్రలో తిరుగుతోంది. ఒక్కటే కోరిక 'ఎలాగైనా పొట్ట నిండా తిండి తినాలి. ఉదయం కూడా ఏ పనీ దొరక్కపోతే ఎక్కడైనా దొంగతనం చేసైనా, ముష్టి ఎత్తుకుని అయినా ఆహారం సంపాదించుకోవాలి. మున్సిపాలిటీ చెత్త డబ్బాలు వెతకాలి....'ఇవే ఆలోచనలు!

ఆ రోజు రేపటికి తప్పక పని దొరుకుతుంది అనే ఆశ రాములో పొటమరించింది. పోయిన శక్తి తిరిగి వచ్చినట్లయింది. ఆ మర్నాటి గూర్చి ఆలోచించసాగాడు. 'ఇక్కడికి బోలెడంతమంది స్త్రీలు కూరలు కొంటానికి వస్తారు. వారి బరువు మోస్తాను. అక్కణ్నుంచి మార్కెట్ కెళ్తాను. అక్కడికెంతోమంది స్త్రీ, పురుషులు పండ్లు, కూరలు కొంటానికొస్తారు. అలా కొంత కూలీ డబ్బు దొరికితే హాయిగా పొట్టనిండా తినొచ్చు. దేవుడు ఎంతో మంచివాడైతే నన్నెందుకు ఆకల్తో చంపుతున్నాడు? ' ఇదీ అతని ఆలోచన.

కాసేపట్లో మళ్లీ అతని ఆకలి నిద్ర లేచింది. అతన్ని ఉక్కిరి బిక్కిరి చేస్తోంది. మర్నాటిపై పెంచుకున్న ఆశలు నెమ్మది నెమ్మదిగా కరిగిపోసాగాయి. రోజంతా ట్యాప్ నీరు తాగి తాగి పొట్ట ఉబ్బుతోందే కానీ, ఆకలి తీరట్లేదు. రోజుల తరబడి ఉపవాసం ఉండటం తనవల్ల కావటంలేదు. మనసులో అనుకుంటున్నాడు. 'దేవుడు శుద్ధమైనవాడే. ఎవరిపై జులుం చేయడు. ప్రపంచంలో మనుషులు రకరకాల వారుంటారు. కానీ నిరాశ పడాల్సిన పని లేదు. తెల్లారుతుందిగా చూద్దాం...' అతను తన చోటులోంచి లేచి నీటి నల్లా వైపు వెళ్ళి కడుపునిండా నీరు తాగుదామనుకున్న అతని ఆశ నిరాశే అయింది. నల్లాలోంచి నీరు రావటంలేదు. తల తిరిగినంత పనై అలా కూచుండిపోయాడు.

రాము కాసేపలా కూచుని ఆలోచనలో పడ్డాడు. గుండెలో ఏదో గుబులు, ఇంతవరకెన్నడూ లేనిది! ఈ కడుపు మాడ్చేయడం ఎన్నాళ్లు? ఎన్నాళ్ళు ఫుట్‌పాత్‌పై పడి ఉండటం? 'ఇక ఈ వెధవ జీవితం చాలు. రేపట్నుంచీ క్రొత్త జీవితం ఆరంభిస్తా' అలా సర్దిచెప్పుకుంటూ ముందుకి సాగాడతను. రేపూ ఇదే పరిస్థితి అయితే, 'జై మా' అంటూ గంగలో దూకాలనుకున్నాడు. ఉద్యోగం ఎక్కడ దొరుకుతుంది? కూలీ దొరకడం కూడా అసాధ్యంగా ఉందే! రోజూ వెతుకుతూనే ఉన్నాడు, తిరుగుతున్నాడు కానీ ఫలితం శూన్యం.

ఎన్నో విషయాలు, తర్కవితర్కాలు బుర్రని తొలుస్తున్నాయి. నేలపై దాణా



చూసి పావురాళ్ళు కింద వాలతాయి. ఒకే సారి తిని మళ్ళీ పైకి లేస్తాయి. అంతే, తళుక్కున ఓ ఆలోచన మెదిలింది. ఇదే ఆఖరు ప్రయత్నం సుమా ఆకలి అతడ్ని రెచ్చగొడుతుంది. మనసు ఏమో 'తప్పు' అని హెచ్చరిస్తోంది. హూ... శిక్ష. చచ్చాక గూడా శిక్ష. కానీ తనకి ఈ పని చేస్తే తప్ప ముక్తి లేదు. ఆత్మారాముడు శాంతించడు. అంతరాత్మకు, బుద్ధికి మధ్య ఘర్షణ మొదలైంది. బుద్ధి గెల్చింది. ఆత్మ ఓడింది. దొంగతనం చేయాలని నిశ్చయిం చుకున్నాడు. దొంగతనం చేసి పట్టుబ డకుండా ఉంటే కొన్నాళ్ళు తిండీ తిప్పలకు లోటుండదు. ఒకవేళ పట్టుబడ్తే, పోలీ సులు నాల్గు అంటించినా తిండి పడే స్తారు. జైల్లో తిండి, కంబళి దొరుకు



తాయి. నవ్వొచ్చిందతనికి 'తిండి దొరుకుతుంది సరే, పట్టుబడ్డే సిగ్గు, మానమర్యాదలు మంట కలుస్తాయి గదా? జైలు నుంచి విడుదలైనాక మళ్ళీ జనం మొహం ఎలా చూడటం? జైల్లో కూచుంటే బైటి ప్రపంచం, ఈ పట్టణం, బజార్లు ఇవన్నీ కన్పడవే. పోన్లే పొట్టనిండా తిండి దొరుకుతుంది చాలు'

దొంగతనం చేయడానికే నిశ్చయించుకుని ఆకలి అన్నమాటనే మర్చిపోయి, కలల్లో రూపాయిల కట్టల్నే చూడసాగాడతను. చెవిలో డబ్బుల గలగలలు! గాలిలో మేడలు కట్టసాగాడు. దొంగతనం చేసిన తర్వాత, బాగా సరుకులు కొని అమ్మే వ్యాపారం, ముసలి తల్లిని చూసుకోవటం, జనం తనని గౌరవించటం, పెళ్లి చేసుకోవడం అన్నీ గేవా కలర్స్‌లో కన్పడుతున్నాయి. బీదరికం వలనే అతనికింకా పెళ్లికాలేదు. డబ్బు ఉంటే ఎవరైనాసరే పిల్లనిస్తారు. పెళ్లి అని తల్చుకోగానే రాము గుండె ఆనందంతో తుళ్లిపడసాగింది. అతని కళ్లల్లో ఓ అందమైన స్త్రీమూర్తి కన్పడింది. ఆమె కారులో వెళ్తుండగా చూశాడు ఈ సాయంత్రమే. పనిచేసి అలసిసొలసి ఇంటికొచ్చిన తనకు భార్య కమ్మని వంటకాలు తినిపిస్తుంది. మళ్లీ ఆకల్తో పేగులు నకనకలాడసాగాయి. దొంగతనం చేయాలనే తలంపు మళ్లీ మదిలోకి వచ్చింది. నలువైపులా దృష్టి సారించాడతను.

అంతటా ఎత్తైన బంగ్లాలు, కరెంటు దీపాల వెలుగులు. ఎవరింట్లోనూ దూరే వీలేలేదు. అయితే దొంగతనం చేయడానికి ఆ పట్టణానికి చివరనఉన్న చిన్న చిన్న

బంగ్లాలు అనువుగా ఉంటాయి. అవి బుల్లి కాంపౌండ్ వాల్స్‌తో ఉంటాయి. బాటకిరు వైపులా పెద్దచెట్లు, దొంగతనం చేసి చాలా తేలిగ్గా పారిపోవచ్చు. కాస్త చీకటి కూడా ఉంటుంది. బాగా ఆలోచించాక అటువైపు మళ్లాడు. అర్ధరాత్రి రెండు గంటలైనట్లు ఎక్కడో గడియారం చప్పుడు. వేగంగా అడుగులేయసాగాడు. మరి ఆ బంగ్లాల్లో కుక్కలుంటే? ధైర్యం జావకారసాగింది. అమ్మో! తను ఆ కాంపౌండ్‌లోకి దూకగానే కుక్కలు పట్టి పీకేస్తే? కానీ ఆకలి సుళ్లు తిరుగుతోంటే ఆలోచించసాగాడు. బంగ్లాలోకెళ్తే తింటానికి ఏమీ ఉండదేమో? గొప్పోళ్లు పాచివి ఉంచరుగా? ఆ హల్వా దుకాణంలోకెళ్తే ఏదన్నా దొరకొచ్చు. మరి ఏ దుకాణంలో దూరాలి? ఆలోచించగా ఓ షాపు గుర్తుకొచ్చింది. ఆ షాపు ఊరి చివరగా జనం చాలా పలుచగా ఉన్న చోట ఉంది. అందుకే అటువైపు వెళ్లాడు.

'చప్పుడు కాకుండా ఎలా షాపులోకి ప్రవేశించాలి? అల్మారా తీసి తినే వస్తువుల్ని ఎలా కాజేయాలి? డబ్బులెలా దొంగిలించాలి? " ఇవే ప్రస్తుతం అతనిలోని ఆలోచనలు. అదే సమయంలో దొంగతనం చేయాలంటే భయంవేసింది. తనలో తానే 'అబ్బ, దొంగతనం చేయొద్దు. అమ్మో పట్టుబడ్తే? ఎవరన్నా దొంగని అడగాలి కొన్ని చిట్కాలు, గుట్టుమట్లు' అనుకున్నాడు. రెండు కుక్కలు అతన్ని చూసి మొరగసాగాయి. 'అరె! అవి దొంగల్ని చూసి కదా మొరుగుతాయి? ' అనుకుంటూ వాటికి దూరంగా జరిగాడు. కొంచెం ముందుకు పోగానే ఫుట్‌పాత్‌పై పేకాడుతున్న నలుగురు వ్యక్తులు కన్పించారు. రాము వాళ్ల పక్కనుంచే వెళ్లినా వారు గమనించలేదు.

రాము ఇంకా ముందుకెళ్లసాగాడు. ఓ వ్యక్తి ఫుట్‌పాత్‌పై హాయిగా పాడుతున్నాడు, 'నా గుండె ఇంకా ఆరలేదు, ఆరె హా... హా...' రాము అతన్ని సమీపించి, భయపడ్డాడు. వాడింకా పాడ్తూనే

మార్, తెనాలి, 78. వి.ఆర్. జయలక్ష్మి, కరీంనగర్, 79. కొత్తపల్లి స్వరలయ, చీరాల, 80. గరికిపాటి ఇందిరాతుషార, కాకినాడ, 81. చాట్ల విజయకృష్ణ, కామారెడ్డి, 82. గరికిపాటి సూర్యశ్రీ, కాకినాడ, 83. ముద్దుగుత్తుల తులసిదాస్, 84. జి. యశోలత,కావలి, 85. శిష్టా రవికిరణ్, విజయవాడ, 85. షేక్ నజీర్ బాషా, కోట, నెల్లూరు జిల్లా, 86. పి. చంద్రశేఖర్, కరీంనగర్, 87. వి.ఆర్.వంశీకృష్ణ, రాయచోటి, 88. మంచాళ శ్రీలక్ష్మి, వైజాగ్, 89. ఆంద్ర అచ్యుతరామయ్య, తణుకు, 90. పి. సురేఖ, మహారాష్ట్ర, 91. గుర్రపు పురుషోత్తము, హనుమకొండ, 92. టి.కె. లక్ష్మి, ఆత్రేయపురం, తూ.గో.జిల్లా, 93. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, 94. యు.యు.యు. ఎమ్మిగనూరు, 95. ఆర్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 96. బి. భానుమతి, శ్రీకాకుళం, 97. కె. విష్ణుచందన్, కావలి, 98. వల్లభ సైమన్, మచిలీపట్నం, 99. సి.కె. శాస్త్రి, గుంటూరు, 100. చి.పు. శాస్త్రి, నిజాంబాద్, 101. కె. మోహన్, బెంగళూరు, 102. సిహెచ్. శారద,కొల్లిపర, గుంటూరు జిల్లా, 103. పప్పు శ్రీదేవి, అమలాపురం, 104. సౌదామిని నాగరాజన్, విశాఖపట్నం, 105. దేవరాజు వెంకటనరసింహారావు, చైతన్యపురి, 106. గండ్లూరి బలరామ శాస్త్రి, నాచారం, 107. పక్కి సుందరీకృష్ణ, గరివిడి, విజయనగరం జిల్లా, 108. సిరివెల్లి ఆదిత్య, కర్నూలు, 109. తువ్వా మాధవ మోహన్‌రెడ్డి, కర్నూలు, 110. డి. మహేంద్ర, దుబ్బారపల్లి, అనంతపురం జిల్లా, 111. గెడ్డం రామస్వామి, వీరవరం, తూ.గో. జిల్లా, 112. కె.వి.యస్.యన్. మూర్తి, సాలగ్రామపురం, విశాఖ జిల్లా, 113. సరిపల్లి నాగభూషణరావు, విజయనగరం, 114. ఎ.వి. రామకృష్ణ, కాట్రేనికోన, తూ.గో. జిల్లా, 115. పి.ఎస్. సుశీలమ్మ, కొత్తచెరువు, అనంతపురం జిల్లా, 116. ఇయ్యాణ్ణి రోహిణి, తాడేపల్లిగూడెం, 117. కాకర్లమూడి కృష్ణప్రసాద్, తణుకు, 118. పి. లక్ష్మీప్రసన్న, మెహదీపట్నం, 119. వి. రంగనాయకి, అనంతపూర్, 120. ఎ.వి. శివారెడ్డి, ఎర్రగుంట్ల, కడప జిల్లా, 121. శీరం నారాయణస్వామి, ఆనంద్‌బాగ్, 123. సిహెచ్.ఎస్. రామచంద్రమూర్తి, తాడేపల్లి, గుంటూరు జిల్లా, 124. యం. హరిణీ సాయి, కర్నూలు, 125. చెరువు లక్ష్మీనారాయణశర్మ, రాజమండ్రి, 126. ధప్పూరి శ్రీధరాచార్యులు, సీతారాంబాగ్, 127. తోటపల్లి శశికళాధర్, గుంతకల్లు.

## ఎటు నుంచి చూసినా..



పూట గడవని పాస్టర్ తన భార్య పదిహేనువేల రూపాయల చీర కొన్నదని తెలిసి అగ్గి మీద గుగ్గిలమయ్యాడు.

"మన పరిస్థితి తెలిసి కూడా ఇలా ఎలా చేయగలిగావు? "

"నేను నడుస్తున్నానండీ, షాపు అద్దంలోంచి ఇది కనపడింది. వెంటనే సైతాను నా చెవిలో 'ఈ చీర నీకు బాగుంటుంది, కొనెయ్' అన్నాడు"

"తుచ్ఛమైన కోరికల నుంచి విముక్తి కోసం 'వెనక్కి మరలు సైతాన్' అనాలని తెలుసుగా"

"చెప్పానండీ. కానీ 'వెనకనుంచి కూడా బాగుంది' అన్నాడు"

ఉన్నాడు. 'నీ కళ్లలో మదిర నిండి ఉందీ' రాముా కూడా పాడాలనుకున్నాడు. కానీ ఏదో గొణుగుతూ ఉండిపోయాడు. కాళ్లకు ఏదో తగిలి పడబోయాడు. కిందకు చూస్తే దారికి అడ్డంగా పడుకున్న ఓ మనిషి కనిపించాడు. వాడ్ని క్షమాపణ అడిగి మాటా

అనువాదం : **అచ్యుతుని రాజ్యశ్రీ**

మంతీ కలిపాడు.

"నువ్వెవరు? " అని రాముకో బీడీ ముక్క ఇస్తూ అతడడిగాడు. అతడికి సమాధానం చెప్తూ బీడీ నోట్లో పెట్టుకుని గట్టిగా దమ్ములాగాడు రాము. తల గిర్రున తిరగసాగింది. అంతే తలపట్టుకు కూలబడ్డాడు. కాస్త తేరుకోగానే, లేచి ముందుకు సాగాడు. కళ్ల ముందు హల్వా షాపు కనబడ్తోంది. నోట్లో నీరూరింది. అక్కడున్న రెండంతస్తుల భవనం వెలుగులో ఓ స్త్రీ, పురుషుడు కన్పడ్డారు. 'అబ్బా! నాకూ ఇలాంటి బిల్డింగు, భార్య ఉంటే ఎంత బాగుండు? '

ఆలోచనలతో సాగిపోతూనే ఉన్నాడు.

ఆ సందు మొదట్లో ఓ కారు ఆగి ఉంది. ఓ వ్యక్తి కారును బలంగా తోయసాగాడు. స్త్రీ నించుని ఉంది. ఆకల్తో నీరసంతో రాము అడుగులు వేయలేకపోతున్నాడు. ఆ వ్యక్తి "ఏమోయ్! కాస్త వెనకనించి కారుని తోయి. నీకు బహుమతిస్తా..." అని అడిగాడు. రాముకు మాట్లాడకుండా 'ఆ స్త్రీని ఎక్కడో చూసినట్లుందే...'అని ఆమెను గుర్తుకు తెచ్చుకోవడానికి ప్రయత్నించసాగాడు.

"ఏం రా! విన్పడటం లేదా? తోయరా కారుని, బహుమతి వద్దా? "

బహుమతి అనే పదం అమృతపు సోనలా అనిపించింది. "ఎంత? "

"ఎంతనా? ఓ రెండ్రూపాయలు!"

రాము రక్తం మరగసాగింది. కానీ ఆకలి ఎంతకైనా తెగించగలదు, నోర్మూసుకుని పడుండగలదు. శక్తి అంతా ఓడ్చి తోసినా అది అంగుళం కూడా కదలందే! అలసి నించున్నాడు. కానీ, రెండురూపాయలపై ఆశతో మళ్లీ తోయసాగాడు.

"ఏం రా, సాలే! ఎంత కావాలిరా నీకు? " అంటూ అతనూ తోయటం, సర్ణ అది కదలటంతో, రాము చేతిలో ఏమీ విదల్చకుండానే ఆ వ్యక్తి ఆ స్త్రీతో సహా కారులో మాయమైనాడు.

రాము చేసేదేంలేక ముందుకి బలవంతంగా అడుగేయసాగాడు. ఎలాగైతేనేం? హల్వా దుకాణం దగ్గరకు చేరాడు. షాపు మూసుంది. పొడవాటి బెంచీపై ఓ మనిషి గాఢనిద్రలో మునిగి ఉన్నాడు. గురక పెడ్తున్నాడు. రాము ధైర్యం దిగజారసాగింది. ఆలోచన కూడా మారింది. ఛీ దొంగతనం చెడ్డపని. అతన్ని లేపి కాస్త హల్వా పెట్టమని అడిగితే? గొప్పవాడైతే తనని ఛీత్కరిస్తాడు. కానీ ఆ మనిషి బాగా తాగేసి పడుకున్నాడు. ఇప్పుడతడ్ని లేపితే తనని చితకబాదటం ఖాయం. అందుకే ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

'అతడు తాగి ఉన్న కారణంగా ఇక తను ధైర్యంగా దొంగతనం చేయవచ్చు' అనుకుని రాము షాపుపైకెక్కాడు. ఇదివరకు ఒకటి రెండుసార్లు ఆ షాపుకి అతను వెళ్లాడు. అందుకే ఎక్కడ ఏ వస్తువుందో తెలుసు. చీకటిగా ఉన్నా అల్మారా దాకా వెళ్లగలిగాడు. దానిపై చేయివేశాడో లేదో లోపలి కిటికీ తెరుచుకుంది. ఓ సన్నని కంఠం ఇలా అంది -

"జగన్! తలుపు ఇక్కడుంది" రాము శరీరంలోని రక్తమంతా నీరుగా మారింది. నిశబ్దంగా నిలబడ్డాడు బొమ్మలా. మళ్లీ అదే కంఠం "జగన్! నీవన్నీ చెడ్డ అలవాట్లే. ఇంత ఆలస్యం చేస్తావా? అర్ధరాత్రి రెండు దాటింది. బట్టీనుంచి నువ్వు ఇప్పుడొస్తున్నావా? "

రాము కదిలితే ఒట్టు.

ఒళ్లంతా వణుకు... తిరిగి ఆమె అంటోంది, "అరె, ఇటువైపు రావేంటి? నేనింక నీకు డబ్బివ్వను తెల్సా? " అని అంటూ తలుపు వెనకనించి వచ్చి అతని చేయి పట్టుకుని లోపలికి ఈడ్చుకెళ్లింది. అతనికిప్పుడు అర్థమైంది. ఆ స్త్రీ ఎవరికోసమో ఎదురుచూస్తోంది. కానీ అతను ఆమెను మోసం చేశాడన్నమాట! ఆ ముసలి హల్వావాడు, ఈ యవ్వని మొగుడు పెళ్లాలన్నమాట! గదిలోకెళ్లాడేగానీ భయంతో వణుకుతున్నాడు. ఆమె తనని గుర్తిస్తే! ఆమె అతన్ని మంచంపై కూలేసింది.

"చూడు నేను నీకింక పైసా ఇవ్వను. తాగి తాగి పిచ్చివాడివవుతున్నావు..." అతని మెడలో బాహువులు వేసి తనవైపు తమకంగా లాక్కుంది. అతని ఒళ్లో తలపెట్టుకుని అంది, "మాకు డబ్బెక్కువ దొరకదు. అందుకే తక్కువ డబ్బిచ్చాను"

రాముకి ఆమె కథంతా అర్థమైపోయింది. ముసలాడు మహా పిసినారి. ఇంట్లో గుడ్డిదీపం కూడా లేదు. వాడి పిసినారితనం తనకెంతో లాభించింది. 'ఇప్పటిదాకా నడిచి నడిచి అలసిపోయాను. కాస్త

# విపుల వినోదిని

## ఫిబ్రవరి విపుల చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. కృష్ణరాజు భార్య పేరు?
జ:
2. అబన్ దస్తూర్‌కి వచ్చిన వ్యాధి?
జ:
3. సెల్‌ఫోన్ సుందరి పేరు?
జ:
4. నిశి, శశితో ఎంత మొత్తం పందెం కట్టింది?
జ:
5. వినీల్ ఎవర్ని పెళ్ళి చేసుకున్నాడు?
జ:
6. 'సంధి' కథ మూల రచయిత పేరు?
జ:
7. సామూహిక వివాహాలు ఎక్కడ జరిగాయి?
జ:
8. శతాదల్ మాజీ భార్య పేరు?
జ:
9. నిఖిల్‌కి వచ్చిన వ్యాధి?
జ:
10. ట్రక్‌డ్రైవర్‌ని లిఫ్ట్ అడిగిందెవరు?
జ:

పంపినవారి పేరు: ---------------------------------వయసు ( )

చిరునామా: ------------------------------------------------------

పిన్‌కోడ్ : ఫోన్ నెం :

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 18

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

తింటానికి దొరకొచ్చు నాకు. హాయిగా అమ్మాయి కూడా దొరికింది' అనుకున్నాడు. అంతే అతని గుండెలో ఏదో అలజడి! కానీ మనసు మాత్రం హల్వా అల్మారా పైనే ఉంది. ఆకలి మాత్రం దంచేస్తోంది. అతను ఆ చీకట్లో కళ్లు చిట్లించుకుంటూ ఆ గదిని పరిశీలనగా చూడసాగాడు. అక్కడ తింటానికేమీ లేవు.

అతనింకా నిషాలో ఉన్నాడనుకుని ఆమె ఇంకా మాట్లాడసాగింది. "అందుకే నిన్ను బాగా ఊటుగా తాగవద్దంటాను. వేయి సార్లు చెప్పు లక్షసార్లు చెప్పు, నీ మొండి పట్టు విడవవు. ఇలా రా…"

ఆ స్త్రీ అతన్ని తిరిగి తన వైపు లాక్కుంది. ఈసారి రాము ఆమె ఒడిలో తలపెట్టి మజా చేస్తున్నాడు. వేడి నిట్టూర్పులు వెల్వడసాగాయి. ఆమె వేడి ఊపిరి అతని చెంపల్ని తాకుతోంది. ఆమె అతనిపై వాలింది. అతని గుండె చెదురుతోంది. కానీ ఆకలి 'నన్ను మర్చిపోతావా?' అని హెచ్చరిస్తుంటే ఆమెపై మనసు పోవటంలేదు పూర్తిగా. హఠాత్తుగా ఆమెను మంచంపైకి తోసేసి లేచాడు, ముందు ఆహారం పడాలి పొట్టలో.

అతడు తన ప్రియుడే అనుకుంటోన్న ఆమె "ఈరోజు నీవు పూర్తిగా మారావు జగన్!" అంది. అతనేం మాట్లాడలేదు. గాలించసాగాడు. ఓ పళ్లెంలో పెట్టి ఉన్న లడ్డూలు అలమరలో కన్పడ్డాయి. అంతే రక్కున చేతిలోకి తీసుకుని తినసాగాడు.

ఆమె లేచి అతని చేతిలోని పళ్లాన్ని లాక్కుని "జగన్! లడ్డూలు లెక్కపెట్టి మరీ పెట్టాడు, తెలుసా?" అంది. రాముని తిరిగి మంచంపైకి తోసింది. అప్పటికే రెండు లడ్డూలు తిన్న అతను ఇంకా ఆకలిమీదున్నాడు. లడ్డూ పళ్లెం లాక్కుని ఇంకా రెండు లాగించాడు. ఆమె పళ్లెం తీసుకుని వేరే గదిలోకి వెళ్లబోతుండగా చేతికందినన్ని లడ్డూలు లాగేసి ఆమెను పడేసి గదిలోంచి పారిపోయాడతను.

# ఆతిథ్యం



ప్రతిరోజూ ఉద్యోగ బాధ్యతల్తో విసిగి వేసారిన భాస్కర్, రంజని ఈసారి వేసవి శెలవులకు విశాఖ ప్లాన్ చేశాడు. అన్నయ్య శ్రీధర్ కూడా ఆ మధ్య చాలాసార్లు రమ్మని ఫోన్ల మీద ఫోన్లు చేశాడు. గతసారి వెళ్ళినప్పుడు ఇద్దరికీ బట్టలు పెట్టి, పిల్లలకు మంచి బొమ్మలు కొనిచ్చాడు. మేము రాత్రిపడుకునేందుకు తన ఎ.సి. రూము కూడా ఇచ్చాడు.

ఆ మంచీమర్యాదలు నచ్చాయి కాబట్టే రెండేళ్ళ తర్వాత భాస్కర్, రంజనిలు విశాఖకు చేరారు. గోదావరి ఎక్స్‌ప్రెస్ దగ్గరకు కారు తీసుకొచ్చి రిసీవ్ చేసుకున్నాడు శ్రీధర్.

మరుసటి రోజు భాస్కర్, రంజని, వాళ్ళ



పిల్లలు పగలంతా కైలాసగిరి, ఆర్కే బీచ్, భీమిలి వగైరాలు చూసి ఇంటికి చేరుకున్నారు. చీకటి పడింది. ఇంట్లోని మూడు రూముల్లోనూ జీరో వాట్ బల్బులే వెలుగుతున్నాయి. శ్రీధర్ ఎ.సి. రూములో ఎ.సి. ప్లగ్ తీసేసి వుంది. ఎండాకాలం వల్ల ఉక్కపోత ఎక్కువగా ఉంది. అడుగుదామంటే మొహమాటంగా ఊరుకుంది రంజని.

ముసుగులో గుద్దులాట ఎందుకని శ్రీధరే "మరేం అనుకోకండి బావగారూ! మేడమీద చల్లగా ఉంటుంది పడుకుందాం. కరెంటు బిల్లులు గూబ గుయ్యిమనిపిస్తున్నాయి. నెల్లాళ్ళయ్యింది ఎ.సి. చెడిపోయి. వేసుకోకపోవడం వల్ల కంప్రెషరు జామయిపోయింది"

విషయం అర్థమైన భాస్కర్, రంజని టెర్రస్‌మీదే సరిపెట్టేసుకున్నారు! మారిన కాలంతో మారిన ఆతిథ్యం మరి! అని.

**– గుడిమెట్ల గోపాలకృష్ణ**
అరసవిల్లి, శ్రీకాకుళం



# నీడ

మాలతి ముదకవి

కన్నడ కథ

కళ్లు కంప్యూటర్ మానిటర్‌పైన, చేతి వేళ్లు కీ బోర్డుపైనా పనిచేస్తున్నా నందిని మనసు మాత్రం నిఖిల్ గురించిన ఆలోచనల్తో నిండిపోయింది. మూడేళ్ల తర్వాత ఈ రోజు ఉదయం అతణ్ని బస్సు స్టాప్ వద్ద కలుసుకోవడం జరిగింది.

"నీవు నిఖిల్‌వి కదూ..." అడిగింది అనుమానంగా. ఏదో అపరిచయస్థుడిలా చూశాడతను నందిని వైపు.

సిటీ బస్సు నిలవటం, స్టాప్ దగ్గరున్న వాళ్లనందర్నీ ఎక్కించుకు పోవటం జరిగి పోయింది, వీళ్లిద్దర్నీ వదిలేసి.

"నిఖిల్... నువ్వు నా ప్రేమనే మర్చిపో యావనుకున్నా యిన్నాళ్లూ, కాని ఈ వేళ నా ముఖాన్ని కూడా మర్చిపోయావ్, దుర దృష్టం కదూ"

'నందినీ నిన్ను మరచిపోయానని ఎవ రు చెప్పారు నీకు, ఈ నాటికీ నా హృద యంలో తిష్టవేసి వున్నావు పదిలంగా, అని తన మనసులోని మాటని చెప్పబోయి "ఓహో, నందిని నువ్వా? నా క్లాసుమే టువి కదూ. మూడు సంవత్సరాలు గడచి పోయాయి. అయినా మర్చిపోగలనా! చాలా కాలమయింది కదూ నిన్ను చూసి, పైగా నీవొకింత..." లావయ్యావన్నట్టు చేతుల్తో చూపిస్తూ, నవ్వాడు తర్వాత-

"ఎలా వున్నావ్ నందినీ? "

"ఇదో ఇలా నిక్షేపంగా వున్నా" అంటూ మెడలోని మాంగల్యాన్ని పైకి తీసుకుంది, దాన్ని సరిచేసుకునే నెపంతో నందిని.

నిఖిల్ కళ్లు దాన్ని గమనించీ, గమనిం చనట్టే వున్నా, మనసు మాత్రం కళవళ పడింది. నందిని పెదాల మీద సన్నని దరహాసమొకటి మెరసి మాయమయ్యింది, నిఖిల్ కలవరం తనకి తెల్సినట్టుగా.

ఇంతలోనే ఇంకో సిటీ బస్సు రావటం చూసి "నా బస్సు వచ్చేసింది. వస్తా... బై..." అంటూ నందిని బస్సెక్కంగానే, తానూ అదే బస్సెక్కి, నిఖిల్, "నందినీ నీకు ఈ రోజు సాయంకాలం టైం దొరుకు తుందా, ఓ అరగంట... అంతే" అన్నాడు. నిఖిల్ కోరికని తిరస్కరించాలని వున్నా, తెలియకుండానే "సరే"నని ఒప్పుకుంది.

"అక్కడికే, మనం గతంలో రోజూ మీట్ అయ్యేవాళ్లమే, అక్కడికి వస్తావు కదూ!" అంటూ నెక్స్ట్ స్టాపులో దిగివెళ్లిపోయాడు.

★ ★ ★

"నందూ ఏంటది? ఎందుకిలా కూర్చు న్నావ్ టైపు చేసిన ఉత్తరాన్ని ముందుంచు కుని? బాస్ కోపగించుకుంటున్నారు వెళ్లు!" అన్న మైనా మాటలు ఆమెని ఈ లోకంలోకి తెచ్చిపడేశాయి.

"ఏంటి సంగతి? " స్నేహితురాలు ప్రశ్నించింది.

"అబ్బే, ఏం లేదు" అంటూ నవ్వేసింది నందిని.

సాయంకాలమయ్యేసరికి మనసు కొట్టు మిట్టాడింది నిఖిల్‌ని కల్సుకునే విషయా న్ని తల్చుకుని. ఈ మనసుకి సిగ్గూ శరం లేదని తిట్టుకుంటూనే, ఎప్పుడూ వాళ్లిద్దరూ కల్సుకునే రెస్టారెంట్ వైపుకి యాంత్రికం గా కదిలింది నందిని. అప్పటికే నిఖిల్ అక్కడకు వచ్చి ఆమె కోసం ఎదురు చూస్తున్నాడు. టీ తాగేసి, ఆ రెస్టోరెంటుకి దగ్గరగా వున్న పార్కులో, నిర్జనంగా ఓ మూలనున్న సీమెంటు బెంచీపై కూర్చు



న్నారిద్దరూ. వాళ్లిద్దరి మధ్యా మౌనమే ఆవరించింది. పది పదిహేను నిమిషాలు గడచినా, ఎవ్వరూ ఇంకోరితో మాట్లాడ లేదు. సంభాషణ ఎలా ప్రారంభించాలో తెలీక సందిగ్ధంలో పడ్డారిద్దరూ.

మౌనాన్ని భగ్నం చేస్తూ నిఖిల్ ముందు గొంతు విప్పాడు. "నందినీ నేను నిన్ను మోసం చేశాను. అది క్షమించరానిది... కాని..."

అతని మాటల్లోని నిష్కల్మషం నందినిని కలవరపెట్టింది. కాని, నిఖిల్ తనను వదిలి వెళ్లిన తర్వాత తన పరిస్థితి, తాననుభవించిన అవమానం, దుఃఖం, యాతన, నిందలు... వీటన్నింటినీ తానెలా మర్చిపోగలదు! వాటిని తల్చుకున్నాక మరింత కాఠిన్యమయ్యింది మనస్సు.

"నిఖిల్.. నన్ను మోసం చేశావనే భావన నీకున్నందుకు సంతోషం. అదే చాలు నాకు" కోపంగా ధ్వనించింది ఆమె కంఠం.

"నందూ, ప్లీజ్, గతాన్ని మర్చిపో, ప్రస్తుతానికి వద్దాం. నీవెలా వున్నావ్! నీ పెళ్లెప్పుడు జరిగింది? "

"నువ్వు నన్ను వదలిపెట్టి వెళ్లాక. నువ్వింక తిరిగిరావని నీ స్నేహితుడు రమాకాంత్ వచ్చి చెప్పి వెళ్లాక"

'నందిని, ఒత్తి, ఒత్తి పలికిన ప్రతిమాటా అతని హృదయాన్ని గాయపరిచేలా చేసినా, నిఖిల్ దిగమింగుకుని, "నీ భర్త ఏం చేస్తుంటారు? పిల్లలెంతమంది? ..."

"గవర్నమెంటు ఉద్యోగం. ఒక కుమార్తె" ముక్తసరిగా సమాధానమిస్తూ,

"నీ గురించి చెప్పు నిఖిల్, నీకు పెళ్లయిందట. రమాకాంత్ చెప్పాడు. నీకూ ఒకరో ఇద్దరో పిల్లలుండాలనుకుంటా" అంది.

"నందూ, రమాకాంత్ చెప్పిందంతా అబద్ధం. అలా చెప్పమని వాడికి నేనే చెప్పా"

"ఏంటీ? అబద్ధం చెప్పించావా!" నందిని కంఠం ఆక్రోశంతో నిండిపోయింది.

"నందూ, నా పరిస్థితి ఎవ్వరికీ చెప్పలేనిది. అలాంటి స్థితి ఎవ్వరికీ రాకూడదు. నీకెలా చెప్పేది నందూ" కన్నీటి బొట్లు జలజలా రాలాయి.

"అయినా చెప్పక తప్పదు విను. ముంబైలో నాకో మంచి ఉద్యోగం దొరికింది. నిన్ను పెళ్లి చేసుకుని సుఖ సంసారం గడపాలని కలలుకంటూ వుండేవాణ్ని. పెళ్లికని ప్రతినెలా జీతం కొంచెం ఆదా చేసేవాణ్ని. ఖర్చు తగ్గించుకోవడానికి ఓ యువకుడితో స్నేహం కలిపి వాడితో కల్సి రూం షేరు చేసుకుని ఉండేవాణ్ని. అయితే... అయితే... దీన్ని నేనెలా చెప్పాలి నీకు. వాడిపాలినబడి తర్వాత తర్వాత వాడికి లోబడిపోయాను. మొదట్లో చాలా హాయి అన్పించింది. సంతోషాన్నిచ్చింది. కాని కొద్దికాలం గడిచాక వాడి ఆరోగ్యం క్షీణించింది. పగలంతా జ్వరం, దగ్గు వాణ్ని పీల్చి పిప్పిచేశాయి. చేసే ఉద్యోగాన్ని వదిలేసి వాడు వాళ్లూరు వెళ్లిపోయాడు. తిరిగి రాలేదు. పోతూ, పోతూ వాడో బహుమతిని ఇచ్చి వెళ్లాడు నాకు. అదేంటో తెల్సా - హెచ్ఐవీ పాజిటివ్" అదిరిపడింది నందిని.

మళ్లీ ప్రారంభించాడు నిఖిల్ "మృత్యువు దరిదాపుల్లో నేను. నేకట్టుకున్న ఆశా సౌధాలన్నీ పేకమేడల్లా కూలిపోయాయి. నా కలలన్నీ 'హెచ్ఐవీ' సునామీలో కొట్టుకుపోయాయి. కనుచూపుమేరా నాకు కన్పించింది మరుభూమి మాత్రమే. ఇలాంటి పరిస్థితుల్లో నిన్నెలా పెళ్లిచేసుకోగలను నందినీ! నిన్ను నా పాపపంకిలంలోకి లాగకుండా వుండాలనే రమాకాంత్‌తో అలా అబద్ధం చెప్పించా" జలజలా రాలిపోతున్న కన్నీళ్లని తుడుచుకోటానికి ప్రయత్నించలేదు నిఖిల్. తాను నిల్చున్న నేల నిలువునా చీలిపోయినట్టనిపించింది, నిఖిల్ మాటలు విన్న నందినికి.

"అందరు నాపై పెట్టుకున్న నమ్మకాన్ని

చెరిపివేసినట్లయింది. అమ్మా, నాన్న, అన్నయ్య... అందరూ దూరమయ్యారు. నన్నో దోషిగా చూశారందరూ. కొంచం, జలుబు, దగ్గు వస్తే తన ఒళ్లో చేర్చుకుని ఉపచారం చేసే అమ్మ తన ముఖాన్ని తిప్పేసుకుంది. అప్పుడే నేను నీకు దూరంగా ఉండాలనే నిశ్చయించుకున్నా... ఒంటరి ప్రయాణం. ఎయిడ్స్ వ్యాధిగ్రస్తుల సహాయార్థం ఉన్న ఓ సొసైటీ నన్ను చేరదీసింది. రోజూ దోసిట నిండా మాత్రలు, కణాల కౌంటింగ్, వ్యాధి నిరోధక శక్తిని పెంచే ఔషధాలు- దీనికి తోడు 'యాంటి రిట్రో వైరస్ ట్రీట్‌మెంట్' ఈ సేవలన్నింటినీ ఉచితంగా అందిస్తున్నదీ సంస్థ. నామమాత్రంగా కొంచం పైకం వసూలు చేస్తారు. మాలాంటి శాపగ్రస్తులకి ఓ ఆశ్రయం కల్పించి

అనువాదం : **కల్లూరు జానకీరామారావు**

బతుకుపై ఆశను కల్గిస్తూ వుంది" చెప్పడం పూర్తి చేశాడు నిఖిల్.

"నిఖిల్, క్షణిక సుఖం కోసం మనం, ఎలాంటి సరిదిద్దుకోలేని పొరపాట్లని చేస్తామో ఇప్పుడు తెల్సింది. దాని కోసం మన జీవితాలనే పణంగా పెట్టాల్సి వస్తుంది. అలాంటి పరిస్థితుల్లో నాకో మాట తెలియజేసి వుంటే నేనాఘమేఘాల మీద వచ్చేదాన్ని" అంటూ వెక్కి, వెక్కి ఏడ్చింది.

"నందినీ ధైర్యం తెచ్చుకో, ఇప్పుడు నాకే ప్రాబ్లం లేదు. డాక్టర్ల సలహా ప్రకారం పత్యం, ఔషధ సేవనం వుంటే ఎలాంటి భయం ఉండదు. అది సరే, నీ సంగతేమిటి? కూతురు ఎలా వుంది? ఏం చదువుతోంది? " వాతావరణాన్ని తేలిక పరచాలని అడిగాడు నిఖిల్.

"అది నా కూతురే కాదు నిఖిల్. నీ కూతురు కూడా!"

"ఏంటి? " అన్నాడు విషయం అర్థంకాక.

"చెబుతాను విను. ఉద్యోగానికని నీవు ముంబై వెళ్లి, ఉద్యోగం దొరికాక నీ రూం ఖాళీ చేయడానికని ఇక్కడికొచ్చావ్ గుర్తుందా" రెండు మూడు రోజులు మనమిద్దరం మీ రూంలో కల్సుకుంటూ శారీరకంగా దగ్గరయ్యాం. నీవు వెళ్లిపోయావ్. వెళ్లిన కొత్తలో అడపాదడపా ఫోన్ చేసేవాడివి. తరువాత నీ నుంచి కాల్స్ రాలేదు. నేనెన్నిసార్లు ప్రయత్నించినా స్విచ్ఛాఫ్ అని వచ్చేది. నీ అడ్రసు దొరకలేదు. రమాకాంత్ కూడా అందుబాటులో లేకుండా ఎక్కడికో వెళ్లిపోయాడు. చివరికి మీ అమ్మానాన్నల దగ్గరికి కూడా వెళ్లివచ్చా. అక్కడా నిరాశే ఎదురయ్యింది. నెల తప్పాను. శరీరంలో వస్తున్న మార్పులని గమనించి నిలదీశారు ఇంట్లోవాళ్లు. అబార్షన్ చేయించుకోమన్నారు. చేయించుకోనని మొండికేశా. పెద్ద రాద్ధాంతమే జరిగిపోయింది ఇంట్లో. వీధిన పడ్డా. ఇంకెవళ్లూ నా వెంటబడకుండా వుంటానికని ఇదిగో, నేనే ఈ తాళిని కట్టుకున్నా. భర్త ఎక్కడ అని అడిగిన వాళ్లకి మిలటరీలో వున్నాడని చెప్పి ఓ ఉద్యోగం సంపాదించాను" తన కథ ముగించింది నందిని.

మౌనంగా వింటోన్న నిఖిల్ "నందినీ నాకు హెచ్ఐవీ పాజిటివ్‌ఉన్నా సురక్షితమైన వైవాహిక జీవితం గడపటానికి ఏ మాత్రం అవరోధం లేదని డాక్టర్లు చెప్పారు. అయితే, నీ నుంచి నాకు జాలి అక్కరలేదు. కేవలం నీ స్నేహం, మమకారం కావాలి. అదీ నీకు పూర్తి అంగీకారమయితేనే" చెప్పాల్సిందంతా చెప్పి ఆమె సమాధానం కోసం ఎదురుచూశాడు నిఖిల్.

"నా అవసరం నీకు, నీ అవసరం నాకు కావాలిప్పుడు. అంతేకాదు నీ కుమార్తెకు నీ 'నీడ' కూడా అవసరమే.. ఏమంటావ్"

కృతజ్ఞతా పూర్వకంగా చూశాడు నిఖిల్ నందినివైపు. V

**బెంగాలీ కథ**

**- సుబోధ్ ఘోష్**



# గూడు వదిలిన పక్షులు

దట్టంగా అలుముకున్న చీకట్లను చీల్చుకుంటూ రాణిపూర్ జంక్షన్‌లో ఆగింది రైలు. అందులో మొదటి తరగతి రైలుపెట్టెలో నుంచి విడివిడిగా దిగారు ఆ ఇద్దరూ. సాధారణంగా అందులో ప్రయాణించేవారు కతివార్‌లోని సుగర్ ఫ్యాక్టరీ యాజమానులో లేకపోతే డార్జిలింగ్‌లోని టీ తోటల సొంతదారులో అయి ఉంటారు. చిత్రంగా మొదటితరగతి రైలు పెట్టెలో నుంచి దిగిన ఆ ఇద్దరూ ఈ కోవకి చెందినవారు కాదు.

రైలుదిగిన వెంటనే తమస్థాయి ప్రయాణికులు వేచిఉండే గది వెతుక్కుంటూ వచ్చారు ఒకరి వెనగ్గా మరొకరు.

ముందుగా ఆమె కాశ్మీరీ ఉలెన్ ఓవర్ కోట్ ధరించి ఉంది. పశ్చిమ దేశాలవారు ధరించే లాంటి బన్ తలకి పెట్టుకుని చెవులకు ఖరీదైన జూకాలు ధరించింది. చూడగానే ధనికుల కుటుంబానికి చెందిన స్త్రీలాగా కనిపిస్తోంది.

పోర్టర్ సామాను వెంటతెస్తే- చెప్పులు టకటక లాడించుకుంటూ విశ్రాంతి గదిలోకి ప్రవేశించింది.

అతను షోకిల్లా రాయుడిలా కనిపిస్తున్నాడు. బెంగాలీ బాబుల సంప్రదాయ ఆడంబర దుస్తులు, వాటిపైన షాల్, రంగుల కళ్లద్దాలు.. పెట్టుకుని అతని రూపంలోనే డాబూ, దర్పం కనిపిస్తోంది. పోర్టరు సామాను మోసుకొచ్చి లోపల పెడితే

అనువాదం :
**చిరువోలు పార్థసారథి**

వెనగ్గా అతనూ వచ్చాడు.

కొద్దిసేపు అక్కడ వేచి ఉన్న తర్వాత చెరో రైలులోనూ వారు ప్రయాణించవలసి ఉంది.

ఆ ఇద్దరూ చిత్రమైన పరిస్థితుల్లో అక్కడ కలుసుకున్నారు. బహుశా అలాంటి సందర్భాలు అరుదుగా ఎదురవుతాయేమో!

అందుకే తలెత్తి ఒకరినొకరు చూసుకోగానే భయం, ఆందోళన, తత్తరపాటు... ఒక్కసారిగా వారిపై దాడి చేశాయి.

మూడో మనిషిలేని ఆ గదిలో ఒకరితో మరొకరు కొద్దిసేపు గడపవలసిన పరిస్థితి ఎదురుకావటం వాళ్లను ఉక్కిరిబిక్కిరి చేసింది. తమ జీవితాల్లో అలాంటి సమయం మళ్లీ వస్తుందని ఆ జంట కలలో కూడ అనుకోలేదు.

ఇద్దరూ ఇదో దురదృష్టకర పరిణామమని భావించారు.

భయం వల్లో, ఆందోళన వల్లో దేని వల్లో తెలియదుగానీ వాళ్ల ఒంటికి దట్టంగా చెమట పట్టింది.

ఇంతకు ముందు కోర్టు ప్రాంగణంలో అలాంటి పరిస్థితి ఎదురైన విషయాన్ని వాళ్లు గుర్తు చేసుకున్నారు.

ఇప్పుడిక్కడ న్యాయమూర్తి లేరు. వాదించే న్యాయవాదులు లేరు. వారంతా గుచ్చి గుచ్చి ప్రశ్నలు వేస్తుంటే ఇబ్బందిగా జవాబు చెప్పవలసిన పరిస్థితి లేదు. అయినా భరించరానిదిగా ఉంది వాతావరణం.

మాధురి రే, శతాదల్ ఇద్దరూ ఒకేలాంటి ఇబ్బందికర పరిస్థితిని ఎదుర్కొంటున్నారు.

శతాదల్ ఒక్కసారిగా కుర్చీలో నుంచి లేచి వెయిటింగ్ రూం తలుపుదాకా నడిచాడు. బయటకు తొంగి చూస్తూ పోర్ట ర్ ఎవరైనా కనబడితే సామాను తీసుకుని అక్కడ్నుంచి పారిపోవాలనుకున్నాడు.

ఎక్కడికి వెళ్లాలి అనేది స్పష్టతలేదు. అక్కడనుంచి బయటపడితే చాలు. కరెంటు లేకపోయినా, కూర్చునే వసతి లేకపోయినా పరవాలేదు. సాధారణ తరగతి ప్రయాణికుల గదిలోకి వెళితే అన్న ఆలోచనా అతనికి కలిగింది. అతని పిలుపుకి పోర్టర్లెవరూ స్పందించినట్టులేరు. వెయింటింగ్ రూం అటెండెంట్ దగ్గర కొచ్చి- 'నేనేమైనా సాయం చేయగలనా సర్' అంటూ ప్రశ్నించాడు.

తనతో పాటు ఉన్న మనిషిని చూసి తను ఆందోళన చెందటం. అక్కడ్నించి పారిపోవాలనుకోవటం అవివేకమనిపించింది ఆ క్షణంలో. అందుకే- మంచి టీ తెచ్చిపెట్టు" అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టుగా. మళ్లీ వెనక్కి వచ్చి కుర్చీని టేబుల్‌కి దగ్గరగా జరిపి కూర్చున్నాడు. మరోవైపు మాధురీ రే తను ధరించిన ఓవర్‌కోట్‌ను

తీసి పక్కన బెంచీపైన వేసి- సామాన్లం టినీ ఒక క్రమంలో సర్దుకుంది. ఇప్పుడు ఆమెకు అక్కడ కూర్చోవటం సౌకర్యంగా అనిపించింది.

ఈ నిముషంలో ఆ ఇద్దరి మధ్య ఎలాంటి సంబంధ బాంధవ్యాలు లేవు. ఇద్దరు రైలు ప్రయాణికుల్లా ఒక చోట కొద్దిసమయాన్ని గడుపుతున్నారంతే. కొన్నేళ్ల క్రితమే ఆ బంధం తెగిపోయింది. ఖచ్చితంగా చెప్పాలంటే నాలుగేళ్ల క్రితమే. పన్నెండేళ్ల క్రితం మాధురి మిత్ర అనే అందమైన యువతి- శతాదల్ అన్నయ్య భార్య- అంటే అతని వదినతో ఉన్న స్నేహం దరిమిలా ఆ ఇంటికొచ్చింది. మొదటి సారి అక్కడ శతాదల్‌ని చూసింది.

ఓ మధ్యాహ్నం ఇద్దరూ కాసేపు అలా నడుచుకుంటూ వెళ్లి భావాలు కలబోసుకున్నారు. పరిచయాలయ్యాక ఏడాది వ్యవధిలో ఆ పరిచయం ప్రేమగా పరిణమించింది. పెద్దల ఆశీస్సులతో, రిజిస్ట్రార్ ఆఫీసులో ఇద్దరూ దంపతులయ్యారు.

కాలం గడిచింది. వారి వైవాహిక జీవితానికి ఏడేళ్ల వయసొచ్చింది ప్రేమ క్రమంగా వాడిపోయింది. ఒకరిపైన మరొకరికి ఇష్టం సన్నగిల్లింది. కలిసి జీవించటం కష్టమనే అభిప్రాయం ఇద్దరిలోనూ కలిగింది. చట్టబద్ధంగా విడిపోతే మంచిదన్న నిర్ణయానికి వారు అతిత్వరలోనే వచ్చేశారు.

'ఇద్దరి మధ్యా ప్రేమ తగ్గింది. మానసికంగా మన అభిరుచులకి తగ్గట్టుగా జీవించాలన్న అభిప్రాయానికొచ్చాం. అలాంటప్పుడు సమాజంకోసం భార్యా భర్తల పాత్రలు పోషించటం దేనికి? ' అని ఎవరికి వారే తమ నిర్ణయాన్ని సమర్థించుకున్నారు.

ఓ ఫాల్గుణ మాసంలో చిగురించిన ప్రేమవసంతం ఏడేళ్ల తర్వాత మరో ఫాల్గుణ మాసంలో శిశిరమై మిగిలింది.

ఓ రోజు తన ఆర్కియాలజీ పని నిమిత్తం శతాదల్ భువనేశ్వర్ వెళ్లవలసి వచ్చింది. ఏడురోజుల పాటు తను పరాయి ఊళ్లో ఒంటరిగా గడపాలి. అతను సామాన్లు సర్దుకుంటూ నానా అవస్థలు పడుతుంటే పక్కగదిలో మాధురి పుస్తకం చదువుతూ కాలక్షేపం చేయసాగింది తప్ప- వచ్చి వీడ్కోలు పలకలేదు.

ఆ శీతాకాల ఉదయం- అద్దాలగదిలోకి ప్రవేశించిన వెచ్చని సూర్యకిరణం అతనికి హాయిగొలపవలసిందిపోయి- ఇబ్బంది పెట్టింది. అనుభూతిచెందే పరిస్థితిలో లేడ తను. ఆమె ఎదురుపడలేదన్న వేదనే అతనికి భరించలేనిదిగా మారింది. ఇలాంటి సంఘటనలు వారి జీవితాల్లో ఎన్నో.

ఓ ఆదివారం సాయంత్రం- ఎప్పటి మాదిరిగానే భర్తతో కలిసి ఈవెనింగ్ వాక్‌కు వెళ్లేందుకు మాధురి తయారై కూర్చుంది. సూర్యుడు పడమటి కొండల్లోకి జారి క్రమంగా అస్తమించాడు. శతాదల్ జాడలేదు. ఒక ఆలయానికి సంబంధించిన నమూనా చిత్రాన్ని గీసే పనిలో నిమగ్నమై పక్క గదిలో వేచి చూస్తున్న మాధురి విషయం మరిచిపోయాడతను. అడపాదడపా ఇలాంటివే మరికొన్ని సంఘటనలు. ఇద్దరిలో ఒకరు చొరవ తీసుకుని, విషయాన్ని వివరంగా రెండోవారికి చెప్పుంటే సమస్యలు తొలగిపోయేవేమో! కాని ఇద్దరూ రెండోవాళ్లని బాధ్యులుగా భావించి మౌనంగా నెట్టుకొచ్చారు. అంతిమంగా తమ ఇద్దరికీ ఇక పొసగదన్న స్థిర నిర్ణయానికొచ్చేశారు.

ఒకరి నుంచి మరొకరు సాంత్వన పొందటానికి బదులు... అందుకోసం వేరెవరినో వెతుక్కునే ప్రయత్నం చేశారు. కొత్త బంధాలు.. కొత్త పరిచయాలు... ఆకర్షణ తగ్గిన వారి వైవాహిక జీవితానికి మంగళం పాడాయి. ఇద్దరిలోనూ పశ్చాత్తాపం కలగలేదు. ఇద్దరూ తాము ఈ నిర్ణయం తీసుకోటానికి రెండోవారే కారణ

మని బలంగా నమ్మారు. అవతల వ్యక్తిని అంతగానే ద్వేషించారు కూడా. భావాలను మనసులోనే అణచుకోవటం వల్ల వారే సందర్భంలోనూ వాదులాడుకున్నది లేదు. ఏడేళ్ల వైవాహిక జీవితం పూర్తి కావటం వల్ల విడాకులు తేలిగ్గానే మంజూరయ్యాయి. ఏడాదిన్నర తర్వాత- మాధురి వివాహం అనాడిరే అనే ఇంజనీరుతో అయ్యిందన్న విషయం శతాదల్ చెవినపడింది. దాదాపు అదే సమయంలో పత్రికలో వచ్చిన ప్రకటన చూసిన మాధురి శతాదల్ కలకత్తా కోర్టు మిషన్ పాఠశాలలో పనిచేసే సుధను పెళ్లి చేసుకున్నాడని తెలుసుకుంది. ఇద్దరివీ ప్రేమ వివాహాలేనని అంతా చెప్పుకున్నారు.



మాధురి సంసార జీవితం సంతోషంగా సాగుతోంది. కొన్ని ఒడిదుడుకులున్నా శతాదల్ సుధల కాపురమూ సంతృప్తి కరంగానే నడుస్తోంది.

ఆ ఇద్దరూ తమ పూర్వ జీవితాలను వదిలేసిన తరుణంలో దాని గురించి చర్చించటం కంటే ప్రస్తుతంలోకి రావటం మంచిదేమో. శాశ్వతంగా తెగతెంపులు చేసుకున్న ఆ ఇద్దరు ఆ రాత్రి విధి ఆడిన వింతనాటకం వల్ల అక్కడ కలుసుకున్నారు. మూడో మనిషి తారసపడుంటే ఆ వాతావరణం వారికి ఇబ్బంది కలిగించక పోయేది. నిస్సహాయ ఖైదీల లాగుంది వారి పరిస్థితి.

ఆలోచనలతో మెదడు బరువెక్కి ఎప్పుడు నిద్రలోకి జారుకున్నాడో తెలియదుగానీ శతాదల్ కళ్లు తెరిచి చూసేసరికి బెంచీపైన కూర్చుని అటువైపు చూస్తున్న మాధురి కంట పడింది.

ఎందుకో తెలియదు గానీ ఆమెను పరీక్షగా చూడాలన్న బలమైన కోరిక అతనిలో మేల్కొంది. కొత్తగా ఆమె గురించి తెలుసుకోవలసిందేముంది? ఆమె అందం తనకు చిరపరిచితమైనదే. ఇంకేమైనా కొత్తగా కనిపిస్తుందీ అంటే... అది ఆమె చీర కట్టుకునే పద్ధతి. మేఘాల రంగు క్రేప్ చీర ఆమె గతంలో కట్టుకునేదికాదు. పల్లూని అలా వదిలేసేది కాదు.

ఆమెతో కలిసి నడిచేటప్పుడు ఆమె చీర విచిత్రంగా పాములా బుసలు కొట్టిన సవ్వడి చేసేది. పల్లు కొనకి ఆమె ఒకటి రెండు చుక్కల పర్‌ఫ్యూమ్ వేసేది. ఆ సుగంధం గాలిలో కలిసి ముక్కుపుటాలకు తగులుతుంటే ఆ నడక మత్తెక్కించేది. మనసుకి హాయి గొలిపేది. ఇప్పుడు మాధురి మరింత అందంగా ఓ చిత్రకారుడు తన అభిరుచికి తగ్గట్టు రూపొందించుకున్న అపురూపమైన చిత్తరువులా అతనికి తోచింది.

ఆమెవైపు తన్మయత్వంగా చూడసా



గాడు. అంతలోనే ఆమె మరొకరి భార్య అన్న అంశం స్ఫురించి - చటుక్కున చూపు మరల్చుకున్నాడు. ఆ తర్వాత తన పనుల్లోకి దిగాడు. పక్కనున్న లెదర్ బ్యాగ్ తెరిచి అందులో నుంచి టవల్, సోప్ తీసుకున్నాడు. బెడ్డింగ్‌ను వదులు చేసి అందులో ఉన్న దుప్పటీ, తలగడలు తీసుకుని కుర్చీపైన పరిచాడు.

అటువైపు తిరిగి కూర్చున్న మాధురి శతాదల్‌ని కావాలని చూడాలనుకోలేదు. అతనేం చేస్తున్నాడో తెలుసుకోవాలన్న ఆసక్తి ఆమెకి కలగకపోయినా ఎదురుగా ఉన్న అద్దంలో అతను చేస్తున్న పనులన్నీ కనిపించసాగాయి స్పష్టంగా.

శతాదల్ చేతికున్న రిస్ట్‌వాచీ తీసి పక్కన ఉంచాడు. స్ట్రాప్ నల్లది. ఆ రంగంటే తనకి అయిష్టం. అందుకే శతాదల్ నల్ల రంగు వస్తువులు మునుపెప్పుడూ ధరించేవాడు కాదు. చేతివేళ్ళ మధ్య బంగారపు రింగు మెరుస్తూండటాన్ని గుర్తించింది.

తలగడకి తెల్లరంగు కవర్ వేసి ఉంది. వాటి పైన రంగుల్లో పూల లతలు కనిపించాయి. బహుశా ఇదంతా శతాదల్ భార్య ప్రభావమేనని అనిపించింది ఆమెకి.

శతాదల్ సోప్, టవల్ తీసుకుని అలా బాత్రూంలోకి వెళ్ళగానే- అద్దంలో చూడటం మానేసి నేరుగా అతని వస్తువులను పరిశీలించటం ప్రారంభించింది. దేని కోసం వెతుకుతున్నదీ ఆమెకి అర్థం కాలేదు గానీ ప్రతిదీ గమనించాలన్న కోరిక ఆమెకి కలిగింది. బహుశా అందులో గ తం తాలూకు గుర్తులేమైనా మిగిలి ఉన్నాయేమోనన్న ఆరాటం కూడా కొంత కార ణం కావచ్చు. కానీ అన్ని వస్తువులూ కొత్త గా కనిపించాయి. జాగ్రత్తగా గమనిస్తే ఆమె కళ్ళలో కాసింత అసూయ చోటు చేసుకుంది ఆ నిముషంలో.

శతాదల్ వస్తువులన్నీ చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. రిస్ట్‌వాచీ, కళ్ళద్దాలు, బంగారపు గుండీలున్న గోధుమ రంగు చొక్కా, వాటితోపాటు తాళాలు వేయని సూట్‌కేసు, లెదర్ బ్యాగ్ ఏ ధైర్యంతో ఇవన్నీ వదిలేసి వెళ్ళాడో అనుకుంది.

శతాదల్ బాత్రూం నుంచి తిరిగివచ్చే సమయానికి తిరిగి యధాస్థానంలో కూర్చుంది. ఎదురుగా అద్దంలో అతని రూపం కనిపించేలా. ఇప్పుడు మాధురికి అతని శరీరం పైభాగం కనిపిస్తోంది. అతను గతంలో కంటే బాగా చిక్కిపోయినట్టు

అనిపించింది ఆమెకు. భార్య పోషణ సరిగ్గా లేదేమో అన్న భావన కూడా కలిగింది ఆమెకి. శతాదల్ టిఫిన్ కేరియర్ తీసి - టేబుల్‌పైన గిన్నెలన్నీ వరుసగా పేర్చుకున్నాడు. భోజనం ప్రారంభించి రెండు ముద్దలు మింగాడో లేదో పొలమారింది.

నీళ్ల అందుకోటానికి కుర్చీలో నుంచే కొద్దిదూరంగా ఉన్న వాటర్ క్యాన్ అందుకునే ప్రయత్నం చేశాడు. అనుకోకుండా ఆమె ఆ దృశ్యం చూసి ఒక్కసారిగా వెనక్కి తిరిగింది. అతనూ అనుకోకుండా ఆమెవైపు చూశాడు. కొన్ని క్షణాల పాటు ఇద్దరిలోనూ తత్తరపాటు.

"ఏమైంది? " అంది ఆమె ఆత్రుతగా.

శతాదల్ భావరహితంగా చూశాడు ఆమెవైపు. "మంచి నీళ్ల కావాలంటే నన్ను అడగొచ్చుగా. అదేమంత తప్పు విషయం కాదుగా" - అంది.

అప్పటి వరకూ గంభీరంగా ఉన్న ఆ వెయిటింగ్ రూంలో ఒక్కసారిగా చలనం వచ్చినట్టయింది.

అతను నవ్వాడు - ఆమెతో పరిచయం ఉన్న రోజుల్లో మాదిరిగా. ఆమె కూడా దానికి ప్రతిస్పందిస్తూ- మంచినీళ్ల గ్లాసు అతని చేతికందించి "కుర్చీలో కూర్చుని భోజనం చేయవచ్చుగా" అంది.

నీళ్ల తాగాడతను. ఖాళీ గ్లాసులో మరి కాసిని నీరు నింపింది. భోజన పదార్థాలను ప్లేటులో వడ్డించింది. ఆమె అలా వడ్డిస్తున్నప్పుడు చేతిగాజులు వింత ధ్వని చేశాయి. ఆ నిముషంలో వారిద్దరిని చూసిన వారెవరూ- ఇద్దరు వేర్వేరు ప్రయాణికులు వెయిటింగ్ రూంలో తమ రైలు కోసం కాలక్షేపం చేస్తున్నారనుకోరు. ఒకే జంట, అరమరికలు భేదాభిప్రాయాలు లేకుండా కాపురం చేస్తూ తమకు దొరికిన ఏకాంతాన్ని ఆనందంగా అనుభవిస్తున్నారనుకుంటారు.

గతంలో కంటే ఆమె మరింత నాజూకుగా తయారైంది. శతాదల్ మరో మారు ఆమె వంక పరిశీలనగా చూశాడు. భోజనం వడ్డించే తీరులో మాత్రం అప్పటికీ, ఇప్పటికీ ఎలాంటి తేడా లేదు. ఆమె అతనికి దగ్గరిగా నిలబడి ఉంది. ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు... అతని శరీరాన్ని తాకుతున్నాయి. చీరకొంగు ఆమె భుజాల మీద నుంచి జారి అతని చేతులపై వేలాడుతుంది. మాధురి ఇవేమీ పట్టించుకున్నట్టుగా లేదు. శతాదల్‌లో మాత్రం ఆమె ఉనికి గతం తాలూకు మధుర జ్ఞాపకాలను మేల్కొలుపుతోంది.

"హోటల్ నుంచి తెచ్చిన భోజనం అనుకుంటా"- అంది మాధురి సంభాషణను పొడిగిస్తున్నట్టుగా. ఆమెకిలాంటివి ఇష్టం ఉండవు అని అతనికి తెలుసు. అందుకే తప్పు చేసిన వాడిలా-

"అవును. కతియార్ మార్కెట్ నుంచి ఈ భోజనం తెప్పించా" అన్నాడు.

ఆమె మళ్లీ అడిగింది.

"ఏ ఊరు వెళుతున్నారు? "- దానికి సమాధానం చెప్పాడతను. "కలకత్తా"

మాధురి మరో ప్రశ్న వేసింది.

"ఇప్పుడు మీరు కలకత్తాలో ఉంటున్నారా? "

"అవును"- బదులిచ్చాడు. 'మరి- నువ్వు? " అడిగాడు.

ఇలాంటి ప్రశ్నలకు సమాధానం చెబుతూపోతే ప్రస్తుతం తన జీవితం గురించి అంతా శతాదల్‌కి వివరంగా చెప్పవలసి వస్తుంది. ఈ పరిస్థితి ఆమెకు ఇబ్బందిగా అనిపించింది. అప్పటి వరకూ మామూలుగా ఉన్నదల్లా కాస్త ఇబ్బందిగా - "రాజ్‌గిర్‌లో" అని క్లుప్తంగా ముగించింది.

ఇంకేం మాట్లాడాలో తెలియని శతాదల్ "అంటే పాట్నా వెళ్లే రైలు ఎక్కాలన్న మాట" అన్నాడు. అవునన్నట్టుగా తలాడించింది. మీరు భోజనం పూర్తి చేయండి. అంటూ మరో ప్రశ్నకు సమాధానం

ఎక్కడ చెప్పవలసి వస్తుందోనని రిస్ట్ వాచ్‌లో టైమ్ చూసుకుంటూ అక్కడి నుంచి కదిలి వెళ్లిపోయింది.

ఇంతకు ముందు కూర్చున్న కుర్చీలో కూలబడింది. వెయిటింగ్ రూంలో వాతావరణం మళ్లీ గంభీరంగా మారిపోయింది. శతాదల్‌కి భోజనం సయించలేదు. 'ఆమెతో ఎందుకు మాట్లాడానా?' అని కాసేపు తర్జనభర్జన పడ్డాడు. మాటలతో ఆమె తనను చిన్నబుచ్చిందా అన్న అనుమానం కూడా కలిగింది అతనికి.

కుర్చీలో లేచి పక్కనున్న ఈజీ ఛైర్‌లోకి మారి షాల్‌ని ఒళ్లంతా చుట్టుకున్నాడు. సిగిరెట్ ముట్టించాడు. మనసులో ఆలోచనలు రొద చేస్తున్నాయి.

ఈలోగా లోపలకొచ్చిన అటెండెంట్ ఒక టీ పాట్ నిండా టీ- దాంతోపాటు రెండు కప్పులు, కాస్త పంచదార తీసుకొచ్చి టేబుల్‌పైన ఉంచాడు. తర్వాత తనకేం సంబంధంలేనట్టు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

'తను టీ మాత్రమే తెమ్మనమని చెప్పాడు. ఇద్దరికి అని చెప్పలేదు. మరి రెండు కప్పులు ఎందుకు తెచ్చినట్టు వీడికి బుద్ధిలేదు' విసుగ్గా అనుకున్నాడు శతాదల్. టీ తాగాలనిపించలేదు అతనికి.

మాధురి అతన్ని గమనించడం లేదు. ఆమెకు అద్దంలోంచి వెనక జరుగుతున్నదంతా కనిపిస్తూనే ఉంది. శతాదల్ భోజనం చేయకుండా లేచిపోవడం, అటెండెంట్ టీ తెచ్చిపెట్టడం అతను దాన్ని కూడా పట్టించుకోకపోవడం.

ఆమెకి ఓ క్రిస్టమస్ రోజున తన మామయ్యా ఇంట్లో జరిగిన సంఘటన మదిలో మెదిలింది. మధుపూర్‌లో క్రిస్మస్ వేడుకల్లో పాల్గొనేందుకు ఇద్దరూ మాధురి మామయ్యా ఇంటికి వెళ్లారు. మొదటిరోజునే జరిగిందా సంఘటన.

ఆ రోజంతా శతాదల్ ఓ చెట్టుకిందే గడిపాడు. టీ తాగనని మొండికేశాడు. ఆమె అత్తయ్యా మామయ్యా, కుటుంబంలో ఇతర పెద్దలంతా బతిమాలినా 'ససేమిరా' అన్నాడు. చివరికి అసలు విషయం తెలిసింది. ఇంటి నౌకరు టీ తేవటంతో అలిగాడని గుర్తించారు. అందరూ మాధురినే తప్పు పట్టారు. అతిథిని గౌరవించే బాధ్యత సరిగా తీసుకోనందుకు. "నీకీ విషయం ముందే తెలిస్తే- ఇబ్బందిలేకుండా నువ్వే టీ పట్టికెళ్ళొచ్చుగా" అని సలహా ఇచ్చారు.

ఇది వెయిటింగ్ రూం. మామయ్యా ఇల్లు కాదు. అతను తన భర్త కూడా కాదు.

"మరెందుకు మొండికేస్తున్నట్టు?" మాధురికి అర్థం కాలేదు.

మీరు భోజనం ఎందుకు చేయటం లేదు? అసలేమైంది మీకు?

మాధురి గొంతు గంభీరంగా పలికింది.

"ఈ రాత్రి వేళ- ఎందుకో భోజనం సయించటంలేదు" శతాదల్ చెప్పాడు మర్యాదపూర్వకంగా.

"మరి టీ తాగొచ్చుగా?" అడిగింది.

"అవునవును, మరి నువ్వు?" శతాదల్ అడిగాడు.

"నేను టీ తెప్పించమని అడిగానా?" కవ్విస్తున్నట్టుగా అంది మాధురి పెదాలపైన నవ్వు.

"నువ్వడగలేదనుకో! అతనే పొరపాటున ఇద్దరికీ తెచ్చాడు" ఇబ్బంది పడుతున్నట్టుగా అన్నాడు.

"నేనూ తాగితే బావుంటుందంటారు మీరు, అంతేగా!" అంది.

ఆమె మాటల్లో ఎలాంటి తడబాటు లేదు. చాలా గంభీరంగా వ్యవహరిస్తోంది. ఆ సంగతి గుర్తించిన శతాదల్ సంకోచించకుండా "అవును" అన్నాడు.

"అటెండెంట్‌ని తప్పు పట్టడం దేనికి?" అన్నాడు మళ్లీ. మాధురి కూడా అదే అభిప్రాయానికొచ్చింది. ఆమె లేచి టేబుల్ దగ్గరకు నడిచి, ఇద్దరికీ టీ సిద్ధం చేసే

పనిలో పడింది.

శతాదల్ కూడా లేచి దూరంగా ఉన్న కుర్చీ తీసుకొచ్చి తనకు సమీపాన టేబుల్ కి ఎదురుగా వేశాడు. ఆమెను కూర్చోమని ఆహ్వానించాడు. అభ్యంతరం చెప్పటానికి కారణాలు కనిపించలేదు ఆమెకి. అనుకోకుండా ఒకరికొకరు మరింత దగ్గరయ్యే పరిస్థితులు ఎదురవుతున్నాయి.

మాధురి శతాదల్ కి సమీపానే కుర్చీలో కూర్చుంది. అతను ఆమె అందించిన టీ సిప్ చేస్తున్నాడు. టీ మధురంగా అనిపించింది. బహుశా ఆమె స్వయంగా తయారుచేసి ఇవ్వటం వల్లనేమో!

శతాదల్ నవ్వుతూ చెప్పాడు "నిన్ను ఇక్కడ చూడగానే మొదట చాలా ఇబ్బందిపడ్డాను"

"ఇబ్బందా? దేనికి? నాకెలా అనిపించిందో చెప్పలేను" అంది ఆమె.

"ఫరవాలేదు చెప్పు" - మళ్లీ అడిగాడు.

"నాక్కూడా కొంచెం..." నీళ్లు నములుతున్నట్టుగా అంది.

"చెప్పు... చెప్పు..." ఆసక్తి కనబరుస్తున్నట్టుగా అడిగాడు.

ఆ సంభాషణ చాలా మామూలుగా ప్రారంభమైనా- అది తమ గత జీవితంలోని వివిధ సందర్భాలను గుర్తుకు తెచ్చేలా ఉంది.

శతాదల్ ఆలోచనల్లో 'గతం గతః' అన్న అభిప్రాయమే ఉంది. అందులో భయపడవలసిందీ, చింతించవలసిందీ ఏదీ లేదనిపించింది. వ్యక్తుల మరణం తర్వాత- వారి గురించి సహజంగా అంతా మంచే మాట్లాడుకున్నట్టు ఆ వ్యక్తి జీవితంలో చేసిన తప్పులను, లోపాలను కప్పిపుచ్చినట్టూ ఉంది ఇద్దరి ప్రవర్తన.

గతాన్ని తడిమితే చింతించే పరిస్థితి ఎదురవుతుందేమోనన్న భయ సందేహాలు మాయమై, చాలాకాలం తర్వాత కలిసిన పాతస్నేహితుల మాదిరిగా వ్యవహరించటం ప్రారంభించారు. సంభాషణ ఒక అంశంలో నుంచి మరో అంశంలోకి మారింది. ఈ సారి "మీరు బాగా చిక్కిన

ట్టున్నారు" అంది మాధురి తనకి బాగా దగ్గరగా ఉన్న శతాదల్ వంక చూస్తూ.

"నువ్వూ అంతేగా"- అన్నాడు అతను.

మాధురి చేతిలో టీ కప్పు ఉంది. ఆమె చేతివేళ్ల వంక పరిశీలనగా చూస్తూ- "ఆ చేతివేళ్లు అలా అయిపోయాయేమిటి? " అన్నాడు.

ఆమె వేళ్ల వంక చూసుకుంటూ... "ఏమిటి? " అని ప్రశ్నించింది.

"బాగా బలహీనంగా కనిపిస్తున్నాయి. వాటిల్లో మెరుపు తగ్గింది"-

ఒక్కసారిగా ఆమెకు సిగ్గు ముంచుకొచ్చింది. భుజాలపై నుంచి జారిన పైటతో చేతిని కప్పుకోవాలన్న కోరిక కలిగింది. ఈలోగా ఆమెచేతిని తనచేతిలోకి తీసుకుని మృదువుగా నిమిరాడు శతాదల్. ఆమె అభ్యంతరం చెప్పలేదు. ఏడేళ్ల క్రితం ఆకులు రాలిపోయిన చెట్టు- మళ్లీ చిగురించినట్టు- గతంలో వారిద్దరి మధ్య ఏకాంత క్షణాల్లో సాగిన ప్రణయ భావాలు, అనురాగం మళ్లీ ఉదయించినట్టు- ప్రేమ మైకంలో కొట్టుకుపోతున్నాడతను.

"నువ్వు! కాస్త కూడా మారలేదు. అప్పట్లానే ఉన్నావు" అన్నది తన్మయత్వంతో.

నిజానికి ఆమె రూపంలో మార్పులేదు. ఇతరత్రా అంశాలన్నీ మారినట్టు అతను ఇంతకముందే గుర్తించాడు. కానీ అతనికి ఏదో చెప్పాలనుంది. ఆమెతో గడిపే ఆ కొద్దిసమయాన్ని మధురంగా మలుచుకోవాలని ఆత్రంగా ఉంది. అందుకే చేదుజ్ఞాపకాలను మనసు పొరల్లోకి నెట్టేసి ఆమెను ప్రసన్నం చేసుకునే పనిలో పడ్డాడు.

ఈ మాటలు మాధురిపై ప్రభావం చూపటంలేదు. ఆమె పదహారేళ్ల అమ్మాయి కాదు. మగవాడు ప్రేమభావాలు వ్యక్తం చేయగానే ఉక్కిరిబిక్కిరి కావటానికి. నవవధువు కాదు మొదటిరాత్రి భర్త తన అందాన్ని తన్మయత్వంతో పొగుడుతుంటే సిగ్గుల మొగ్గవ్వటానికి.

ఒక స్త్రీ... కొన్నాళ్ల ఎడబాటు తర్వాత- తన భర్తను కలిస్తే... అతను ఆమె విరహాన్ని భరించలేకపోయానని చెబుతుంటే ఆమె ఎలా స్పందిస్తుందో సరిగ్గా అదే మాదిరిగా ఉంది ఆమె మనసంతా. అయితే బయటికి గంభీరంగా ఉంది. భావాలను బయట పెట్టదలుచుకోలేదు.

మరికాసేపట్లో ఇద్దరూ చెరోదారిలో వెళ్లిపోతారన్న విషయం శతాదల్‌కి గుర్తుకు రాలేదు. జీవిత పర్యంతం ఆమెతోనే గడిపేవాడిలా వ్యవహరిస్తున్నాడు.

ఆమె టీ తాగటం పూర్తిచేసి కప్పును పక్కనున్న టేబుల్‌పైన ఉంచింది.

"మామయ్యగారు ఎక్కడుంటున్నారు? " అడిగింది.



"డెహ్రాడూన్‌లో ఇల్లు కట్టుకున్నారు. అక్కడే ఉంటున్నారు" చెప్పాడు శతాదల్.

"మరి కృతి...? "

"ఆమెకి పెళ్లయింది. రమేష్‌తో ఢిల్లీలో ఉంటోంది. సెక్రటేరియట్‌లో ఉద్యోగం.."

అతని చేతిలో ఆమె చేయి అలాగే ఉంది మాట్లాడుతూనే దాన్ని నిమురుతున్నాడు ప్రేమగా.

"మాధురీ... నువ్వు నమ్ముతావా? " అడిగాడు.

"దేనిగురించి" అంది ఆమె.

"నేను నిన్ను మరిచిపోలేదు. నిజంగా" అన్నాడు.

"ఎందుకు నమ్మను. ఇప్పుడదంతా నాకళ్లముందే కనపడుతోందిగా" అంది తన చేయివంక చూసుకుంటూ.

"మరి నువ్వు...? " అన్నాడు. ఆమె జవాబుకోసం ఆశగా ఎదురుచూస్తూ.

"ఊఁ!" అంది ఆమె... ఏం చెప్పాలో తెలియక.

"నిజంగా నన్ను నువ్వు మరిచిపోయావా? " మళ్లీ అడిగాడు. ఆమెకళ్లు మూసుకుంది. వాస్తవ జీవితాన్ని దాచిపెట్టి మనసు పొరల్లో దాచుకున్న రహస్యాన్ని బట్టబయలు చేయటానికన్నట్టు మాటల కోసం తడుముకుంది. నెమ్మదిగా అతనికి సన్నిహితంగా జరిగి అతని గుండెలపైన తలను వాల్చింది. ఆమె కనుకొలనుల్లో నుంచి రెండు నీటిచుక్కలు టప్పున జారి శతాదల్ చేతిపైన పడ్డాయి.

అంతే! అతను మాధురిని బలంగా గుండెలకు హత్తుకున్నాడు.

"నాకు నిజం తెలియాలి. నువ్వు నన్ను మరిచిపోయావో లేదో చెప్పాలి అప్పుడే నిన్ను వదిలేది? " అంటూ మరింత గాఢంగా తన బాహువుల్లో ఆమెను బంధించాడు. బయట రైలుకూత. మరో రైలు వచ్చిందన్న సమాచారం మైకులో... వెయిటింగ్ రూంలో ఉన్నవారి చెవిన పడింది. ఒక్కసారిగా మాధురి అతని కౌగిలిని వదుల్చుకుంది. అతనింకా ఆమె చేతిని పట్టుకునే ప్రయత్నం చేశాడు. ఆమె దాన్ని కూడా మెల్లగా పక్కకు నెట్టి "ఈ పాటికి ఆయన వస్తూండాలి" అంటూ వెయిటింగ్ రూం ప్రవేశద్వారం వైపు పరిగెత్తింది. అప్పటివరకూ చిలిపి ఊహాలతో మత్తెక్కిన వెయిటింగ్‌రూం మళ్లీ గంభీరతను సంతరించుకుంది. ఒక రసవత్తర ఘట్టాన్ని వీక్షించిన పరిసరాలు మూగబోయాయి. ఆ స్త్రీ, పురుషులిద్దరి మధ్య ఆకర్షణ దారి తప్పకుండా ప్రకృతి సహకరించింది. మూడో వ్యక్తి గదిలోకి ప్రవేశించాడు.

అతను లోపలకి అడుగు పెడుతూనే ఆమెను సమీపించి ఆత్రతగా అడిగాడు.

"ఆరోగ్యం బానే ఉందా? "

"ఇబ్బందిలేదు" సమాధానం చెప్పింది.

అతని మాటల్లో, చేతల్లో ప్రేమ వ్యక్తమవుతూంది. ఆమెను ఒంటరిగా గదిలో ఎదురు చూసేలా చేశానన్న బాధకూడా కనపడింది. రైలు ఆలస్యమైంది లేకపోతే రెండుగంటల ముందే వచ్చుండేవాడిని అన్నాడు ప్రాధేయపడుతున్నట్టుగా! అతను అనాడి రే. మాధురి భర్త. బెడ్డింగ్ వదులుచేస్తూ అందులో నుంచి వస్తువులు తీసేప్రయత్నం చేస్తుండగా...

"ఆవేం వద్దు. నేను బానే ఉన్నాను"

## సర్‌ప్రైజ్



**చింటూ :** మమ్మీ, నాకో చిన్న తమ్ముడు కావాలి.

**తల్లి:** డాడీ దుబాయ్ వెళ్ళారు కదా, వచ్చాక అడుగుదాంలే.

**చింటూ:** కాసేపు ఆలోచించి... పోనీ, డాడీకి సర్‌ప్రైజ్ ఇద్దాం మమ్మీ!



**ఇరగదంతే!**

"మేస్త్రీ, మంచం చాలా గట్టిగా తయారుచెయ్యాలి, నా కొడుకు దీనిమీద మొదటిరాత్రి చేసుకోబోతున్నాడు"

**మేస్త్రీ:** ఇగ ఎట్టా సేసేత్తానో సూడండి, మీ అబ్బాయిగోరే కాదు, ఈదిఈదంతా ఒకేసారి సేసుకున్నా ఇరగదంథే!

అంది.

"అలాకాదు. నువ్వుకాసేపు పడుకుంటే అంతా తేలిగ్గా ఉంటుంది. ప్రయాణంలో ఇబ్బంది ఉండదు" అన్నాడు.

"అబ్బే! కాసేపటికే ఎందుకిదంతా? " అభ్యంతరం చెప్పిందామె.

అందుకు అంగీకరిస్తున్న వాడిలా అనాడిరే సూట్‌కేసు తెరచి, అందులో ఉన్న షాల్ తీసి ఆమె భూజాల చుట్టూ కప్పాడు.

శతాదల్ కుర్చీలో కూర్చుని ఇదంతా గమనిస్తున్నాడు. అతనికిదంతా వినోదంగాను ఉంది. విషాదంగాను ఉంది. వాళ్ళ వంక చూస్తూ అలా కూర్చోవటం ఇబ్బంది అనిపించి వెయిటింగ్ రూం తలుపు దగ్గర వరకూ వెళ్ళి ఒకసారి అలా బయటకి తొంగిచూసి మళ్లీ వచ్చి కూర్చున్నాడు.

అయినా స్థిమితంగా అనిపించలేదు. సామాన్లన్నింటినీ అటూ ఇటూ సర్దాడు. మళ్లీ కూర్చున్నాడు.

చీకటి గదిలో వెలుతురుకోసం కొట్టుమిట్టాడుతున్న నిస్సహాయ ఖైదీలా ఉంది అతని మానసిక పరిస్థితి. అక్కడ నుంచి బయటపడే దారి కోసం... ప్రశాంతత చిక్కే మార్గం కోసం ఆలోచిస్తున్నాడు.

ఆ వాతావరణం శతాదల్‌కి భరించరానిదిగా మారింది. అక్కడ్నుంచి పారిపోవాలనుంది గానీ- అలా వెళ్లిపోతే మాధురి నుంచి తాను ఆశించిన సమాధానం - ఆమె మాటల్లో తనపట్ల వ్యక్తమయ్యే అభిప్రాయం తెలుసుకోవాలన్న కోరిక తీరదు. ఆ కోరిక తీరకుండా అక్కడ్నుంచి తను వెళ్లలేడు. అందుకే బలవంతంగా అక్కడే ఉండాలని నిశ్చయించుకున్నాడు.

షాల్ కప్పుకోగానే మాధురికి ప్రయాణ బడలిక తీరినట్టుగా అనిపించింది. అనాడిరేకి సంతృప్తిగా అనిపించింది. అప్పటి వరకూ మాధురి ఒంటరిగా తన కోసం ఎదురు చూడవలసి వచ్చిందని బాధగా అనుకున్నాడు. ఇప్పుడు ఆమె తన సమక్షంలోనే ఉంది. సంతోషంతో ఉక్కిరి బిక్కిరయ్యాడు. జానపద కథల్లో రాజకుమారిలా ఆమె అతని కళ్లకు కనిపించింది.

ఒక బయలుదేరే సమయం ఆసన్నమైనదన్నట్టుగా చేతి వాచీ చూసుకున్నాడు. "పాట్నా రైలు వచ్చేస్తోంది" అంటూ పోర్టర్ లోపలికి వచ్చాడు.

మాధురి తన భర్తకు అత్యంత సమీపాన నిలబడి ఉంది. పోర్టర్ సామాన్లన్నీ తలపైన పెట్టుకుంటున్నాడు. అందరూ వెళ్లిపోటానికి సిద్ధమవుతున్నారు.

'ఈ గదికి నిప్పుపెట్టి తను మాత్రం క్షేమంగా వెళ్లిపోతోంది మాధురి' అనుకున్నాడు శతాదల్ ఆమెవైపు చూస్తూ. కొలిమిలో ఉన్నట్టుగా అనిపించింది అతనికి.

సుదీర్ఘమైన ఏడు సంవత్సరాలు. అంత తేలిగ్గా వాటిని మరిచిపోగలడా? జీవిత పుటల్నించి ఆ పేజీలను తొలగించటం సాధ్యమేనా? మాధురి ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పకుండానే వెళ్లిపోతోంది. ఇప్పుడే కాదు... ఇంకెప్పటికీ ఆమె వీటికి బదులు పలకదు.

శతాదల్ ఆలోచనలు రేసు గుర్రాల్లా పరుగులు తీస్తున్నాయి. భర్తతోటే వెళుతున్న ఆమె అలా వెళ్లిపోతే ఎలా ఉండేదో గానీ, తాను నిప్పు పెట్టిన గృహం పూర్తిగా మసి అయిందో లేదో చూసే వ్యక్తిలా ఆగి ఓసారి వెనక్కి తిరిగి చూసింది.

అప్పటికి పోర్టర్ గదిదాటి వెళ్లిపో

# సర్దుబాటు

కార్డు కథలు

"పిల్లలిద్దర్నీ సిద్ధం చేసి, లంచ్ బాక్సులిచ్చి, స్కూలు బస్సెక్కించి, సిటీబస్సు పట్టుకుని టైముకు ఆఫీసుకెళ్ళాలంటే నాకు కష్టంగా వుంది. పిల్లలిద్దర్నీ హాస్టల్ లో చేరుద్దాం" అంది సుందరి.. బెడ్ రూంలో పడుకున్న సుందరరావు ఎదమీద మునిగోటితో గీతలు గీస్తూ.



"పిల్లల్ని చూడకుండా నేనుండలేను. హాస్టల్ లో చేర్చడం నాకు సుతరామూ ఇష్టం లేదు" అన్నాడు సుందరరావు ముఖం మాడ్చుకుంటూ.

సుందరికి ఎక్కడలేని కోపం వచ్చేసింది.

"మీరు, పిల్లలూ ఇంట్లో వుండండి. నేనే వర్కింగ్ వుమెన్స్ హాస్టల్లో చేరిపోతాను. ఆఫీసులో ఆఫీసర్ రోజూ లేటుగా వస్తున్నానని చీవాట్లు పెడుతున్నాడు" అంది తీవ్రస్వరంతో.

"నాకంటే పిల్లలకు నీ అవసరమే ఎక్కువ. ఇంట్లో నువ్వే వుండు. నేనే మెన్స్ హాస్టల్లో చేరిపోతాను" అన్నాడు సుందరరావు అదే స్వరంతో.

అమ్మా నాన్నలు మా గురించి వాదులాడుకుంటున్నారని పిల్లలిద్దరూ హాల్లోంచి బెడ్ రూంలోకొచ్చారు. "మీరిద్దరూ ఇక్కడే వుండండి! మేమే హాస్టల్లో చేరిపోతాం. మా కోసం మీరు ఇబ్బంది పడకూడదు" అంటున్న పిల్లల మాటలు విని, సుందరీ సుందరరావుల కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"సుందరీ! రేపట్నుంచి నీవు చేసే పనుల్లో సగం నేనూ చేస్తా. కూరగాయలు, ఇంటి సరుకులు బజారు నుంచి నేనే తెస్తా.. స్కూలుకు పిల్లల్ని సిద్ధం చేస్తా.. స్కూలు బస్సెక్కిస్తా. రోజూ సిటీ బస్సుకోసం ఎదురు చూడకుండా ఆఫీసుకెళ్ళేందుకు స్కూటీ కొనిస్తా.. నీ సమస్యలు తీరినట్లేగా" అన్నాడు సుందరరావు.

"నాన్నగారూ! మీరు మమ్మల్ని స్కూలుకు సిద్ధం చేయాల్సిన పనిలేదు. మేమే సిద్ధమవుతాం. లంచ్ బాక్సులొద్దు, క్యాంటీన్ లో తింటాం. స్కూలు బస్సెక్కించడానికి మీరు రావద్దు. మేమే వెళ్ళి ఎక్కుతాం" అంటున్న పిల్లల మాటలు విని విస్తుపోయారు సుందరీ సుందరరావులు.

"అలా అందరం సర్దుకుంటే మనకు హాస్టళ్లే వద్దు! ఇల్లే ముద్దు!!" అంటూ ఇద్దరి పిల్లల్నీ కౌగిలించుకున్నారు సుందరీ, సుందరరావు.

**– పోలిశెట్టి ఓబయ్య,**
రాయచోటి, కడప జిల్లా

యాడు. అనాడి రే కూడా అతనితో పాటే బయటకి అడుగువేశాడు. మాధురి ఒక్క నిముషం ఆగి- శతాదల్ వైపు చూసి "నేను వెళుతున్నాను" అంది నవ్వుతూ.

శతాదల్ ఎలా ప్రతిస్పందించాలో అర్థం కాలేదు. అట్టే సమయం లేదు. తనే ఏదో ఒకటి మాట్లాడి తీరాలి. బలవంతంగా మాటల్ని పేర్చుకుంటూ...

"నువ్వు వెళ్లిపోతున్నావు మాధురీ! నా ప్రశ్నకు సమాధానం చెప్పలేదు" అన్నాడు. ఆ సమాధానం తెలుసుకుంటే గానీ, అతని గుండెల్లో భారం దిగదు మరి. ఆమె మొహంలో నవ్వు మాయమైంది "ఏ ప్రశ్న? " అంది తనకేమీ తెలియనట్టుగా.

శతాదల్ ఆశ్చర్యానికి లోనయ్యాడు. ఏడు నిముషాల క్రితం జరిగిన సంఘటనే ఆమె పెద్దగా లక్ష్యపెట్టనప్పుడు అప్పుడెప్పుడో ఏడేళ్లక్రితం నాటి విషయాలను గుర్తుంచుకొని ఉంటుందన్న నమ్మకం కలగలేదు అతనికి. ఆమె ఇంత మామూలుగా ఎలా ఉండగలుగుతోందో అర్థం కాలేదు.

శతాదల్ అహం ముక్కలైంది. ఆమెకంటూ ఓ గమ్యం ఉంది. తను ఎంచుకున్న జీవిత ప్రయాణంలో ఆమె ముందుకు సాగుతూంది. ఆ ప్రయాణాన్ని తను అడ్డుకోలేదు. అభ్యంతర పెట్టలేదు. ఆ హక్కు

ను ఏడేళ్ల క్రితమే తను కోల్పోయాడు. అందుకే విరక్తిగా అన్నాడు. "నా ప్రశ్నకు నువ్వు జవాబు చెప్పవు" అని.

మాధురి మౌనంగా ఉంది. కాసేపు ఆగి చెప్పింది. "ఇంతకంటె అసంబద్ధమైన ప్రశ్న ఇంకోటి ఉండదు" అని.

ఆ మాటలకు శతాదల్‌లో కోపం కట్టలు తెంచుకుంది. విసురుగా కుర్చీలో నుంచి లేచి అవతలవైపుకు చూస్తూ "ఇదంతా నీకు నవ్వులాటగా ఉంది" అన్నాడు కసిగా. ఇంకా ఏదో అనాలనుకున్నాడు. ఆమెను మాటలతో చిత్రవధ చేయాలనిపించింది అతనికి. శతాదల్ ఏం చెప్పాలనుకున్నాడో మాధురికి అర్థం అయ్యింది. పూర్తిగా అతనేం చెప్పకుండానే వాతావరణాన్ని మామూలు చేయటానికి అన్నట్టు తెలివిగా సంభాషణను మార్చింది.

"ఓసారి రాజ్‌గిరి రారాదూ! సుధను తీసుకుని" అంది. "కొన్ని రోజులు మాతో గడిపి వెళ్ళొచ్చు"... చెప్పింది.

"దేనికి? "- శతాదల్ ఆశ్చర్యంగా అడిగాడు.

"దేనికేమిటి? మామూలుగానే" అంది.

"వస్తే..." మళ్లీ అడిగాడు.

"రైల్వేస్టేషన్‌లో మీ ఇద్దరూ వెళ్లిపోతున్నప్పుడు నేను చూస్తాను" చెప్పింది.

"దీనివల్ల నీకేం వస్తుంది? " కుతూహలంగా అడిగాడు.

"ఒక అద్భుతమైన అవకాశం. నవ్వుకునే సందర్భం..." చెప్పింది మాధురి.

అర్థంకాక అయోమయంగా చూస్తున్న అతని వంక చూస్తూ చెప్పింది.

"నాకు లాభమేమిరాదు. మీ జంటను చూసి కోపం తెచ్చుకొని నాలుగు పనికి రాని మాటలంటాను. ఇప్పుడు మీరన్నట్టుగానే"... అంది.

"ఓహో! అలాగా!" అన్నాడు. జేవురించిన అతని మొహంలోకి నవ్వు తిరిగి ప్రవేశించింది. అతను నవ్వాడు.. మామూలుగా కాదు తెరలు తెరలుగా. భర్తతో మాధురిని చూడగానే అతని మదిలో పుట్టిన ఈర్ష్యాసూయలు మాయమైపోయాయి. క్రోధాగ్ని జ్వాలలు చల్లారిపోయాయి. మండుతున్న నిప్పుల కొలిమి చప్పున ఆరిపోయింది. మాధురి వెళ్లిపోయింది.

ఆ వెనకే అతనూ. ఇంకో ప్లాట్ ఫారమ్ వైపు ఆగిన రైలును వెతుక్కుంటూ. రెండు రైళ్లూ తమ గమ్యాన్ని వెతుక్కుంటూ చెరో దిక్కుగా సాగిపోయాయి వారి జీవితాల మాదిరిగానే. ఒక సన్నివేశానికి తెరతీసిన వెయిటింగ్‌రూం మాత్రం నిశ్చలంగా మారిపోయింది. ఆ సన్నివేశం తాలూకు జ్ఞాపకాలేవీ అక్కడ మిగలలేదు. ఆ జంట టీ తాగిన రెండు కప్పులు, ట్రే తప్ప. V



# Love 'ముద్దు' ముచ్చట్లు

'నిట్టూర్పు లేని ముద్దు ముద్దే కాదు'

- కాసాబ్లాంకా సినిమాలో బెర్టీ హిగ్గిన్స్

'ప్రేమలేని ముద్దు ముద్దు కాదు, ముద్దు లేని ప్రేమ ప్రేమ కాదు'

- మన తెలుగు సినిమా పాట

## ముద్దంటే....

జామెట్రీ ప్రకారం నాలుగు పెదవుల మధ్య గల అతి తక్కువ దూరమే ముద్దు

ఎకనామిక్స్ ప్రకారం ఎప్పుడూ డిమాండ్ కన్నా సప్లై దేనికి తక్కువ ఉంటుందో అది ముద్దు

కంప్యూటర్స్ ప్రకారం ఇద్దరు మనుషులను డేటా కేబుల్ లేకుండా కలిపేదే ముద్దు

ఫిజిక్స్ ప్రకారం మానవ శరీరాన్ని కరెంట్ లేకుండానే ఛార్జ్ చేసేది ముద్దు

సైకాలజీ ప్రకారం బుర్రని మైకంలోకి తోసేసే అద్భుతమైన ఇంద్రజాలం ముద్దు

ముద్దంటే అధర మధుర బంధనం. అధరామృతపానం. వయసుకు వాయనం. వేయి మాటలైనా, అసలు సిసలు శృంగారమైనా చేయలేని పనిని ఒక్క చిన్న ముద్దు చేయగలుగుతుంది. నిర్వచించలేని ఆనందం, హర్షాతిరేకం, ప్రణయావేశం, కామోద్దీపనం, దగ్గరితనం, 'నా' అనే భావం, భరోసా, రక్షణ - ఇలాంటి సందేశాలన్నిటినీ కేవలం ముద్దుద్వారా ప్రకటించవచ్చు. ఒక్కో ముద్దుకి ఒక్కో సందేశం:

చేతిమీద ముద్దు పెడితే- నీ స్నేహం కావాలి

ముక్కు మీద - అందంగా ఉన్నావు

బుగ్గ మీద - నువ్వు నా జీవితంలో చాలా అవసరం

మెడ మీద - నువ్వే కావాలి

పెదవుల మీద - నేను నిన్ను ప్రేమిస్తున్నాను

నుదుటి మీద - నీకు రక్షణనిస్తాను

కళ్ళ మూసుకుంటే - నీ ప్రేమలో పీకల్లోతు మునిగాను

కళ్ళు తెరిస్తే - నీ చేతులెక్కడికి జారుతున్నాయో చూస్తున్నా

## విభిన్నత్వం కోరుకునేవారి కోసం సరదాగా కొన్ని :

1. సీతాకోకచిలుక ముద్దు: ముద్దు కళ్ళతో కూడా పెట్టచ్చు. మీ భాగస్వామి ముఖానికి దగ్గరగా మీ ముఖం పెట్టి కనురెప్పలు వారికి తగిలేలా టపటపా కొట్టండి.

2. స్పైడర్‌మ్యాన్ ముద్దు: ఈ సినిమా చూసిన వారికి ఈ ముద్దేంటో తెలుసు. పురుషుడు తలకిందులుగా ఉండి ప్రేయసి పెదవులను తన పెదవులతో కలపడం. అత్యంత రొమాంటిక్ ముద్దుగా పేరుగాంచిందిది.

3. చాకొలేట్ ముద్దు: ఫ్రెంచ్ కిస్ చేస్తూనే మీ నోట్లో చాకొలేట్ లేదా ఐసుముక్కని తన నోట్లోకి పంపడం. అభ్యాసం కూసు విద్య.

4. వ్యతిరేకముద్దు: మూడొంతులమంది ముద్దు పెట్టుకునేప్పుడు తల కుడివైపుకి వంచు

తారు. అప్పుడప్పుడూ ఎడమవైపుకి కూడా వంచండి.

5. చేపముద్దు: బుగ్గలు లోపలకి లాక్కుంటే పెదవులు ముందుకొస్తాయి చేపల్లాగా. ఇలా ముద్దుపెట్టి పెదవులలానే ఆన్చి నవ్వేసెయ్యండి.

6. దొంగముద్దు: వెనకనించీ కౌగిలించుకోండి. తను తలతిప్పగానే ముద్దాడండి. జుట్టు సవరిస్తూ మెడమీద వేళ్ళు నాట్యం చేయించండి.

7. నూడుల్స్ ముద్దు: నూడుల్స్ ఒకే పోగుని ఇద్దరూ చెరోవైపునుంచీ తినండి పెదవులు దగ్గరయ్యేవరకు. పళ్ళముక్కలు, పిజ్జా కూడా ఇలా తినచ్చు.

8. లిప్‌స్టిక్ ముద్దు: మీ పెదవులతో భాగస్వామికి లిప్‌స్టిక్ వేయడం అనమాట.

9. ఎస్కిమో ముద్దు: ప్రేమపావురాల్లా ముక్కూ ముక్కూ రాపాడించుకోవడం. ముక్కు జారి పెదవిలో పడితే ముద్దే!

10. నేను నువ్వవుతా: భాగస్వామి మిమ్మల్ని ఎలా పట్టుకుంటారో, ముద్దు ఎలా పెట్టుకుంటారో అలా మీరు చేయండి. ఈ ముద్దు ఫీడ్ బాక్ ఇస్తుంది.

11. కవ్వింపు ముద్దు: చెవి, చెవితమ్మె - వీటి మీద ముద్దు జివ్వున ఒళ్ళంతా కవ్వింత తెచ్చిపెడుతుంది.

12. ప్రయాణం ముద్దు: నుదుటిమీద నుంచి మొదలైన ముద్దు చేతులమీదకి, తిరిగి నుదుటి వరకు. మధ్యలో ఎన్ని మజిలీలో.

13. క్లాసిక్ టైప్: చూపులు కలసిన శుభవేళ హృదయస్పందన అధికమవుతుంది. ముందు చేతులు, తర్వాత పెదవులు ఎప్పుడు కలుస్తాయో తెలీకుండానే జరిగిపోతుంది. కళ్లకలక ఉన్నపుడు ఇది ప్రయత్నించకండి సుమా!

14. వాసన ముద్దు: మనదేశంలో బహిరంగంగా ముద్దాడడం తప్పు కాబట్టి అలాంటి సందర్భాల్లో ముక్కుతో ముద్దు పెట్టచ్చు. అయితే శ్వాస పీల్చుకోవాలి, వదలకూడదు. జలుబు చేసినప్పుడు ఈ ముద్దు గురించి మర్చిపోండి.

15. ఒకటే చాలు: ఏదో ఒక పెదవినే ముద్దాడడమనమాట. ఈ ముద్దులో పెదవులు, పళ్ళు, నాలుక - ఇవన్నీ ఉపయోగించవచ్చు.

16. వడ్రంగిపిట్ట ముద్దు: పదేపదే అదే చోటున ముద్దుల ముద్ర వేయడం. చెట్టు బెరడును తొలిచే వడ్రంగిపిట్టను గుర్తు తెచ్చుకోండి.

## ముద్దుతో మోదం

ముద్దాడేప్పుడు కళ్లు మూసుకుంటే స్పర్శజ్ఞానం అధికమవుతుంది. దాంతోపాటే ముద్దులో తన్మయత్వం, సుఖం కూడా. ముద్దులో విడుదలయ్యే ఎండార్ఫిన్లు మార్ఫిన్‌కంటే రెండువందలరెట్లు ఎక్కువ. రోజుకి ఇరవైసెకన్ల గాఢమైన ముద్దులు మూడుపెడితే అరకేజీ బరువు తగ్గచ్చుట. అందుకే ఎలాంటి ముద్దయినా తరచుగా పెట్టండి, ఎక్కువసేపు పెట్టండి. నోరు శుభ్రంగా, దుర్వాసన లేకుండా ఉంచుకోవటం, పెదవులు పొడిగా, గరుగ్గా లేకుండా చూసుకోవటం ముఖ్యం.

చివరగా ఓ మంచి కొంటెమాట. ఏదైనా ఒకరి దగ్గర తీసుకుంది వెంటనే తిరిగి ఇచ్చేయాలి సుమా!

– విక్రమ్

# పాఠకమహాశయులకు మనవి!

**మూ**డున్నర దశాబ్దాలుగా తెలుగు,
భారతీయ భాషలు, ప్రపంచ భాషల్లోని
అత్యుత్తమ కథలతో విశ్వకథావేదికగా
విశేషంగా అలరిస్తున్న **విపుల**
విశిష్ట ప్రయోగంగా
పాఠకదేవుళ్ల జేజేలందుకుంటోంది.




గత ఆరేళ్లుగా కాగితం ఖర్చు,
ముద్రణ, రవాణా, పంపిణీ ఖర్చులు,
అదనపు సాంకేతిక వ్యయాలు
ఇబ్బడి ముబ్బడిగా పెరిగినా
ఇప్పటివరకు **విపుల** ధర పెంచలేదు.




ఇప్పుడీ భారం మరింతగా పెరిగిన
నేపథ్యంలో అనివార్యంగా **విపుల** ధర
సవరించక తప్పడం లేదు.

ఆ మేరకు ఈ నెల నుంచి
**విపుల** విడిప్రతి **12/-** రూపాయలు
అవుతోందని గమనించ ప్రార్థన.




సహృదయ పాఠకులు,
సాహిత్యాభిమానులు పరిస్థితులను
అర్థంచేసుకొని, ఎప్పటిలాగే
ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

విడిప్రతి రూ. **12/-** అయినా
ఏడాది చందా రూ. **140/-**
మాత్రమే!



– మేనేజర్
వసుంధర పబ్లికేషన్స్



# ఆరు రుతువుల అనుభవాలు!



రుతువులన్నీ అలవోకగా మోసే
కాలానికి అలుపు లేదు
క్యాలెండరు మారుతోంది
గడియారంలో పెద్దముల్లు
నడుస్తూనే ఉంది!
చెక్కిలి నంటిన నిన్నటి గుసగుసలింకా
తడి ఆరని తీపి ముద్రలై మెరుస్తున్నాయి
అటుమొన్నటి కలలు
వాస్తవ జీవిత దృశ్యాలై
పలకరిస్తున్నాయి!
ఈ దోసెడు అనుభవాలు
గులాబీల దొంతరలై
పారిజాతాల పరిమళాలై,
సన్నజాజుల సౌకుమార్యాలై
ఏ రాగానికీ అందని అనురాగాలై
గుండె సవ్వడులై, సెలయేరు గలగలలై
ఏ ఇంద్రధనుస్సో విదిల్చిన సప్తవర్ణాలై
జీవితం మరింత విస్తారమై ఊరిస్తూంటే
దాచిపెట్టిన తాయిలాల మూటల్ని విప్పి
ఇంకెన్నెన్నో అనుభవాల్ని,
మరెన్నెన్నో అనుభూతుల్ని
చూపిస్తా రా రమ్మంటూ
ఆశల పల్లకి ముంగిట్లోకి వచ్చి నిలబడింది
భవితలోకి నడిచే లేత పాదాల వెనుక
జలతరంగిణీ ఝురుల్ని
ప్రవహింపచేస్తోంది!

– నేరెళ్ల అనురాధ

# నిరీక్షణ

మూడుముళ్ల బంధంతో ముడివేసి
దూరతీరాలకు వెళ్లావు
మాటలతోనే ఊరిస్తావు...
స్వప్నాల్లో కనిపిస్తూ కవ్విస్తావు!
నీవు దోచుకున్న నా వలపు సామ్రాజ్యానికి
దూరంగా ఉండి గాలిపటంలా
ఆశలు రేపుతావు!
నా నాలుకపై నర్తించేది నీ నామమే
నా దేహంలో దోబూచులాడేది నీవే!
నా కనులకు విశ్రాంతి లేదు నీ నిరీక్షణలో
నీ కోసం నాలోని
అణువణువూ అడుగుతోంది
నామీదే అలుగుతోంది!
నా నుదుట నీవద్దిన తిలకం
తిరిగి నీకు దిద్దాలని ఎదురుచూపులు
నీవు తొడిగిన గాజులు
సవ్వడి చేయడం మానేసాయి
సవరించే చేతులు లేవని!
నీవు పెట్టిన మెట్టెలు
నీ ఊసులే చెప్తున్నాయి
పారిజాతపు పారాణి క్రమంగా
కనుమరుగైపోయింది



నీలికురులు సైతం
బేలచూపులు చూస్తున్నాయి
తమను నిమిరే ప్రేమహస్తం చెంత లేదని!
సిగలో ముడిచిన మల్లెల కలవరింతలు
పులకించే హృదయం లేదని!
కాలం పొరలలో
మరుగునపడిన స్వప్నం మరల
ప్రాణం పోసుకుంటుందేమోనని!
నీ సందేశమైనా... ఓ మలయపవనంలా
పలకరించి పోతుందేమోనని..
అలుపెరుగని నిరీక్షణ!

– శ్రీస్వర్ణ

# నేనెవరిని? - 25

**రూ.100/- బహుమతి**

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| | | | | |

**నేను ఐదు అక్షరాలతో** రసాలన్నిటిలో శృంగారం శ్రేష్ఠమని చెప్పే పదాన్ని. నన్ను **కనుగోడానికి ఆధారాలివిగో...** 1. నాలుగు, ఒకటి అక్షరాలు కలిపితే ముసలితనము. 2. మూడు, ఐదు అక్షరాలు కలిపితే 'వస్త్రాము' కు వ్యతిరేకం. 3. రెండు, ఒకటి, ఐదు అక్షరాలు కలిపితే దండ. 4. ఐదు, ఒకటి అక్షరాలు కలిపితే చంద్రగుప్తుడి తల్లి. మరి నేనెవరినో చెప్పండి.

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| | | | | |

**నేను ఐదు అక్షరాలతో** నాయికానాయకుల కలయికను తెలియజెప్పే పదాన్ని. నన్ను **కనుగోడానికి ఆధారాలివిగో...** 1. ఒకటి, నాలుగు, ఐదు అక్షరాలు కలిస్తే సమానమని అర్థం. 2. రెండు, ఒకటి, ఐదు అక్షరాలు కలిస్తే నెల. 3. రెండు, నాలుగు అక్షరాలు కలిస్తే పిల్ల నిచ్చిన వాడు. 4. ఒకటి, మూడు, ఐదు అక్షరాలు కలిస్తే అర్ధభాగం. నేనెవరినో చెప్పుకోండి.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| | | | | | |

**నేను ఆరు అక్షరాలతో ఆనందమయ జీవితం గడిపే స్త్రీలను చెప్పే పదాన్ని.** నన్ను **కనుగోడానికి ఆధారాలివిగో...** 1. మూడు, ఐదు, ఆరు అక్షరాలు కలిస్తే భార్యలు, పతివ్రతలు, స్త్రీలు. 2. రెండు, ఆరు అక్షరాలు కలిస్తే అవినీతి కేసుల్లో జైలుపాలయి, ఇటీవలే బెయిలు మీద విడుదలైన ఇక మాజీ ముఖ్యమంత్రి. 3. నాలుగు, మూడు అక్షరాలు కలిస్తే చిన్నపిల్లలకు మాటలు బాగా రావడానికి పోసే దినుసు. 4. ఐదు, ఆరు, నాలుగు అక్షరాలు కలిస్తే నీచుడు, తుంటరి. మరి నేనెవరినో చెప్పండి.

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| | | | | |

**నేను ఐదు అక్షరాలతో** నేటి యువతను తెలియజెప్పే పదాన్ని. నన్ను **కనుగోడానికి ఆధారాలివిగో...** 1. ఒకటి, నాలుగు, ఐదు అక్షరాలుతో రక్తనాళం. 2. రెండు, నాలుగు ఐదు అక్షరాలు కలిస్తే భక్తుడికి భగవంతుడు ఇచ్చేది. 3. రెండు, ఒకటి, ఐదు అక్షరాలు కలిస్తే తోట, అరణ్యం. 4. ఒకటి, మూడు, ఐదు అక్షరాలు కలిస్తే వంగినది, నమస్కారం. మరి నేనెవరినో చెప్పండి.

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా: ----------------------------------

----------------------------------------------------------

----------------పిన్ : ------------ ఫోన్ : ----------------

**నిబంధనలు**

✷ 'నేనెవరిని?' ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✷ ఇచ్చిన ఆధారాలకు అనుగుణమైన పదాన్నే గళ్లలో నింపాలి. ✷ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✷ ఆల్ కరెక్ట్ రాసినవారే విజేతగా నిలుస్తారు. ✷ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✷ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా ద్వారా విజేతను ఎంపిక చేస్తాం. ✷ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

పంపాల్సిన చిరునామా : **నేనెవరిని?**
విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

**చివరి తేది : ఫిబ్రవరి 18**




# పరామర్శ

## మనసుని కదిలించే కథలు

'విపుల'తో ఇరవై ఏళ్ల అనుబంధం నాది. ప్రపంచ కథకు గవాక్షం విపుల! తేటతెలుగులో విశ్వకథా సాహిత్యాన్ని, భారతీయ కథా సాహిత్యాన్ని అందించే ఏకైక పత్రిక 'విపుల'. ఇది తెలుగువారిని మాత్రమే వరించిన అదృష్టం. లాభాపేక్ష లేకుండా విపుల, చతురలు సాగిస్తున్న కృషి అచ్చంగా సాహితీసేవే! ఈ క్రతువులో అహర్నిశలు శ్రమిస్తున్న రామోజీరావుగారికి శిరస్సు వంచి వందనం చేస్తున్నా.



నెలనెలా అద్యంతం ఆకట్టుకునే కథలు అందించడం 'విపుల'కే సాధ్యం. వినోద, విజ్ఞానాలతోపాటు మానవీయ, సామాజికాంశాలను అందిస్తుంటాయి విపుల కథలు. ఇంకా ఎన్నెన్నో విలువైన శీర్షికలు, జోకులు విపుల సొంతం. దైనందిన జీవితంలో ఒత్తిడులతో అల్లాడే వ్యక్తులు విపుల పఠనంవల్ల సేద తీరుతారనడంలో అతిశయోక్తిలేదు.

జనవరి 'విపుల'ను ఇటీవలే చదివాను.. ముఖ్యంగా తెలుగు కథలు మనసు కదిలించేలా ఉన్నాయి. నిజజీవితానికి దగ్గరగా ఉన్నాయి. కుటుంబంలో తల్లిదండ్రులకు జరగరానిది జరిగితే దాని ప్రభావం కుటుంబం అంతటిపైనా పడుతుంది. ముఖ్యంగా చిన్నారుల పరిస్థితి అల్లకల్లోమైపోతుందని బీపీ కరుణాకర్ కథ 'సలోమి' తేటతెల్లం చేస్తుంది. కథ చదువుతుంటే మనసు ద్రవించింది.

సంస్కృత కథ 'ఆక్రమణ' కూడా అంతే. తన ఇంట్లో తనే పరాయిగా బతకాల్సిరావడం ఎవరికైనా శాపమే. మంచి మనసుతో సాయం చేద్దామన్నా- కోడలు కసురుకోవడం, చిన్నబుచ్చడం పగవాడికి కూడా వద్దనిపిస్తుంది. చిట్టచివరికి చనిపోయిన తన భార్యకు మనసారా నివేదన పెట్టలేని దుస్థితి ఆ మామగారిది. చదువుతున్నంతసేపూ కళ్లు చెమ్మగిల్లుతూనే ఉన్నాయి.

అలాగే వాలి హిరణ్మయీదేవి 'స్వప్న సాకారం'. తల్లికి పిల్లలు ఎంత ఎదిగినా చిన్నపిల్లల్లాగే కనిపిస్తారు. ఎన్ని తప్పులు చేసినా క్షమించే ఓర్పు తల్లికి మాత్రమే ఉంటుంది. కూతురు దీప్తి తన తప్పు తెలుసుకుని తల్లి కోరిక సాకారం కావడానికి పూనుకోవడం ఎంతో బాగుంది. ఈ కథ ద్వారా సమాజానికి మంచి సందేశం అందించారు రచయిత్రి.

ఇలాగే మిగిలిన కథలన్నీ మనిషిలోని భావోద్వేగాలకు పెద్దపీటవేస్తూ, మానవీయతకు మారాకు తొడుగుతూ సంచిక ఆసాంతం గుబాళించాయి. వందల సంఖ్యలో వచ్చే కథల్నించి ఇలాంటి అత్యుత్తమ కథల్ని ఎంపిక చేసి, పాఠకులకు అందించడానికి సంపాదకవర్గానికి ఎంతో శ్రద్ధ కావాలి. ఎంతో నిబద్ధత కావాలి. సృజనాత్మకత కావాలి. ఈ విషయంలో వారు నూరు శాతం కృతకృత్యులయ్యారు. సందేహంలేదు. వారికి నా అభినందనలు. గత ముప్పై ఆరేళ్లుగా విపులను ఆదరిస్తున్న పాఠకలోకానికి నా శుభాకాంక్షలు. అభినందనలు.

అలాగే సంచికలోని ప్రపంచ భాషల కథలూ, భారతీయ కథలూ కూడా చాలా చాలా బాగున్నాయి. ఇవన్నీ కేవలం టైంపాస్ కథలు కాదు. ఆరోగ్యకరమైన కథలు, సమాజానికి అవసరమైన కథలు!

– కె. ఎం. రాధాకృష్ణ
సినీ సంగీత దర్శకులు

